పరమేశ్వరే" అన్నాడు. "ఈ జగత్తుకు తల్లితండ్రులు సతీ బాలబ్రహ్మేశ్వరు లని" కవి ఈ ప్రబంధ రచన ద్వారా పాఠకునికి మహత్తర సందేశాన్ని అందిస్తున్నాడు. సతియే హిమవంతుని కుమార్తె పార్వతిగా జన్మించి శివుని వలచి వలపించి వివాహమాడి అర్ధ శరీరాన్ని పొందినది. దీనిని కాళిదాసు కుమార సంభవ కావ్యంగా సంస్కృతంలో వ్రాయగా, శ్రీనాథుడు హరవిలాసంలో దీనిని హృదయంగమంగా అనువదించాడు.

ఇలా ఒక పౌరాణిక గాథలో సగభాగాన్ని మాత్రమే గ్రహించి దాని తాత్పర్యార్థం దెబ్బ తినకుండా ప్రబంధీకరించడంలో తన సంప్రదాయ రహస్య వేత్తృతను ప్రదర్శించిన కవి ఎంతో ధన్యుడు.

కావ్యకథా సంగ్రహం:

ఈ కృతిని కవి ఆశ్వాసాంత గద్యల్లో మహా ప్రబంధంగా పేర్కొన్నాడు. ఇది మూడాశ్వాసాల ప్రబంధం. ఆశ్వాస క్రమంగా కావ్యకథ యిలా వుంది.

ప్రథమాశ్వాసంలో దక్షుడు తన కూతురైన సతీదేవిని శివునికిచ్చి వివాహం చేసిన కథను తెలుపమని నైమిశారణ్యంలోని మునులు సూతుని ప్రార్థిస్తారు. అప్పుడు సూతుడు మునులకు సతీ బాలబ్రహ్మేశ్వరుల పరిణయం యిలా చెప్పడం ప్రారంభించాడు.

దక్ష ప్రజాపతి స్వాయంభువ మనువు కూతురైన ప్రసూతి యందు 16 మంది పుత్రికలను కని, వారిలో 13 మందిని ధర్మునికి, ఒకరిని అగ్నిహోత్రునికి మరొకరిని పితృదేవతలకు యిచ్చి పెళ్ళి చేస్తాడు. చివరి కూతురైన సతీదేవికి శివుడు స్వప్నంలో సాక్షాత్కరించి ఆధ్యాత్మ, వేదాంత విషయాలను బోధించి విశ్వరూపం చూపుతాడు. సదాశివుని రూపాన్ని స్వప్నంలో చూసిన సతీదేవికి శివునిపై వలపు కలుగుతుంది.

ద్వితీయాశ్వాసంలో సతీదేవి తన స్వప్న వృత్తాంతాన్ని చెలులకు చెప్పి విరహంతో మూర్ఛపోతుంది. అప్పుడు కీరవాణి అనే చెలికత్తె యిలా చెబు తుంది "కామరూప ధరత్వంబు, నభః సంచారంబు మహాత్ములకుదక్క నితరు లకు గానరాకుండుట, ఏ దేవతలనైన కనుంగొను శక్తి" మొదలైన విద్యలు మహా తపోధనుడైన నా తండ్రి అనుగ్రహంవల్ల నాకు తెలుసు. కాబట్టి నేను సదాశివుని కడ కెళుసుకొని సతీదేవి వృత్తాంతం అతనికి తెలియజేస్తానని చెబుతుంది. ఈ

దండి చెప్పిన అష్టాదశ వర్ణనల్లో ఒక్క యుద్ధ, కుమారోదయ మధుపాన రతోత్సవ వర్ణనలు తప్ప తక్కిన పదునాల్గు వర్ణనలు ఈ కావ్యంలో చోటు చేసికొన్నాయి. ఈ కథ దేవతా విషయిక వివాహ వర్ణనం కాబట్టి యుద్ధప్రసక్తి లేదు. ముందే చెప్పినట్లు లోకకల్యాణార్థం శివుడు శక్తి సమేతుడగుట యిక్కడి పరమార్థం కాబట్టి మధుపాన రతోత్సవ కుమారోదయ వర్ణనల కీ కథలో తావు లేదు. యుద్ధ సంబంధమైన మంత్ర, దూత, ప్రయాణ, నాయకాభ్యుదయాలు వివాహ పరంగా యిక్కడ అన్వయింపబడ్డాయి. శివుడు శక్తిసమేతుడు కావడమే నాయకాభ్యుదయం. 'శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం' అని శ్రీ శంకరులు సౌందర్యలహరిలో చెప్పారు. శివుడు శక్తి సహితుడు కాకుంటే స్పందనంగా ఏమీ చేయజాలడు. శక్తికి అంతటి ప్రాధాన్యముంది. శివుడు ప్రకాశాంశ! తల్లి శక్తి విమర్శాంశ! ప్రకాశం విమర్శతో కూడినపుడే జగత్తులో చైతన్యం ఏర్పడుతుంది. లేకుంటే అది నిర్జీవ పదార్థమే! అదీ 'శక్తి' యొక్క వైశిష్ట్యం! సతీదేవి శక్తిస్వరూపిణి కావడం ఈ కావ్యేతివృత్త పరమార్థం? అది శివుని వివాహానంతరం జరిగిన కథ—కాని వివాహాత్పూర్వం ఆమె అందరు నాయికలవలె స్వప్నంలో నాయకుని దర్శించి విరహానికి లోనై మన్మథ చంద్రాదుల దూషించి చెలికత్తెను రాయబారం పంపి శివుని వివాహమాడింది కదా! ఆ కథలో అష్టాదశ వర్ణనలు వచ్చాయి. కవి చెప్పిన కథ వివాహం వరకే! ఆ తర్వాతి కథలో ఆమె అష్టాదశ స్థానాలలో వెలసిన శక్తిస్వరూపిణి కావడం జగత్కల్యాణార్థం! అది ఆధ్యాత్మికయోగ రహస్యం? శివుడు శక్తిసమేతుడు కావడం— అన్నమాట!

ఇప్పు డీ కావ్యంలో వచ్చిన పదునాల్గు వర్ణనలు చూద్దాము. ప్రథమాశ్వాసంలో—వసంతకాల వర్ణనం, వనవిహార వర్ణనం, జలక్రీడా వర్ణనం, సూర్యాస్తమయ వర్ణనం, చంద్రోదయ, చంద్రికా వర్ణనం, చంద్ర మన్మథ సమీరణుల దూషించడం – విరహ వర్ణన, ప్రభాతకాల వర్ణనం, సూర్యోదయ వర్ణనం.

ద్వితీయాశ్వాసంలో సతీదేవి విరహంవలన మూర్ఛ పొందడం, కీరవాణీ దౌత్యం, అలంపురీ పట్టణ వర్ణనం.

తృతీయాశ్వాసంలో ప్రావృట్కాల వర్ణనం, దక్షుడు సతికి వివాహమంత్రాలోచనం చేయడం, అలంపురానికి బ్రాహ్మణు లిద్దరిని పంపడం, శివుడు (బాల

బ్రహ్మేశ్వరుడు) దక్షనగరానికి ప్రయాణమై వచ్చుట, వివాహ వర్ణనము. శివుడు సతీసహితంబుగా అంతర్గృహంబు చేరుట—ఇవి పదునాల్గు వర్ణనలు.

స్థలమాహాత్మ్య కావ్యం :

ఒక స్థలమాహాత్మ్య కావ్యానికి తీర్థం, క్షేత్రం, దైవం ఈ మూటి యొక్క ప్రశంసలు అనివార్యం. 'సతీ బాలబ్రహ్మేశ్వర పరిణయ' మనే ఈ మహా ప్రబంధంలో క్షేత్రము—అలంపురం; దైవం—జోగుళాంబ రూపంలో వెలసిన శక్తి, పతి—బాలబ్రహ్మేశ్వరుడై వెలసిన శివుడు. తీర్థం—తుంగభద్రానది, దానిలోని 64 తీర్థాలు. ఇవి ధర్మవిదుడనే మహాత్మునిచే కీరవాణికి చెప్పించడంలో కూడా కవి వక్రోక్తిచిత్యాన్ని పాటించాడు. ఆ పట్టికలు కావ్యంలో విస్పష్టంగా చెప్ప బడ్డాయి. కాబట్టి యిక్కడ చర్వితచర్వణం చేయడంలేదు. ఇక, క్షేత్రమాహాత్మ్యం అష్టాదశ శక్తిపీఠాలలోనే యిమిడి వుంది. కాబట్టి కవి కావ్యాంతంలో సతీ బాల బ్రహ్మేశ్వరులు వివాహానంతరం అంతర్గృహంబు చేరిన తర్వాత "మహాశక్తి యగు ప్రకృతి అష్టాదశ నామధేయంబుల నష్టాదశ పీఠంబులందు విధానాన్ని చెప్పడంతో క్షేత్రమహాత్మ్య కావ్యం యొక్క ధ్యేయం సంపూర్ణంగా నెరవేరింది. ఇది కూడ సంస్కృత మూల శ్లోకాలతో, తెలుగు వచనావాదంతో కావ్యంలో తృతీయాశ్వాసంలో చెప్పబడడంచేత యిక్కడ పునరవృత్తి చేయడంలేదు.

సాంఖ్య తత్త్వదర్శనం:

ఈ కావ్యంలో ప్రథమాశ్వాసంలో సదాశివుడు సతీదేవికి స్వప్నంలో సాక్షాత్కరించి ఉపదేశించిన అధ్యాత్మ యోగము సాంఖ్య తత్త్వమే. దీనిని కవి శ్రీమద్భాగవతంలో వ్యాసుడు, పోతనలు ప్రథమ స్కంధంలో, కర్దమ ప్రజాపతి, దేవహూతులకు పుట్టిన కపిలుడు, తన తల్లియైన దేవహూతికి ఉపదేశించిన సాంఖ్య తత్త్వం నుండి గ్రహించినట్లు చెప్పవచ్చు. ఇది ప్రత్యేకించి పరిశీలించదగిన అంశం. కవి తాత్త్వీక దృష్టి కిది నిదర్శనం.

ఛందః శిల్పం:

చంపూ పద్ధతిలో రచింపబడిన ఈ కావ్యంలో సాధారణంగా కవులు ప్రయోగించే ఉత్పలమాల, చంపకమాల మత్తేభం, శార్దూలం, వంటి వృత్తాలే కాక, సీసము, తేటగీతి, అటవెలదుల్ని కూడ విరివిగా వాడినాడు. సుదీర్ఘములైన వచన భాగాలు వర్ణనల్లో చోటు చేసికొన్నాయి. సాధారణంగా పుష్పాపచయ ఘట్టంలో 'రగడల'ను ప్రయోగించడం ప్రబంధ కవులకు పరిపాటి కాగా ఈ కవి జలక్రీడా వర్ణనాన్ని 'రగడ'లో చేశాడు. వేదాంత బోధలోను వచనాన్ని వాడడంలో ఈ కవి తన నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. వేదాంత బోధనకు వచనం చక్కని వాహిక అనడంలో సందేహం లేదు. అశ్వాసాంత పద్యాల్లో సుగంధి, కవిరాజ విరాజితం, మాలిని, పంచచామరం, మత్తకోకిల, తరళ, భుజంగ ప్రయాతం వంటి విశేష వృత్తాలు వాడడమేకాక సందర్భోచితంగా ఆయాచోట్ల స్తుతులలో కందపద్యాష్టకం, దండకం, వివాహ సందర్భంలో 'శుభలేఖ'ను నేటి పద్ధతిలో వ్రాయడం వంటివి కవి యొక్క ఔచితీ పరిజ్ఞానానికి నిదర్శనాలు. కావ్యాంతంలో కావ్యరచనకు ప్రేరణను చెప్పడం, కృతిభర్తను ప్రశంసించడం కూడ ఒక కొత్త పద్ధతిగానే చెప్పవచ్చు. పోతనవలె అంత్యాను ప్రాసలు, యమకాలు, విరివిగా వాడకపోయినా ఈ కవి రచన సరళమై, సరసమై, సుబోధకంగా ఉందని చెప్పవచ్చును.

కవి ఔచిత్య పరిజ్ఞానం - లోకజ్ఞత:

లోకజ్ఞుడైన, నన్నయవలె ఈ కవి కూడ ఈ కావ్యంలో తన 'లోకజ్ఞత'ను ప్రదర్శించి, ఔచిత్య పరిజ్ఞానాన్ని చాటినాడు. ఇందులో అవాంతర కథగా శివుడు, కీరవాణికి చెప్పిన 'పురాతనమైన యితిహాసం' 'కాంచనాంగి మాంత్రికుల కథ'లో సతీదేవికి స్వప్నం వచ్చిందని, శివుడు సాక్షాత్కరించాడని, ఆమె వలచిందని, విరహం పొందుతోందని చెలికత్తె వచ్చి చెప్పిన వెంటనే శివుడు దాన్ని ఒప్పుకొని వివాహ ప్రయత్నాలు చేయడం అనౌచిత్యంగా భాసిస్తుంది కాబట్టి, శివుడంతటి అంత రింద్రియ నిగ్రహం కలవాడు అలా చేయడం ఔచిత్యం కాదు కాబట్టి, శివునిచేత కవి ఈ అవాంతర కథను చెప్పించి కీరవాణి వాదాన్ని త్రోసి పుచ్చాడు. ఆ కథలోని నీతి ఏమనగా—"అతికుపితలగు యువతుల మనమ్ములు నమ్మి సంచరించి కాముకుల కాపద్ధ లరుదెంచు టాశ్చర్యంబె?"

తే. గీ. మాన్యు లెఱుఁగినఁ బాటిల్లు మానహాని
ప్రభువు లెఱుఁగినఁ బాటిల్లుఁ బ్రాణహాని
గానఁ జనకూడ దిటువంటి కార్యములకు
వారిజానన, విను మెట్టి వారికైన

కం. ఎక్కడి సతి యెక్కడి నీ
వెక్కడి వృత్తాంత మెవ్వ రెఱుఁగుదు రిచటన్
నిక్కమని నీదు పల్కులు
మక్కువతో నమ్మఁదగదు మాకు మృగాక్షీ! (2; 166-168)

అని చివరికి, "ఓ కీరవాణీ! నీ మనోభావంబుఁ దెలియుటకై యట్లు బలికితిమి గాని నీ వచనంబులుఁ దథ్యంబులగు" నన్నాడు బాలబ్రహ్మేశ్వరుడు. నిండు సభలో నేను నీ భార్యను, వీడు నీ కుమారు డన్న శకుంతలకు దుష్యంతు డేమి సమాధాన మిచ్చాడో, ఆ విధంగా "సర్వజ్ఞుడై"న శివుడే 'లోకజ్ఞత' లేక ప్రవర్తిస్తే యిక సామాన్య ప్రజల మాట ఏమి? అని కవి శివుని ఉదాత్తశీలాన్ని పై అవాంతర కథ ద్వారా ప్రతిపాదించి, "నాయకుడైన శివుడు కాముకుడు కాడు. ఇంద్రియ నిగ్రహం కలవాడు" అని ఔచితవంతంగా పై అవాంతర కథను శివుని ముఖతః చెప్పించినాడు.

### ఉదాత్తమైన ప్రబంధం :

శివమహాదేవునికి సౌమ్య ఉన్నట్లే, శక్తికి కూడ సౌమ్య, ఉగ్రమూర్తులున్నారు. సతీదేవి కథ ఉగ్రమూర్తి ప్రాదుర్భావానికి సంకేతం కాగా పార్వతీదేవి కథ సౌమ్యమూర్తి ప్రాదుర్భావానికి ప్రతీక! శివాలయాల్లో పార్వతితో కూడిన శివుడు సౌమ్యమూర్తి. దేవి యొక్క ఉగ్ర లేక కరాళరూపం శక్తి! అది వేరుగా దేవాలయాల్లో ఉంటుంది. అందుకే వైష్ణవులు కూడ ఉగ్రనరసింహుని ప్రహ్లాదుడు శాంతింపజేశా డంటారు. ఆ సౌమ్యమూర్తి లక్ష్మీనృసింహుడు. ఇలా దేవతా సంబంధమైన కథల్లో మానవ సంబంధమైన వివాహానంతర జీవితం వర్ణింపబడదు.

వారి వివాహం కేవలం లోకకల్యాణార్థమే. ఆముక్తమాల్యదలో గోదా శ్రీరంగేశులు వివాహానంతరం గర్భగృహంలో ప్రవేశించినట్లుగా, సతీ బాలబ్రహ్మేశ్వరులు కూడ వివాహానంతరం అంతర్గృహాన్ని ప్రవేశించినట్లుగా చెప్పబడింది. అంటే ఏమి? వారు తిరిగి దేవతాంశలో ప్రవేశించారన్న మాట! కాబట్టి కవి వెంటనే అష్టాదశ శక్తిపీఠ వర్ణన చేశాడు. అలంపురంలో 'జోగుళాంబ' వెలసిందన్నాడు. కవి ఎందుకు దక్షధ్వరధ్వంసాదులు వర్ణించలేదంటే పోతనగారు ప్రత్యేకంగా 'వీరభద్ర విజయం' వ్రాసియుండగా తాను తిరిగి ఈ ప్రబంధంలో చర్విత చర్వణం చేయడం అనవసరమని తలచడంలో ఎంతైనా ఔచిత్యం వుంది. పైగా కవికి 'సతీ బాలబ్రహ్మేశ్వరుల పరిణయ వృత్తాంత వర్ణనమే ప్రబంధ ధ్యేయం కాబట్టి యజ్ఞవిధ్వంస కాండను, శివుని ఉగ్రమూర్తిని వర్ణించలేదు. అలాగే వివాహపూర్వం సతీదేవి రూపమే కవికి ఆరాధ్యం, ఉగ్రస్వరూపిణియైన జోగుళాంబ కాదు.



# శ్రీ సతీ బాలబ్రహ్మేశ్వర పరిణయము

## విషయ సూచిక

### ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

బొడ్డిచర్ల చెన్నకృష్ణకవి ప్రణీతంబైన

# సతీ బాలబ్రహ్మేశ్వర పరిణయము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీ కాంతాకుచకుంభ లగ్నమగుచున్ చెన్నొందు కస్తూరికా
స్తోకాంకంబునురస్స్థలిన్ మెఱయ సుశ్లోకుల్ నిరీక్షించి పృ
థ్వీ కాంతామణి నా రమాసతి కడన్ ప్రీతిన్ తగన్ తాల్చె నం
చేకాంతంబున మ్రొక్కఁగన్గొను హృషీకేశుండు నన్ బ్రోవుతన్. 1

శా. శ్రీనిర్వాణ పదంబుఁ గోరి మదిలో సేవించెదన్ భక్త లో
కానందప్రదు గోపికాజన మనోజ్ఞాకారునిన్ భూరి వి
జ్ఞానోత్తంసుని దుష్టరాక్షస చమూ సంహార చాతుర్యునిన్
దీనాధారుని నంద నందనుని సద్విద్యాఢ్యునిన్[1] కృష్ణునిన్. 2

ఉ. మోముల వేదముల్ మొరయ ముందు మరీచి ముఖ ప్రజాపతుల్
నేమముతో భజింప సుముని ప్రకరంబు నుతింప సంతత
శ్రీమహిమోన్నతిన్ తనరఁ జెల్వగు నంకమునందు భారతీ
భామఁ జెలంగ లోకములఁ బాలన సేయు విధాతఁ గొల్చెదన్. 3

ఉ. ఎవ్వఁడు సర్వకార్యముల నెల్ల జగంబుల నగ్రపూజితుం
డెవ్వఁడఖండ విద్యలను నింపుగ భక్తుల కిచ్చు సద్గురుం
డెవ్వఁ డమేయ విఘ్నముల నేపడగించి శుభంబు లిచ్చు వా
డెవ్వఁడజేయుఁ డట్టి విబుధేశు గణేశు నుతింతు నెప్పుడున్. 4

చ. అరుదుగ నద్రిరాట్ తనయ నర్ధ శరీరము నందుఁ దాల్చి భా
సుర శిరమందు గంగనిడి సోమునిఁ బుష్పముగా ధరించి సు

---

1. మూలప్రతిలో, "స, ధ్విరాఢ్య, నిన్" అని 'జగణం'బే గణ భంగం, పైగా ముద్రాక్షసం, 'తగణం' రావలసివుంది కాబట్టి, "స; ద్విద్యాఢ్య, నిన్" అనేది సరియైన పాఠం.

స్థిరముగ రత్నపీఠమునఁ జెల్వుగ నుండి జగంబులేలు సుం
దర భుజగేంద్ర భూషణుఁడుదారుఁడు శంభుఁడు మమ్ము నేలుతన్ 5

చ. ఇహపరలోక సౌఖ్యముల నెల్ల నొసంగెడుఁ గర్మరాశికిన్
బహుతర కారణంబగుచుఁ బ్రాజ్ఞులు మెచ్చ నజాండ పంక్తులన్
బహుళ ధనంబులం దనిపి బంధురలీల మురారిఁగౌఁగిటన్
విహితము గా మెలంగు సిరి వేడుక మా కొసఁగున్ సుసంపదల్. 6

ఉ. మానుగ నక్షర స్ఫటికమాలిక వ్రేళ్ళ సమర్చి వేదకాం
తా నివహంబుఁ గొల్వఁ బలు సకల విద్యలకెల్ల విల్లనం
గా, నవపుష్పహారము సిగన్ దళుకొంద విధాత చెంగటన్
గాన మొనర్చు భారతి సుఖంబుగ నా మది నుండు నెప్పుడున్. 7

సీ. ఘనరత్న ఖచితమౌ కర్ణకుండల కాంతి
గగనంబునకు మేలు కట్టొనర్చ
కుదురుగాఁ దీర్చిన నుదుటి కుంకుమ రేఖ
దీప్తి దిక్పతులకుఁ దేజ మొసఁగఁ
దరళమై యొప్పారు తారహార ద్యుతిఁ
జెలరేగిఁ బుష్పవర్షంబుఁ జేయ
మధురంబుఁ గుల్కెడు మందహాసచ్ఛవి
లలితమై రేయెండ నలవరింప

విబుధకాంతలుఁ దనచుట్టు వేడ్కఁ గొలువ
ఘనతరంబుగ మందార వనమునందు
సంతసంబున విహరించు శర్వురాణి
మించు దయతోడ మమ్ము రక్షించుఁగాత! 8

మ. ఘనమై, సుందరమై, నిరంతర జగత్కల్యాణమై, భూరి స
జ్జన సేవ్యంబగు భారతంబను మహా సంతాన భూజంబనన్
వినుతింపందగు పర్వశాఖలనుఁ దెల్పెన్ క్రీడ గావించు మో
హన తేజోనిధియైన వ్యాస శుకులన్ హర్షంబుతోఁ గొల్చెదన్. 9

## పూర్వ కవి స్తుతి

తే. గీ. లలితకాండ తరంగ సంకలిత మగుచుఁ
బ్రబలు రామాయణామృత వార్ధి యందు
నంచితానందమున విహరింపుచున్నఁ
జారు వాల్మీకి రాజహంసంబుఁ గొలుతు 10

తే. గీ. విమల గీర్వాణ భాషా ప్రవీణుఁ డగుచు
భాసురంబుగఁ గవిసార్వభౌముఁ డగుచు
మానితంబుగ బుధలోక మాన్యుఁ డగుచు
సొంపుఁ దులకించుఁ గాళిదాసును స్మరింతు 11

సీ. రామాయణ గ్రంథరాజంబుఁ దెనుగున
విరచించినట్టి భాస్కరునిఁ బొగడి
హరిహరార్పణముగా నైదవ వేదంబు
నాచరించిన సోమయాజిఁ గొలిచి
భగవత్ప్రియంబుగా భాగవతము నర్థి
నొనరించినట్టి పోతనకు మ్రొక్కిఁ
దగనాంధ్ర కవితా పితామహుం డలసాని
పెద్దనార్యునకు సంప్రీతి నెఱిగిఁ

ప్రౌఢ కవి మల్లనార్యునిఁ బ్రస్తుతించిఁ
బాపరాజ కవీంద్రునిఁ బ్రణుతి సేసి
సరసకవి రామకృష్ణుని సంస్తుతించిఁ
మరియుఁ దక్కిన కవుల నెమ్మదిఁ దలంచి 12

తే. గీ. ఆంధ్రభాషా మనోహర హారమునకు
దివ్యరత్నంబునాఁ దగిఁ దేజ మెసఁగ
నెల్ల కవులకు నాది కవీంద్రుఁ డగుచు
ఘనత నొప్పారు నన్నయార్యుని భజింతు. 13

## గురు స్తుతి

సీ. బాల్యంబునందు నే బాధ లంటగ నీక
నే తల్లిఁ గరుణ నన్నెత్తి పెంచె
[1]నాటగాయలతోడ నాడ నివ్వకఁ బ్రీతి
నే తల్లిఁ జదువు నా కెనయ నేర్పెఁ
దగ భారతాది సద్గ్రంథార్థములఁ దెల్పి
యే తల్లి నన్ను వినీతుఁ జేసెఁ
జూపులోన నఖండ రూప మేర్పడఁ జూపి
యే తల్లి నన్నుఁ బునీతుఁ జేసె

రాజితంబైన యమునక్కరాజమందుఁ
దవిలి వర్తింపు మనుచు నే తల్లిఁ జెప్పె
నా మదంబకు భ్రమరాంబ కనుదినంబు
వందన మొనర్తు ముక్తినిఁ జెందు కొరకు. 14

మ. కరమొప్పారెడు వైష్ణవాన్వయ మహాకల్యాణ వారాశికిన్
గరిమన్ పూర్ణ శశాంకుఁడై బ్రవిలసత్కారుణ్య సంయుక్తుఁడై
వరుసన్ సద్రఘువంశ, మాఘ ముఖ కావ్యగ్రంథ పాఠంబు నా
కరుదారన్ దగఁ జెప్పినట్టి గురు రామాచార్యులన్ గొల్చెదన్ 15

మ. ధరణిన్ శాసుల నాటి వంశవన మందారంబునై, సత్సభా
భరణంబై శివ మంత్రరాజమును సత్ప్రీతిన్ కటాక్షించినన్
ధరఁ బుణ్యాత్మునిగా నొనర్చిన మహాధన్యాత్ము డంచద్దయా
పరుఁడౌ సద్గురుమూర్తి శాస్త్రుల మదిన్ వర్ణింతు నశ్రాంతమున్ 16

గీ. వేదశాస్త్ర పురాణార్థ వేది యగుచుఁ
బ్రవిల సద్రాజయోగ విరాజి యగుచు
నిరుపమానంద విజ్ఞాన నిలయమగుచు
నొప్పు సత్య చిదానందయోగిఁ గొలుతు 17

---

1. నాటకాయ్యల తోడ—అని ఉండడం లెస్స.

## స్వీయ వంశాభివర్ణనము

సీ. నరసులో బొడిచర్ల జ్వాలయ్య సుబ్బమాం
బలకుఁ బుత్రుండనై జరగినాఁడ!
రహినిఁ బెంపొందిన రంగయ్య భ్రమరాం
బికలకు దత్తుండనై వెలసినాడ!
ననుపమానప్రౌఢి నఖిల భూసురులకు
నధిక భక్తుండనై యమరినాఁడ!
గురుసేవఁ గావించి కొమరొప్ప లక్షణ
శాస్త్రంబు భక్తితోఁ జదివినాఁడ!

బాల్యమాదిగ దేవతాభక్తిఁ గలిగి
శిష్టజనులతోఁ గడుఁ జెల్మిఁ జేసినాఁడఁ!
జన్మ కృష్ణాఖ్య భువియందుఁ గన్నవాఁడఁ!
బొసఁగ నీ గ్రంథమునుఁ జేయఁ బూనినాఁడ! 18

వ. అని యివ్విధంబున నిష్టదేవతా ప్రార్థనంబునుఁ బురాతన సుకవిజన స్తోత్రంబును, సద్గురు వందనంబును, స్వకీయ వంశాభివర్ణనంబునుం జేసి 19

## షష్ఠ్యంతములు

క. శ్రీపతికి, వచన జిత తా
రాపతికి, సుసమర విజిత రాజిత రిపు గో
త్రాపతికి, రక్షితాఖిల
గోపతి కాదిత్య గోప గోగణపతికిన్ 20

క. అండజ వాహునకు, కో
దండ గుణారావ విసరదారిత దిగ్బ్ర
హ్మాండునకు, శత్రుభీకర
ఖండనునకుఁ, గులిశ తీక్ష్ణబాకాండునకున్. 21

క. శ్రీకరున, కఖిలలోక ది
వాకరునకు, యోగిరాజ వందితునకు, జో
మీకర చేలునకు, సురా
నీక దయాళునకు, నిఖిల నీతి విదునకున్. 22

క. ధీరునకు, సర్వ జగదా
ధారున కసురేంద్ర వంశదహనునకు, సురో
ద్ధారునకు, నిఖిల సుగుణో
దారున, కసమాన విజయ ధారాళునకున్. 23

క. శ్రీదునకు, నార్య జన సం
మోదునకు, నఖండ సమర మురదానవ సం
చ్ఛేదునకు, కల్మషాపహ
పాదునకు, సురేంద్ర విభవ పరిపాలునకున్. 24

క. శూరునకు, నందగోప కు
మారునకు, నశేష భువన మాన్యునకు, జగ
త్కారణునకు, విలస దలం
కారునకు, సమస్త గోపికాలోలునకున్. 25

వ. సమర్పణంబుగా నే నొనర్పం బూనిన సతీ బాలబ్రహ్మేశ్వర పరిణయం బను మహా ప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన. 2[illegible]

## నైమిశారణ్య వర్ణనము

క. శ్రీదంబై విదళిత ముని
ఖేదంబై వేదమంత్ర కృతయజ్ఞంబై
మోదమున నరణ్యంబుల
కాదియనం దనరు నైమిశారణ్యమున్. 27

వ. అది మరియు ననంతకాంతంబులైన విజాయత మణీ సముదయ ప్రభా పుంజంబుల రవి శశాంక రుచిప్రకరంబుల నపహసించుచు మహోన్నతంబులైన శిఖర నికరంబుల నభ్రంబు నొరయుచు నహోరాత్రంబుల నొక్క చందంబునం దేజరిల్లు మహా పర్వతంబులును, మహా పర్వతాగ్రంబులు వెలువడి తరతరంబులైన పాషాణంబుల నొరసి మ్రోగుచుం బెల్లుఁ జిందెడు బిందు బృందంబుల నెల్లయెడలం జల్లఁజేయుచు నఖిల జంతు జీవనాధారంబులై నేత్రానంద కరంబులై ప్రవహించు సెలయేళ్ళును, సెల

యేళ్ళ పొంతలం బొదుగా వెరిగి మాధవీ మల్లికా లతా గృహంబుల కాధార స్తంభంబులై, దీయని రసంబులన్ జిలుకు( దీయ మామిళ్ళను(, దీయ మామిళ్ళ కొమ్మలన్ గ్రమ్మి( దొమ్మిసేసి, కిసలయంబుల నశనంబులుగా గొని మదంబున మదనకదనంబు సలుపుచున్ బరవశంబులైన( గోకిల మిథునంబులను(, గోకిల మిథునంబు లొనర్చు సుస్వరంబుల కానందింపుచు, నవ్వనౌనని( దల లూచుచు నిజసఖీమణుల సరస ప్రసంగంబులకు( మెచ్చుచు(, గుసుమ మాలికా బద్ధంబులైన( గేశ ధమ్మిల్లంబు లంస భాగంబులన్ బొరల( గుచ కుంభంబుల పయిన్ గదలు రత్నహారంబులు రోమల( బరంబునన్ గ్రమ్ముకొన మంద గమనంబున విహరించు విబుధ కామినీ బృందంబులకు( జల్లని నీడ లొసంగు ద్రాక్ష పందిళ్ళను, ద్రాక్ష పందిళ్ళ కిరుదెసలన్ గ్రమ్ముకొని ఘుమ్ము ఘుమ్మని తావుల నెల్లెడలన్ గ్రమ్మ(జేయుచు, నుమ్మరంబులగు నేడాకు టనంటుల నుండి గుబ్బు గుబ్బున విరిసి నలుదెసల నబ్బురంబుగా బడి గొబ్బున కన్నులకు నుబ్బు సేయు కపురంపు దిబ్బలును. కపురంపు దిబ్బల నొరసి మెల్ల మెల్లన మెలంగు( జల్లని( బిల్ల తెమ్మెరల తాకునం గదలుచు( గొలంకుల నుండు నేలకి లవంగ లుంగ లతావితానంబులన్ బ్రోదిసేయుచు, మరకత మయంబు లగు సోపాన మార్గంబుల ఝురులకుం దిగజారు మధురస ప్రవాహంబులును, రసప్రవాహ శీకరంబులం బొదవి రంగుమీరిన బంగారు బిళ్ళలన్ దిరస్కరించి మిసిమిగల పసిమితో దులకించు కుసుమ విసరంబులం దూగి యాడు( జేమంతి తరునికరంబులును, తరునికర పరివృతంబులై వజ్ర వైడూర్య స్ఫటిక సోపాన దీధితులనంబరంబు నాచ్ఛాదించి నిజనాథులం గూడి( జెన్నగు మన్ననల నున్నతంబులగు విమానంబు లెక్కి దిన్న తిన్నగ విహరించుచు వేల్పుటన్నుల తనుంగవలకు మిరుమిట్లు( గొలుపుచు, ఝుమ్ము ఝుమ్మన రొదలుసేయు గండు తుమ్మెదల దొమ్మిచే సొలసి మెల్లనన్ గదలుచున్న యెమ్మెలగు తమ్ముల నుండి యల్లనల్లనం దిగజారు మధురసబిందు బృందంబులన్ గలసి యమృతోపమానంబులైన యుదకంబులం జెన్నుమీరి దర్శన మాత్రంబున సకల జంతుపాప నిర్మూలనంబు సేయు సరోవరంబులును, సరోవర తటంబుల నిలిచి సీటగు తేట

నీటన్ దమ తమ మొగంబులు, జెక్కులు కన్నులుం, జన్నులు, వక్షం
బులుఁ గతంబులు, బాహువు లూరులు మొదలగు సకలావయవంబులం
జూచుకొని గిలకిల నవ్వుచు నొకరి నొకరు మెచ్చక గేరడంబులాడు యక్ష
కిన్నర కాంతా జనంబులును, గాంతా జనంబుల వెంట నంటి దిట్టంబులగు
వైడూర్యంపు కట్టలం జని చని గన్నులకు విందొనర్చు హొన్ను పొన్న
గున్నల దండలంజేరి, యచట నాటెంబులగుఁ గమ్మవిల్తుని బాణమ్ముల
బ్రాణమ్ములు పొమ్ములు వోవ నచ్చెలుల కడ్డంబు వచ్చి బట్టరాని తమ
కంబునన్ గవిసి, యిప్పట్టున మమ్ము గావం దగునని బాహువుల గదియం
బట్టి యిట్టట్టు జననీయక దిట్టతనంబునఁ బవడంపు బొదలకు నెట్టుకొనిపోయి
పుప్పొడి దుమారంపు తిప్పలం జేర్చి సన్నజాజివిరుల సరులన్ దురంగ
తించు కొప్పులం బట్టి జెక్కుటద్దంబుల ముద్దులాడుచుఁ జిత్తజక్రీడలన్
దేలు వన్నెకాండ్రును, వన్నెకాండ్రు మెచ్చ నపరిమిత సుందరంబులైన
రతనంపు దరుల నగణితమ్ములగు కమ్మతావుల నలుదెసలన్ గ్రుమ్మరించు
వేల్పు ద్రాకుల నీడల నింపు గుల్కు జంద్రకాంతపు టరుగులం
గూర్చుండి మెల్ల మెల్లన హస్తంబుల నీణల నమర్చి తాయి మీర నర
మోడ్పు కనుంగవ లుల్లసిల్ల గానంబులు సేయు గంధర్వ భామినీ మణు
లును, భామినీ మణుల కుచ కుంభ లిప్తంబులగు కుంకుమ గంధ కస్తూ
రికా పంకంబుల జలక్రీడా వినోద కాలంబులం దైక్యంబుఁ జేసుకొని,
తరళంబగుఁ బరిమళంబుల సరళంబుగా వెదజల్లుచు మణిమయంబులైనఁ
దరులం దొట్టి చల్లని పయ్యెదల తాకునన్ దురంగలించు వీచీ సముద
యంబులం జివ్వ జివ్వనం దూలు కమల కువలయంబులం జుట్టి విహ
రించు హంస, కారండవ, బక, రథాంగాది జలవిహంగ నివహ కలరవం
బుల నింపు గుల్కుచు స్నానమాత్రంబున సకల జనుల ధన్యులం జేయు
పుణ్య నదీ ప్రవాహంబులును, నదీ ప్రవాహంబుల చెంతల నపరిమితం
బుగా బెరిగి గొప్పలగు నాణి ముత్యంబులు గుప్పలుగా గురియుచు
నెవ్వరికిన్ దోవఁ ద్రోవలీక నానాలతానీక పరివేష్టితంబులై గిఱ్ఱు కిఱ్ఱునం
గదలు వెదురు గుములును, వెదురు గుముల నాచ్ఛాదితంబులై యేరికిం
దేరి చూడరాక మహావాయు హతిన్ మొర మొర మ్రోగుచు భయంక

రంబులైన గుహా సముదయంబులును, గుహా సముదయంబులఁ దందోప
తండంబులై వెడలి సహజ వైరానుబంధంబు మాని సమత్వంబున నానా
మార్గంబుల సంచరించు సింహ శరభ వ్యాఘ్ర వరాహ వేదండ ఖడ్గ భల్లూక
చమర గండక శల్య మహిష మర్కట హరిణాది మృగ సమూహంబు
లును, మృగ సమూహంబుల కళుకుచు నక్కడక్కడ దండి మీర విరిసిన
బొండుమల్లె వనంబులన్ మంద గమనంబుల సంచరించుచు విందు వేదు
కలం బుప్పొంగఁ గోయు ముని కన్యకా నివహంబులును, గన్యకా నివ
హంబులు వెంటనేతేర సుప్రశస్తంబులగు హస్తంబుల గనక కలశంబులన్
బూని కప్పు కొప్పుల నొప్పఁ గులుకు వేల్పు పూదండల దండివాసనల
కరుదంది గుప్పు గుప్పున వ్రాలఁదేటి తండంబుల రవంబులకుఁ జది
యుచుఁ జక్కనగు కెమ్మోవుల నొక్కవచ్చు చక్కెరవిండి తుటుముల
నెక్కసక్కెంబునం వుచు విచ్చలవిడి నదులకుం జని దమ తమ పతుల
సంధ్యావందనాది కృత్యంబుల కుదకంబులఁ దెచ్చు తాపస భార్యా సముద
యంబులును, భార్యా సముదయంబుల తోడ నియమంబు లూని పరమేశ్వ
రార్పణంబుగా సకల సువ్రతంబులు సలుపుచు నిత్యసంతోషంబునం
జెలంగు ముని సంఘంబులును, ముని సంఘంబులకు సుంద నిరవులై
నిరంతర కుసుమ ఫల భరితంబులగుచు సొంపు మీరిన జంబు జంబీర
నింబ వటాశ్వత్థ కదళీ కపిత్థ నారికేళ రసాల పనస బదరీ సరళ
కదంబ పూగతాళ ఖర్జూరాది తరు సంతాన విరాజితంబులైన యాశ్రమ
వనంబులును, ఆశ్రమ వనంబు లందుండి బుష్పరసంబు లాని మిక్కు
టంబులగు కాంతులన్ దిక్కరిల్లు చక్కని పక్వఫలంబులన్ చంచువులం
జించి పేసంబులు గ్రాసంబులుగా గొని మహానందంబున శ్రీరామ నారా
యణ మాధవ కృష్ణేతి నామంబులన్ బలియించుచు శుక పిక శారికాది
విహంగ వ్రాతంబులును, విహంగవ్రాతంబుల మధుర నినదంబులకు
మెచ్చుచు నాశ్రమ వృక్షమూలంబుల వెలుఁగు నీలంపు టరుగులం
గూర్చుండి స్వరలాలిత్యంబులన్ దారువు లంకురింప వేదశాస్త్ర పురాణా
ధ్యయనంబు సేయు మునికుమారులును, మునికుమార పాలితంబులై పచ్చ
రాగముల విచ్చెన్ జెలఁగిన పసిమిగల పచ్చికల మేయుచు నుల్లంబులా
రంజిల్ల నల్ల నల్లన నబ్బులెత్తి వెలగ మ్రాకులఁ జిగుళ్ళఁ దినుచు వత్సం

బుల తోడ నాశ్రమవనోప కంఠంబుల సంచరించు కామధేనువులును, గామధేను ప్రవర్షితాజ్య క్షీర భక్ష్యభోజ్య లేహ్య చోష్యాది సమస్త పదార్థ కూటంబులైన యజ్ఞవాటంబులును, యజ్ఞవాటంబులం దేజరిల్లు కుండంబులు వెలువడి యనంతంబులగు పరిమళంబుల దిగంతంబులన్ జిమ్ముచు నాఘ్రాణ మాత్రంబున నశేషప్రాణి సముదయంబుల కనిమిషత్వంబు నొసంగం జాలు మాహాత్మ్యంబున నంబరంబు నిండి వెలుంగు హోమ ధూమ తడంబులును, ధూమ తడంబులు మేఘ తడంబులని సంతసంబునన్ బొదలి గొప్పలగు పింఛంబులు విప్పి కప్పుల నొప్పు గుబ్బ-కంఠంబు లల్లనల్లన నెత్తి తటిల్లతల వలెఁ దుటుములఁ దీరి నర్తనంబులు సేయు మయూర మిథునంబులును, గలిగి శ్రీహరి పక్షంబునుం బోలె కమలాంకృతంబై, స్వర్గంబు పగిది దివ్యవాహినీ సుందరంబై, భారతంబు రీతి నర్జునకాండ బాహుళ్యంబై, భాగవతంబు వడువున శుకవాక్య బృంద మాధుర్యంబై, ప్రావృట్కాలంబుభాతి ఘనసార నికర భాసురంబై, శ్రీరామసైన్యంబు తెఱంగున సుగ్రీవ, శరభ, గవయ, భల్లూక, నాయక సంయుతంబై, కైలాసంబు చందంబున శంకరార్యాలంకృతంబై, కృష్ణ హస్తంబు పోలిక రథాంగ శిలీముఖ మండితంబై, యాకాశంబు భంగి గురు బుధ కవి విరాజమానంబై, రామాయణంబు సొంపున బహుకాండ విసర రమ్యంబై, దివంబుగతి రవికాంతి కిరణ నికర రుచిరంబై, మహావర్షంబు కరణి ననేక గోవాహినీ నకులంబై యొప్పు నయ్యరణ్యంబు నందు. 28

తే. గీ. నీవు నేనను భావంబు నీఱుఁజేసి
భేద ఖేదంబులను వాటి మొదలఁ జెరిచి
సర్వవస్తువులను మాట సమయఁ జేసి
పన్నుగా జీవుఁడను మాట సున్నఁజేసి. 29

తే. గీ. పొరిది విజ్ఞానమున మనశ్శుద్ధిఁజేసి
శమదమంబుల నాత్మను సమత నిల్పి
కాంచునది యంత బ్రహ్మంబుగాఁ దలంచి
మహితమగు రాజయోగ సమాధి నొంది. 30

తే. గీ నిర్మల జ్ఞాన దృష్టిచే నేర్పుదనర
సకల శాస్త్ర పురాణార్థ సమితిఁ గనుచు
నవ్యయానందమూని బ్రహ్మాసనమున
సొంపుదళుకొత్తఁ గూర్చున్న సూతుఁ జూచి. 31

చ. అనఘులు శౌనకాది మునులచ్యుత పాదసరోజ యుగ్మసం
జనిత మరందపాన సుఖ సమ్మదులై యుచితాసనంబులన్
జనుపుగ నుండి హస్తములఁ జయ్యన మోడ్చి కథానురక్తులై
వినయముఁ దోఁప నిట్లనిరి వేడ్క మనంబుల సందడింపగన్. 32

క. సూత ! జగన్నుత ! సుగుణో
పేత ! పరిష్కృత సమస్త పృథుల పురాణ
వ్రాత ! నిరంతర లోక
ఖ్యాత ! బుధానీక తాత ! ఘనవాగ్జాతా !! 33

వ. మహాత్మా! వాసుదేవ ధ్యానామృతంబున మనోవికార పంకంబులన్ గడిగి వైచి ప్రశాంత చిత్తుండవై ధూమరహితంబైన వహ్ని చందంబునన్ దేజరిల్లుచు భగవచ్చరితంబులగు ననేక పుణ్య పురాణ కథ లుపన్యసింపుచు మమ్ము నెల్లకాలంబుఁ గృతార్థులం జేయుచున్నవాడవు. అనఘాత్మా! సర్వాంతర్యామియగు నారాయణుని కథామృతం బెంత గ్రోలినం దనివిఁ దీరదు గదా! ఇప్పుడొక ప్రశ్నం బాచరించెదము. సర్వలోకోత్కృష్టుం డగు దక్షుండు, దన కూతురగు సతి యను కన్యకను భగవంతుం డాత్మారాముండునగు నభవున కొసంగి వివాహం బొనర్చెనని యింతకు మున్నుఁ బలికితివి. తద్వివాహ క్రమం బంతయు నానతీవలయు ననవుడు సూతుండుఁ బరమహర్ష సమేతుండై దివ్యగుణగరిష్ఠులైన యమ్మునిశ్రేష్ఠులం గనుంగొని యిట్లనియె. 34

ఉ. భూరిదయాపరుల్ మహిత పుణ్యులు దివ్యమునీంద్రు లంచితో
దారతపోనిధుల్ విగత తామసు లార్యులు నైన మీరలున్
ధీరతఁ జేయుఁ బ్రశ్నము ను ధీవరులార పరిష్కరించి నే
సారమతిన్ దగన్ బలుక శక్తుఁడ నౌదునె యెన్ని భంగులన్. 35

వ. ఆయినను నన్ను మన్నించు తలంపున మీరలడిగితిరది యెట్లనిన, లోకం
బున మనోహరంబులగు వాక్యంబులఁ జిలుకకుం గరపి మరల నది సంభా
షింప నానందించు జనంబుల చందంబున మీ కృపావలోకంబున ధన్యుం
డనై వెలసిన నన్నాదరించి మద్వాక్యంబులు వినం గోరెదరు. మహాత్ము
లారా! నిఖిలలోక సంపత్ప్రదంబును, మహాపాపక్షయకరంబును,
మోక్షప్రదాయకంబును, నిత్యకల్యాణంబునైన జగద్వల్లభుండగు భర్గుని
కల్యాణ మహోత్సవంబుఁ గ్రమంబున మజ్జన్మ పావనంబుగా వివరించెద;
సావధానులై వినుండని సర్వస్వరూపకుండును, సర్వాంతర్యామియు,
సర్వాధారుండును, సర్వేశ్వరుండునునైన భగవంతుని యందుఁ జిత్తంబు
జేర్చి మహానంద మగ్నుండగుచు నిట్లని చెప్పదొడంగె.

సీ. ఘనుఁడు స్వాయంభువ మనువుకుఁ గూఁతురౌ
సుగుణాఢ్యయైనఁ బ్రసూతి యందు
దక్షప్రజాపతిఁ దగ పదునార్వుర
విమల పుత్రికలను వెలయఁ గాంచిఁ
గ్రమముగాఁ బదమువ్వురను ధర్మునకు నిచ్చె
నగ్నిహోత్రున కొక్క యతివ నొసఁగెఁ
బ్రియముగా నొక కన్యఁ బితృదేవతల కిచ్చె
నంత నొక్కతి సతి యను లతాంగి
చిన్న తన మౌటఁ గూర్మితోఁ బెంచుచుండె
నంత నా సతి నానాటి కతిశయిల్లి
తల్లిదండ్రుల యుల్లముల్ బల్లవింప
జెలఁగి యాడుచు నుండె నెచ్చెలులఁ గూడి 87

చ. సుర గరుడోరగ ప్రముఖ సుందరు లారసి నెమ్మనంబులన్
గర మరుదంది లోకములఁ గన్గొన మిట్టి శుభాంగి నంచు సా
దరమునఁ బుష్పవర్షము లుదారతఁబైఁ గురిపింతు రింపునన్
వరగుణభూర! యా సతిని వర్ణనసేయఁగ నాకు శక్యమే! 88

క. కర కంకణములు మొరయఁగఁ
జరణాంచిత నూపురములు ఝుణ ఝుణ మ్రోయన్

ఉరమున మణి పతకంబులు
మెరయఁగ నిజ జనని మోల మెప్పుగ నాడున్ 39

వ. మరియు నబ్బాల్యంబు నందు 40

సీ. చెలికత్తియలఁ గూడి కలశముల్ జేనంది
నిమ్మచెట్లకుఁ దెచ్చి నీరుఁ బోయు
భామామణుల తోడఁ బాటలఁ బాడుచుఁ
బ్రియముతో బొమ్మలపెండ్లి సేయు
మేల్తోగిరంబులు మెప్పుగా వండించి
జెలులకు ననురక్తి పెలయఁబెట్టు
ముద్దు గుమ్మలఁ గొల్వ ముదమొప్ప బంగారు
గొలుసుల తూగు టుయ్యాలల నూగు
మెరయఁ గర్పూర గంధంబుమేన నలదు
దినము నొక వింత రవణంబుఁ దివిరిఁదాల్చుఁ
దల్లి కొత్తున నన్నంబుఁ దగ భుజించు
బాల్యమున నిట్లు మెలఁగు నప్పద్మనయన! 41

వ. అంత. 42

ఉ. తాలిమిఁ బూని తండ్రియగు దక్షుని సన్నిధిఁ జేరి భక్తితో
నా లలితాంగి నేర్పమర నంచిత శాస్త్ర పురాణరాజముల్
లీలఁ బఠించి యర్థ మవలీల గ్రహించి జగంబు లెన్నవా
చాలత గాంచి సద్గుణ విశాలత నొప్పిఁ జెలంగె నెంతయున్. 43

సీ. శృంగారవనములఁ జిలుక లానందింపఁ
జెలరేగి పద్యముల్ జదువుచుండుఁ
గొమరు మీరిన గండుఁ గోయిల లరుదంద
స్వరయుక్తి గానంబు సలుపుచుండు
రహిఁ గొలంకుల నుండు రాజహంసలు మెచ్చ
నటనతో మెల్లన నడచుచుండు
హరిణంబు లలర పీటగుఁ బెళుకు చూపులఁ
జెలికత్తెలకుఁ బనుల్ దెలుపుచుండుఁ

దల్లిదండ్రులు బంధువు లుల్లసిల్ల
నిఖిల విద్యల నేర్పులు నెరపుచుండు
సాధుగుణ బృందముల కెల్ల సదన మనఁగ
నెలమి విహరించుచుండు నయ్యిందువదన! 44

వ. ఇట్లు జగత్కారిణియు, జగన్మోహినియు, జగన్మాతయు, జగదీశ్వరియు, జగచ్ఛక్తియునైనఁ దత్సతీలలామ సకల జనులకు నీ రూపంబున దర్శనం బొసంగి, కృతార్థులం జేయు తలంపున నిఖిల కార్యదక్షుండైన దక్షుని గృహంబు నందు శుక్లపక్షంబునం గళల వృద్ధిఁ బొందు చంద్ర బింబంబు చందంబున నానాటికి బాల్యకౌమారంబుల నతిక్రమించి నూతనం బగు యౌవనంబునన్ బొదలుచుండె; నయ్యెడ— 45

సీ. అరచందమామతోఁ బరుసంబు లొనరించు
నరవిందముల ఠీవి నపహసించు
మహిమఁ జెన్నొందు బల్ మల్లెమొగ్గలఁ
గేరు శంఖ సౌందర్యంబుఁ జక్కఁజేయుఁ
దామరతూండ్లతోఁ దారతమ్యము మీరు
గజనిమ్మపండ్లతోఁ గలహమాడుఁ
గిసలయంబుల చెల్వుగెలిచి గుట్టునఁ బెట్టు
నరటుల పొంకంబు నడఁగఁ జేయుఁ
బణతి నిటలంబు నేత్రముల్ బల్వరుసయుఁ
గంఠమును బాహు యుగళంబు ఘనకుచములు
హస్త యుగ్మంబు నూరువు లధిక గరిమఁ
గోమరుఁ దులకించు యౌవన సమయమందు. 46

## వసంతకాల వర్ణనము

వ. అనంతరంబ. 47

ఉ. మావులఁ బల్లవింపఁ గుసుమంబులు తావులఁ గ్రుమ్మరింప స
ద్రావములన్ విహంగ నికరంబులు రంజిల భృంగ పంక్తు లిం
పావహిలన్ బ్రసూన రస మానఁగఁ బాంథ జనంబు లిమ్ములన్
భావజు ధాటికిన్ గలఁగఁ బ్రాపయి వచ్చె వసంతకాలమున్. 48

సీ. కమ్మవిల్తుని వాడి ఖడ్గంబులన మించఁ
జెలువైనఁ గిసలయంబులఁ దనర్చె
పిరి ముద్దు కొమరునిఁ జికిలి మఱుఁగులనంగఁ
గుసుమ సందోహముల్ గొమరు మీరె
యల వసంతుని సునస్యంపు డబ్బీలనఁ
బటువైన బిందెల తుటుము లమరె
వరలక్ష్మి యాడుఁ బల్కిన కంపు చెండ్లనఁ
జొక్కమౌ ఫలములఁ బిక్కటిల్లె
ఘుమ్ము ఘుమ్మన తావులఁ గ్రమ్ముకొనఁగ
మెండుఁ జెలరేగి పుప్పొడుల్ నిండుకొనియె
నంచితముగ నిఖిల వనాంతరముల
భాసురంబైన యా మధుమాసమందు 48

వ. మరియు దిన దిన ప్రవర్ధమానంబై యగణితంబులగు బుష్పఫల పరిమళ సముదయంబుల నజాండంబు నిండింపుచు, నంతకంతకు పేంద్రంబులై యతిశయిల్లు మరుత్సంఘంబుల నెల్లెడల నొనరింపజేయుచు, మించు టుప్పరిగల నింపుఁగులుకు హంసతూలికా తల్పంబులఁ బవ్వళించి చెఱుకు విలుకాని కలుకుటమ్ముల చురుకులకు నెఱనెఱ మనంబులఁ గరంగఁ దమ కంబునన్ బొదివికొని కరచరణంబులన్ గ్రాలు కంకణకటక నూపురంబులు ఝణం ఝణ మొరయ సురతక్రీడ లాచరించు రాజదంపతుల గాత్రంబు గాత్రంబులఁ దుకతుక నుడికించి ఘర్మబిందు బృందంబులఁ దోగం జేయుచు, విలసిత కమల కువలయ లలితంబులైన సరోవర నికరంబులం జల్లని విమల సలిలంబులఁ దేజరిల్లం జేయుచు, నదంబులూని సందు గొందుల మందగమనల వెదకుచుఁ డెందంబులు బల్లటిల్ల సొటసొటలఁ జటుల గతి మిట మిటం దిరుగు విటకాండ్ర నధిక విరహజ్వరంబునన్ దూలింపుచు, సుందరంబులగు మందిరంబులన్ జెన్నొందుఁ జంద్రకాంత వేదికలనుండి వాతాయన నిర్గతంబులైనఁ బరిమళ గంధవహ నివహంబుల నల్లన నంతరంగంబుల గలంగ విదేశగతులగు తమ పతుల కెదురు సూచుచు నుస్సురని నిట్టూర్పులు విగుడించు మెఱుంగుబోడుల గుబ్బగుబ్బ

లన్ దులకించు వెల యెక్కుడగు మగరాల సరుల కగ్గలంబగు వేడిమి
బుట్టింపుచు, విబ్బరంబుగ నరణ్యంబులన్ గాంద్రింపుచు నుబ్బరేగి
సంచరించు చెబ్బులుల రబ్బు మీరినఁ బొదరిండ్ల గొబ్బు గొబ్బున
నొదుగం జేయుచు, నక్కజంబగు నీరు వట్టున నుప్పరంబునకుఁ
గుప్పించి బరువుల వారు లేళ్ళదాటుల కుదక భ్రాంతిం జేయు నెండమావు
లన్ గల్పింపుచుఁ, దరుశాఖల నెమ్మెఁ గుల్కుఁ గిసలయ సముదయంబుల
జారణమ్ము సేసి క్రొవ్వునన్ బచ్చవిత్తువిఁ జివ్వల నివ్వటిల్లు మవ్వంపు
కోకిల మిథునంబుల కల్లనల్లన గళస్వర నైపుణ్యం బుత్పాదింపుచు,
నుప్పరంబున గొప్పలగు విమానంబుల నొప్పుఁగుల్కు వేల్పు మచ్చ
కంటుల కప్పుకొప్పులన్ జుట్టిన విప్పుగల మల్లె పూసరుల తండంబులన్
గవకవఁ గందం జేయుచు, వెల్లమ్రాకుల నీడల మల్లంబులు రంజిల్ల
మెల్ల మెల్లన విహరించుచు, సరోవర రోధంబులన్ బాధలు తోరంపు
టీరంబులనల్లనం జేరి జల్లని నీటి తెమ్మరల కానందించు నిర్జర మిథునం
బుల కత్యంత విరహోద్దీపనం బొనర్చి రతులకున్ గవియింపుచు. నిట్లఖిల
జంతు మిథున సంపర్క సౌఖ్యదంబై, యపరిమిత కిసలయ కుసుమ ఫల
భరితంబులైన వనంబుల జగంబు నలంకరించి సకలలోక సుందరంబై
వసంతకాలంబు విరాజమానం బయ్యె నయ్యెడ. 50

తే. గీ. అట్టి వాసంత సమయమం దబ్జముఖులు
సొరిదిఁ గొలువంగ నా సతీ సుందరాంగి
ప్రేమఁ దళుకొత్త సౌధాగ్ర సీమ నుండి
వన విహారంబు సలుపంగ వాంఛఁ దగిలి. 51

క. చేడియల తోడసరసము
లాడుచు సౌధంబుఁ డిగి యొయ్యారము మెఱయన్
వేడుకలఁ జీరు చిలుకల
జోడుల ముద్దాడి సుగుణ సుందరి యంతన్. 52

ఉ. కొందఱు పైడి బెత్తములుఁ గొందఱుఁ బల్కుపురంపు పేటికల్
కొందఱు విల్వ్వటద్దములుఁ గొందఱు బంగరు తాళవృత్తముల్
పొందుగ సుందరాంగు లిటుఁ బూవిఁ గెలంకులఁ గొల్చి రాగ నా
ఛందన గంధిఁ దాఁపైడలెఁ జయ్యన మోదమ్ముఁ బల్లవింపఁగన్, 53

## సతీదేవి చెలికత్తియలతోడ వనవిహారంబునకు వెళ్లుట

సీ. మగరాల కమ్మల సొగసైన దీధితుల్
చెక్కుటద్దము లందుఁ బిక్కటిల్ల
చటులాళులనుఁ గూడిఁ గుటిలాలకంబులు
నిటల భాగంబుపై నటనమాడ
రమణీయమౌక్తిక రత్నహారచ్ఛటల్
ఘన కుచాగ్రములందు గంతులిడఁగ
మహిత కంకణ యుగ్మ మణి సమూహద్యుతుల్
హస్త పద్మములందు నావరింపఁ

చరణనూపుర కాంతులు ధరణిఁ గప్ప
శిలఁ జారిన వలువ కెంగేలఁబట్టి
మంద గమనంబుతోడ నయ్యిందు వదన
వన విహారంబు సలుపంగఁ జనియె నపుడు. 54

వ. ఇట్లుఁ జనుచున్న సమయంబున. 55

సీ. చెలులతోఁ గలకలఁ బలుకు నా సతిఁ జూచి
వెస శుకంబుల ఫౌజు వెంటఁ దగిలె
నెలుగెత్తి పదతులఁ బిలుచు నచ్చెలిఁ గనిఁ
గోకిల వ్యూహంబు జోకఁబొదివె
జారు కొప్పెద నొప్పఁదేరు నాయమఁగాంచిఁ
బనశేటి పరిగమి పైనఁగ్రమ్మె
చక్కని నడలూను నక్కొమ్మ నీక్షించి
కోరి యంచల పిండుఁగూడినడచె

చిటులఁ దమ సూక్తి స్వరనైల్య నటనములను
వేడ్కఁ దనయందుగని యవి వెనుకొనంగఁ
బొలఁతు లిరుఁగడఁ గొలువ నప్పువ్వు బోడిఁ
గరము సంతసమున వనాంతరము సొచ్చె. 56

## వన విహార వర్ణనము

వ. ఇట్లఖండ వైభవంబున సద్దాక్షాయణి మందగమనంబునఁ గుందరదన లిరు
వంకల నందడింపఁ గరివరదు కొమరుని యొరఁవెఱికిన జేగురు బాకు
తెరంగున మెఱయుచు మెఱుంగుటఁ దుఱంగలించుఁ దరళంబులగు నయన
రుచి నికరంబులం బది దిశల నబ్బురంబుగఁ బ్రబ్బికొన, దంబు మీఱిన
పవడంబుల నపహసించుఁ గరాంగుళంబులఁ జెలంగు బంగరు మించు
టుంగరంబుల మగరాలఁ దళత్తళ లపరిమితంబుగఁ దరుసముదయంబుల
నిండుకొనఁ జొక్కమగు సంపంగి కుసుమంబును ధిక్కరించుఁ జక్కని
ముక్కు తుద విక్కయూడు బులాకి ముత్తియంపుఁ డాలుఁ గమ్మ వాతెఱపై
గంతులిడ, మించు తావుల గుబాళింపుచు నంస భాగంబున నల్ల నల్లనం
గదలుఁ గీలు కంటు నందులకించు రతనంపు చేమంతి బిళ్ళ మెఱుంగు
లంబరంబు నలంకరింప, నందమ్ములగు శ్రోత్రమ్ముల నెమ్మెఁగులుకుఁ
గుందనంపు కమ్మల నిగనిగలు గండ భాగంబులఁ జిందులఁ ద్రొక్కఁ
గసటులేని బిసకాండంబుల పసనడంచు మిసిమిగల బాహాయుగళంబున
నెసంగు బంగరు బాజుబందుల ధగద్ధగ లిరుగడల నడతెంచు పడతుల
కనుంగవలకు మిరుమిట్లుఁ గొలుప నల్లనల్లన నసియాడు సన్నని నెన్నడు
మునఁ జెన్నుఁగులుకు నిద్దంపు పసిడి యొడ్డాణంపు దీధితులుప్పొంగి గుప్పు
గుప్పున పరిగంచు చీరపైఁ గప్పుకొన నందఁబాయక మెండుకొని దండన
రందని నిందు వేడుకం జెలికత్తియల కప్పుడప్పుడాజ్ఞాపింపుచుఁ,
గీలుఁగంటుఁగంటి వెన్నునం జారిన సన్నంపు మొగలిరేకుఁ జెన్ను
మీఱు వేణికం గరంబునం జిరజిరం ద్రిప్పి ఝుమ్మ ఝుమ్మన గ్రమ్ము
కొని మ్రోగు గండు తుమ్మెదల నెగయం జోపుచు, నక్కజంబుగ దేవియ
బుట్టిపడుఁ జొక్కంపు పలుకుల నెక్కసంబుగఁ జక్కెరఁదిండి మొత్తం
బుల ధిక్కరింపుచు, వేడుకలు మీఱఁ దోడనేతెంచుఁ జేడియబిల్లసిల్ల
మ్రోడులఁ బల్లవింపంజేయు మధురస్వరంబుల దండిమెఱయు గండు
కోయిలల నాక్షేపించుచు, మిసిమిఁగల బసిడి యందియల మ్రోత ననుస
రించిఁ జేన్నుమీఱు మిన్నలగు చిన్నని నెన్నడల నేర్పున నిరుఁగెలంకుల
నల్లనల్లనన్ గదియవచ్చు తొలకరి కలుగు పులుగుల నిలువరింపుచు,
దివ్వెలవలె నివ్వటిల్లు మవ్వంపు మల్లెతీవియల నల్లిబిల్లియగు ద్రాక్ష

వందిళ్ళ క్రింద వింపొందు చంద్రకాంత వేదికల దాటులన్ బోటులన్ గూడి పీటునన్ గొలువు దీరుచు, పొందు మల్లియల నండఁగొని దండి మీరన్ బెరిగిన బండి గురివింద తీవియలన్ గలసి మెండున నెండఁజొర నివ్వక మెల్లమెల్లనన్ ప్రవేశించు విల్లతెమ్మెరలఁ గలకలం గదలు కన్నె పొన్న గున్నలఁ జల్లని నీడల నల్లనల్లన నిలుచుచు, నొప్పుఁగులుకు పుప్పొడుల కుప్పల నొరపి గొప్పలగు పోతమ్రాకుల మూలంబులన్ బొదలు నేలకీలవంగలుంగ లతా వితానంబులన్ దడుపుచు సవిరళంబులగుఁ బరిమళంబులన్ జెన్నుమీఱుఁ బన్నీటి కాలువల నవలీలం దాటుచు, సురటులవలెఁ జెన్నొందు నేడాకు టరటుల నుండి ఘుమ్మ ఘుమ్మని తావులు నలుదెసలన్ గ్రుమ్మఁగ్రేవలన్ దొరఁగి వన్నెమీఱు కపురంపు దిన్నెల నెక్కుచు, నెయ్యంబు మెఱయ నెమ్మెలగు నిమ్మలతోడ వియ్యంబుఁ గులుకుఁ దియ్యమామిళ్ళ కొమ్మలన్ గలయనల్లుకొని జయ్యనఁ గ్రిందికిఁ జారినఁ బవడంపు తీగె యుయ్యెలల నూగుచు, తొలకరి చినుకులకు తఱుచుగ నంకురించిన గఱికనుఁ జురుకు చురుకున మేయుచు దట్టంబులగుఁ బొదరిండ్ల చెంతల దిట్టతనంబున సంచరించుఁ గన్నెవేళఁగసంబుల చప్పటుల చెదరం జేయుచుఁ, గన్నులకు విందొనర్చు సన్నజాజుల చెంత నున్నతంబులై యగణితంబులగుఁ గుసుమ నికరంబుల భారంబునం దూలఁ బొగడ మ్రోకులకుఁ బిరబిరన్ బ్రాకుచు, నిండారఁ బొదలి దండి మెఱయు గొదమ తుమ్మెదల తండంబుల సందడిన్ గదలుచు నధికంబులగు మధు రసంబులన్ జిలుకు చేమంతి విరుల సునిశిత నఖాగ్రంబులన్ గిల్లుచు, బంతంబులు మీఱ వంతులన్ బోటులుఁ జిదిమి తెచ్చినఁ గుసుమ సముదయంబుల పీటునన్ దోయిటన్ బూని నిగనిగని రతనంబుల పొగసు మీఱు విమానంబుల గగనంబున మెఱంగు నమరకాంతలపైఁ బరిమళంబులఁ గ్రమ్ముకొన మాటిమాటికిఁ గొబ్బు గొబ్బున నెగఁజల్లుచు, జంటఁబాయక వెంట నంటి వచ్చు ముద్దు గుమ్మలద్భుతం బంద విచిత్రంబులగు దోహద విశేషంబుల ననేక తరులతా నివహంబులఁ బుష్పింపం జేయుచుఁ, బటువులై పండిఁ జిటిలి జొటజొట రసంబు లొలుకు నామ్ర జంబీర దాడిమ ఫలంబుల నందుకొనిఁ దన్ముల నమ్మి కొలుచుఁ గొమ్మల

కనుకట్టిన్ బంచిపెట్టుచు, నిట్లు జగన్మోహిని యునుం బోలె వనంబున నెచ్చెలులన్ ముద్దియఁ గూడి పెద్దయున్ బ్రొద్దు విహరించుచున్న సమయంబున.

సీ. నెలత! నీ కనులతో నీటుఁగులెక్కెడు మెట్ట
తమ్ములు నిటఁ గొన్నిఁ దెమ్మటంచు
భామ! నీ బిగి గుబ్బ పాలిండ్ల కీడైన
బిమ్మ పండ్లివె వేగఁ గొమ్మటంచు
చాన! నీ యధరోష్ఠ సామ్యమూనిన దొండ
పండులఁ గోయుమీర ండననుచుఁ
బడతి! నీ కరములు భాతిఁ జెన్నొందు బల్
కిసలయమ్ములఁ గోట గిల్లుమనుచు
నిటులఁ దమలోని సరసోక్తు లెసఁగ మంద
గమన లందందఁ జెలఁగుచుఁ గడు ముదమునఁ
బుష్ప ఫల బృందములఁ గొంచుఁ బొలుపు మిగులఁ
దడయ కద్దేవి వెనుకొని నడచుటయును. 58

వ. అంతఁ గ్రమ క్రమంబున. 59

సీ. వాడిమైఁ బ్రసరించు వేడి యూర్పులు సోకి
గర మొప్పఁ గమ్మ వా తెరలఁ గంద
గుబ్బు గుబ్బున గ్రమ్మి యుబ్బు పెంజమటల
విమలంబులగుఁ గంచుకములఁ దడియ
మెండుగా వ్యాపించు నెండ తాకున కప్పు
కొప్పుల విరిదండ లొప్పు దూలి
నాయాసమున నసియాడు నెన్నడుముల
కుదురైన వలువలు వదలి జార
బుడమి నడుగులఁ దడబడ జడతఁ బొడము
వన విహారంబు సాలించి వనజనయన!
లా సతీదేవి తోడఁ బద్మాకరంబు
సరస జేరిరి మధ్యాహ్న సమయ మందు! 60

## జలక్రీడా వర్ణనము

వ. ఇట్లు వనవిహారంబునన్ బడలి యా దాక్షాయణి, యా చెలికత్తియలుం దానును జలక్రీడాసక్తులగుచు నల్ల నల్లనం జల్లని బిల్లతెమ్మెరల నుల్లంబులఁ బల్లవింపం జేయు సరోవరంబుఁ బ్రవేశించు నవసరంబున. 61

సీ. సతుల పాలిండ్లతో జతఁ బూనగా లేక
దెరలి కోకంబులుఁ దరుల కొదిగె
దానల కురులతో సరిగాంచగా లేకఁ
గంటగింపుచుఁదేంట్లు మింట జెదరె
బోటులనడలతో నీటొంద జాలక
వెస మరాళము లొక్క దెసకుఁ జనియె
లలనల మీగాళులకు సాటి గనలేకఁ
దడబడి కమఠంబు లడుగుఁ బట్టె
నౌర! యని నిర్జరాంగన లంబరమున
నుండిఁ బొగడంగ నపుడు వేదండయాన
లాననంబులఁ జిరునవ్వు లంకురింప
హెచ్చు వేడుకఁ గొలఁకులోఁ జొచ్చుటయును. 62

తే. గీ. తరుణు లిరుగడ నపుడుఁ గైదండ యొసఁగ
జికిలి కమ్మల దీధితుల్ జదలఁ బొదల
ముదముఁ దళుకొత్త నా సతీ మోహనాంగి
గరము సుందరమగు సరోవరము సొచ్చె. 63

కు. చెలులన్ గూడి సతీ లలామ సరసిన్ జెన్నొంది క్రీడింప స
ద్విలసద్రత్న విమాన బృందములతో విచ్చేసి దివ్యాంగనల్
లలితోత్ఫుల్లఁ బ్రసూనరాజములుఁ జక్కన్ జల్లుచున్ మింట బం
క్తులుగాఁ దీర నుతింపుచుండి రెలమిన్ దోరంపు హస్తంబులన్. 64

ఉ. దండిగ మ్రోగు భృంగముల తండములన్ జెనరంగఁ జోపుచున్
మెండుగఁ బుప్పొడుల్ జెదర మీటగుఁ బువ్వుల నీట దాల్చుచున్
మండిత భూషణద్యుతుల మందగతిన్ దరులందుఁ గ్రమ్మ న
య్యండజ యాన లత్తరి విహారము సల్పిరి యక్కొలంకునన్. 65

రగడ. అప్పుడు సురసతు లద్భుత మందగఁ
గప్పు గంధులుఁ గడు సమ్మదమున
గర కంకణములు ఘల్లున మ్రోయఁగఁ
దరళ హారములుఁ దళుకుగ మెఱయఁగ
మురువుగ నీటను మునుగుచుఁ దేలుచు
గర మరుదుగ భృంగముల నదల్చుచు
నొద్దిక మెఱయఁగ నుద్దులు దీరుచుఁ
దద్దయు వేడుకఁ దమలోఁ బొంగుచు
నొండొరు లొగి సరసోక్తుల సలరుచు
మెండగు జలముల మెప్పుగ నీదుచు
తగు తగు విటు నా దండకు రమ్మని
నిగుడి పట్టి బలు నీటను ముంచుచుఁ
దరుణిరో! నాతోఁ దరమా? నీసనిఁ
గొరలి పట్టిఁ జెక్కిళ్ళనుఁ బొడుచుచు
వేళఁ జూచి నీ వేగిర మణచెదఁ
దాళుమంచుఁ బంతంబులుఁ బల్కుచుఁ
జిక్కితి విదుగో! జెలి, యెటు వోయెదుఁ
జిక్కఁగ నిలుమనిఁ జతురతఁ బల్కుచు
మెండుగ నల్లిన మిరియపు తీగెల
దండిగ మెరసెడుఁ దరులకు నీదుచుఁ
దరగలఁ గదలెడుఁ దామరపువ్వుల
మెరయు నళింబుల మెల్లన ద్రెంచుచు
నోహో! నిలుమని యోలలు వెట్టుచు
నాహా! తగదని యడ్డము నిల్చుచు
వెలయఁగ మధురస వితతులఁ జిల్కెడుఁ
గలువ పువ్వులనుఁ గడువడిఁ గోయుచుఁ
దళుకుగ మకరందంబుల గ్రోలుచుఁ
కెలువుగఁ దీగెల వెసఁ గనలింపుచుఁ
గలకంఠులు నిటుఁ గమలాకరమునఁ
బలు చందంబులఁ బ్రబలఁ జరించిరి.

వ. అట్టియెడ. 67

సీ. చెలులపై నీరముల్ చెలువొందగా జల్లఁ
జెలులు జల్లిన నీట వెలయఁ దోగి
సతులపై పద్మముల్ సరసమాడుచు వైచి
సతులు వైచిన పద్మ తతుల మెరసి
పొలఁతుల నిండ బుప్పొడులు మెండుగఁ గుప్పిఁ
బొలఁతులుఁ గుప్పు పుప్పొడుల మునిఁగిఁ
దెలవల కెల్ల బూదేనియల్ ద్రావించిఁ
దెలవ లర్పణ సేయుఁ దేనెలాని

యిటుల జలకేళి సలిపి యయ్యిందు ముఖులు
లీల విరుగడ నడువ సతీ లలామ
మేఘమధ్యంబు వెడలుఁ గ్రొమ్మెఱుఁగుఁ బోలె
నా సరోవర మల్లన నపుడు వెడలె 68

క. ఇట్లు నా సరోవరంబు వెడలి సతీదేవి సకియలుం దానునుఁ
దత్తీరంబునఁ జెన్ను మీఱు పొన్న గ్రమాకుల దండ నున్నతంబగు రత
నంపుఁ దిన్నెపై నెక్కి యచ్చట. 69

తే. గీ. రంగు మీఱిన ధౌతాంబరములఁ గట్టిఁ
బసిడి జలతారు రవికెలఁ బరగ దొడిగి
రత్నమయ భూషణంబులు రహిని దాల్చి
గుంకు మాగరు గంధముల్ గోర్కె నలఁది 70

వ. ఇవ్విధంబునం జెలులుం దాను దివ్యాంబరాభరణ భూషితలై యున్నయెడ
నా సరోవరం బందు. 71

తే. గీ. ఆ సతీదేవి కుచనేత్ర యాన వేణి
కలను సోకిన యా నీటఁ గలయ మునిఁగి
బడసె జక్కొట్ల హంస బంభర చయంబు
నజిన దున్నత శామందనైల్యములనౌ 72

క. బింబోష్ఠలు నలుగడ బలు
చందములన్ గొలువ నపుడు సతి గూర్చుండెన్
డెందము రంజిల తారా
బృందంబుల నడిమి చంద్రబింబము వోలెన్. 73

క. అప్పుడు వారి జనయనలు
నొప్పుల కుప్పయగు సతికి నొయ్యన సేవల్
మెప్పుగ జేసిరి తమ తమ
యొప్పగు నేర్పులు జెలంగ సురుచిర భక్తికిన్. 74

ఉ. అంగుగ దల్లి బంప నపు డావర మొప్ప సువాసినీమణుల్
బంగరు పాత్రలన్ బెరుగు పాలు ఘృతంబును ఖాయస్నానముల్
రంగుగ బిండివంటల మరన్ గొని వేడ్కలు నందడింప, ను
ప్పొంగుచు వచ్చి రచ్చటికి బొల్పుగ నా సతి సంతసింపగన్. 75

ఉ. అంత బ్రసూతి బంపిన పదార్థ చయంబుల నంది యా సతి
కాంత సఖీజనాళి గుతుకంబున గ్రొన్నెల ర్రాల వేదికన్
బంతులు దీర్చి వారల కపార దయన్ భుజియింప బెట్టి ని
శ్చింత జెలంగి దానును భుజించె బ్రసంగ విరాజమానయై. 76

వ. ఇట్లు నెచ్చెలులతోడ నా సతీ లతాంగి మజ్జన భోజన తాంబూలంబుల దృప్తి
నొంది యా సరోవరంబు చెంత గదలి మేఘ బృందంబు మాటున నుండి
గొబ్బున బయలుదేరు జంద్రరేఖ చందనంబున నవ్వనంబు వెడలి. 77

సీ. తగ నిబ్బటద్దముల్ ధరియించి కొందఱు
పడతి బుభయ పార్శ్వములను నడువ
బడతుకల్ కొందఱు పైడి బెత్తము లూని
బటువేగమున బరాబరులు సేయ
నీద్దఱు ముద్దియల్ తద్దయు భక్తితో
రమణీయమగు జామరములు వీవ
గంకణమ్ములు మ్రోయ గలకంఠి యొక్కతె
బంగారు ఛత్రంబు బట్టి నడువ

మఱియుఁ గొందఱు చెలులాకు ముడుపు లొసఁగ
సాటిలేవట్టి సొబఁగున వీటు మెఱయ
నా సతీమణి భాసితోల్లాసి యగుచు
జనులు పొగడంగ నిజగృహంబునకు వచ్చె. 78

క. కూతు రరు దెంచెనని యా
త్మాతురతఁ బ్రసూతిఁ గొందఱతివల తోడన్
బ్రీతి నరుదెంచె నెదురుగ
నాతత కరుణామృతాబ్ధి యల్లన పొంగన్.

చ. ఎదురుగ వచ్చు నజ్జనని కెక్కుడు భక్తి నమస్కరించి యా
నదమల కీర్తియైన సతి చారు గృహంబున కేగిఁ దన్ను స
మ్మదమునఁ గొల్చు నెచ్చెలుల మాన్యత నింట్లకుఁ బోవఁబంచి ఛం
పద పెలయంగఁ దల్లి కడ భాసిలు వేడ్క జెంగు చుండగన్. 79

సూర్యాస్తమయ వర్ణనము

సీ. అపర దిక్కాంత నీటముఁరంగఁ జెవి
వంచుఁ బూన్చినఁ దాడిఁ బువ్వమనఁగ
నస్తాద్రి శిఖరమం దమరొంద బొదలిన
పోకమౌ పవదంపు పొదరునంగ
పశ్చిమాంబుధి నుండి బయిఛాధేరి జగంబు
నరయవచ్చిన బాతబాగ్ని యనఁగ
విరహులు బెగదొంద విశిఖ వంక్తులు నూర
స్మరుఁడుఁ బూనిన రత్న కాటి మనఁగ
పుష్కరం బస్తుఁ బోదరింటఁ బొనఁగఁ బొదమిఁ
బరగ జారినఁ బలు దొండ పండనంగ
నఖిల జనులకుఁ దోషము నపుడు నరుణి
మంబు జెలువొంద జరతార్క బింబమొప్పె. 80

క. అంత. 81

సీ. రమణీయతఁ దొరంగి కమలముల్ ముకుళింపఁ
గవ బాసి చక్రవాకములు బడలఁ
దరు కోటరములఁ బతంగముల్ చొరబార
జారబసి గణంబులు నూళ్ళ వజ్జఁజేరఁ
బద్మ కోశంబులఁ బడి తేఁట్లు గీపెట్ట
చోరులు సిరిఁగ్గల్లు చోట్లు వెదుక
సంధ్య వార్చగ ద్విజుల్ జలతటంబుల కేగ
మందానిలంబు లింపొంద వీవ
విట విటీ జను లెదలందు వేడ్కఁ బొదలఁ
గూటమికి వాటమగునట్టి చోటు లరయ
నంబరం బెల్ల జామీకరాంబ రంబు
విస్తు దనరార మార్తాండుఁ డస్తమించె 82

వ. అంత. 83

మ. బలవంతుండగు రాజులేని తఱి దర్పం బేర్పడన్ దుర్జనుల్
బలు చందంబుల నేచి దేశవితతిన్ బ్రాపించు చందంబునన్
జలజాప్తుండటు గ్రుంక భూధర దరీ జాలంబు లందుండి పెల్
లలరన్ వెల్వడి ఘనఘోరాంతతమములన్ వ్యాపించెఁ జెంజీకటుల్. 84

ఉ. నిండిన వేడ్క రాత్రియను నీరజనేత్రి విశాలమైన బ్ర
హ్మాండ కరాట మందిడిన యంజనమో యన నెల్లదిక్కులన్
దండిగఁ బర్వి వస్తు సముదాయము లెవ్వియుఁ దోప వీక ను
ద్దండ గతిన్ జెలంగె వితతంబగు నత్తమ మంతకంతకున్. 85

గీ. చోరులెల్లనుఁ గుటిల సంచారులగుచు
జార పురుషులు విరహార్తి జాలిఁబడుచు
ధనమునకుఁ జేడియ లరతిఁ బెనగుటకును
నందు గొందులఁ జొచ్చిరా సమయమందు. 86

ఉ. పరువడి నాకసం బనెడుఁ బందిట మెండుగ నల్లి యవ్వి భా
వరి యను మల్లికాలతిక వాసిగఁ బూచిన పూవులో యనన్
నిరుపమ కాంతులన్ జెలఁగి నిర్మలమై దనరారు మింట సు
స్థిరముగఁ దారకల్ బొడమెఁ జెల్వుగఁ గన్నులకున్ బ్రియంబుగన్. 87

వ. అప్పుడు. 88

ఉ. చింతమనంబులన్ బొడమఁ జెల్వముఁ దక్కి విదేశవర్తులౌ
కాంతుల నాత్మలం దలచి కాయజు బాధల కోర్వ జాలకం
తంతకుఁ గుంది యుత్తమ మృగాక్షులఁ బోలి సరోవరంబులన్
గాంతిఁ దొఱఁగి మోడ్చి వలిగాడ్పున గ్రుక్కుచు నుండెఁ బద్మముల్. 89

సీ. మల్లెపూవుల తోడ మైత్రి సంపాదించి
బొండు మల్లెల తోడఁ బొందు సేసి
సన్న జాజుల తోడ సఖ్యంబు పాటించి
చేమంతి విరులతోఁ జెలిమి సలిపి
సంపంగి విరులతోఁ సంపర్కమొనరించి
మొగలి రేకులఁ గూడి మురుపుఁ జెంది
పొగడ పువ్వుల తోడఁ బొసఁగ నేస్తముఁ బూని,
సురపొన్న విరులతో సొరిదిఁ గదిసి

యెల్ల విరహుల మనములఁ దల్లడిల్లఁ
గొల్లలుగఁ దావు వెదజల్లి జల్లదనము
తెల్ల దిశలందు నెరపి యుత్ఫుల్ల గతుల
నల్లనల్లన మారుతం బపుడు వీచె. 90

వ. అనంతరంబు. 91

సీ. చొక్కమౌ రతికాంత చెక్కుటద్దముఁ బోలి
దంటైన నుదుట నామంబుఁ దీర్చి
నెలవంకతో సాటిఁ గులుకు కన్నుల విల్లు
మెల్లన దాకేల మేళవించి
విరహుల హృదయముల్ వెస వ్రక్కలింపఁ జాలి
ప్రదర సంతతుల నేర్పొదవఁ బట్టి
బటుకులట్టలు తేనె లొలుక ముద్దులుఁ గుల్కఁ
జిలుక వారువముపై వెలయనెక్కి.

జెలువు మీరిన మగరాల చికిలి వంకి
దిట్టమగుఁ బట్టుదట్టిలో నట్టెఁబూన్చి
భృంగ పిగ సంఘ రవము లుప్పొంగిఁ జెలఁగ.
దర్పకుఁడుఁ బాంథ చయముపై దండు వెడలె. 92

వ. అప్పుడు. 93

తే. గీ. రేవెలుంగును గర్భీకరించినట్టి
తొలు దిగంగన నెమ్మోము తెలుపనంగఁ
గరుడు గతి నున్న చీకటి గరగి చెదరఁ
దూర్పు దిక్కున ధవళిమఁ దోచె నంత. 94

## చంద్రోదయ వర్ణనము

సీ. పూర్వ దిక్సతిఁ దన ఫాలుపైన నదుటిపై
దీర్చిన కపురంపు తిలక మనఁగఁ
బ్రాగద్రిపై నుండిఁబొలోమి వలకేలఁ
బట్టిన మగరాల బంతి యనఁగఁ
బొడుపు గుబ్బలి మీదఁ బొసఁగ నిర్జరు లెత్తుఁ
జెలువైన యమృతంపు కలశ మనఁగఁ
దొలుఁ గట్టుపై వేలుపుల ఱేడు నిర్మించు
మెచ్చైన పటికంపు మేడ యనఁగఁ

దనరిఁ జీకటి విరియంగ ధవళరుచులు
దెసలఁ బరువఁగఁ బాంథులు వెసఁదపింపఁ
గమలములుఁ గందఁ గువలయ సముదయముతోఁ
బ్రీతిఁ దనకొంద నుదయించె శీతకరుఁడు. 95

క. చందురుఁ డుదయించిన తటి
బొందుగ నచ్చెంద్రికా సమూహముఁ గదిమిన్
గ్రందుకొనెఁ బాంథజనములు
కందర్పు పడి రతికి సతుల సంప్రార్థింపన్. 96

## చంద్రికా వర్ణనము

వ. ఇత్తెఱంగున నచ్చంద్రికా సముదయం బంత కంత కతిశయించి గంధ
గజేంద్ర సంఘంబు వోఁగరున ననేక శాఖా సముదయంబుల నతినిబి
డంబులై ధ్వాంతంబులకు నుండ నిరవులగు కాంతంబులగు వనాంతంబుల
కవార్యంబునన్ క్రమ్ముచు, నతి భయంకరంబగు గిరాతక దర్శనంబున
నదలి మిన్ను మన్నుఁ గానక నట్టడవిన మిట్టిపోవు కురంగ నికరంబు
పరువున దిక్తటంబులకున్ కుప్పించుచు, నఖండ పరాక్రమంబున నెదురు
లేక సంచరించు మృగేంద్ర నివహంబు ధాటి నభ్రంకష శిఖర సముదయ
విరాజమానంబులగు మహాపర్వతోపరి ప్రదేశంబులకు లంఘించుచు,
నుద్దండ పుండరీక బృందంబుల గుంపున నలలిత ప్రసూన వికచ
పరిమళ మిళితంబులై మనోజ్ఞంబు లగు నానా లతా గృహంబుల
కగ్గలంబునన్ దూరుచు, నపరిమిత బల పటిష్టంబగు విహగేంద్ర సందో
హంబు నురవడి ననేక గ్రహ నక్షత్ర తారకా విలసితంబగు నంబరంబు
నాచ్ఛాదించుచు, సువాసనల కానందించుచు నల్లనల్లనఁ బౌరవరిండ్ల మఱుం
గుల కేగు దర్వీకర నికరంబు చొప్పున వైడూర్య గవాక్ష మార్గంబుల
మహోన్నత సౌధాంతరాళంబులన్ ప్రవేశించుచు, భగీరథ ప్రార్థనంబున
హరి జటాజూటంబు విర్గమించి నిమ్నోన్నతంబులగు మహాదుర్గమా
రణ్యంబుల నాక్రమించి నిజకల్లోల సన్నిత ధాళధళ్యంబుల నెల్ల దిక్కులన్
జల్లుచు ననేక మార్గంబుల నేతెంచు గంగాప్రవాహంబు చెలువున విజృం
భించి మహారాజ పట్టణ ప్రాకార గోపురాట్టాలక వ్రాతంబులన్ బూన్చిన
వజ్రవైడూర్య గోమేధికాది రత్నప్రభా పుంజంబుల నైక్యంబుఁ జేసుకొని,
రమణీయ హాటక సౌధోపరి ప్రదేశంబులన్ చల్లని మందమారుతంబుల
కానందించుచు మల్లికా కుసుమ తల్పంబులఁ బవ్వళించి విజావయువ లిప్త
గంధ కస్తూరికా సౌరభంబులు ఘుమ్ముమనన్ గ్రమ్ముకొన సకలాలంకార
యుక్తులగు పతులన్ గలసి మన్మథక్రీడా వినోదంబులం దేలు మహారాజ
పురంధ్రీ మణులగుచాగ్రంబులం దులకించు హీరతార హార కాంతులతోడ
నెయ్యంబున వియ్యంబు నొంది, కుంద బృంద నిబద్ధంబులై చందనోద
కార్ద్రింబులగుఁ జల్వ చప్పరంబుల నందంబు మీర శయనించి రతులకుం
గనయ్యగ్గోరు పత్నుల వ్రేగిరపడకుండుడని మెల్లన నివారించి దత్పదార్థ

పిండంబులఁ గరాంగుళంబుల నొత్తుచు, నంతకంతకు మోహం బతిశయిల్ల
మధురసంబు లొలుకు మృదులగాన కళావిశేషంబులం జూపు ప్రౌఢాంగ
నల శ్రోత్రంబు లందనరు మగరాల చికిలి కమ్మల తళత్తళల హత్తుకొని
శుద్ధాంతంబుల భోజనాది కృత్యంబులు నిర్వర్తించి నూతన గంధ
మాల్యాంబరాభరణ భూషితలై తాంబూలంబులు బంగరు పళ్లెరంబుల
నుంచుకొనిఁ బద నూపురంబులు మొరయ సోపాన మార్గంబుల సున్నత
ప్రాసాదాగ్రంబుల కరుగుదెంచి తమ కంటె మున్నువచ్చి యచ్చటఁ
బ్రవాళ పర్యంకంబుల నుపధానంబుల ప్రాలి నిరీక్షించు భర్తలన్ గదిసిఁ
దడవుసేసిన నేరంబు క్షమింపుడని పదంబుల కెరగి, శయ్యనం గూర్చుండి
సరస భాషణంబుల నంతరంగంబులన్ గరగింపుచు ఘనసారార్ద్రంబులగు
కర్పూర ఫల ఖండంబులతోడఁ దెఁనాకు మడుపు లొసంగు పతివ్రతల
కరనఖర సముదయ చ్ఛాయలం దొంతరఁగొని, పెందలకడన్ కదలి
తాంబూలహస్తులై రహస్యంబున నభిసారికా గమనంబులకు సంకేత
స్థలంబులకుం జని తద్దయుఁ బ్రొద్దు బుచ్చి కర్పూర పరాగాచ్ఛాదితంబు
లగుఁ జల్లని పాన్పుల విరహవేదనన్ బొరలుచున్న నిజభార్యల
నెచ్చరింప వచ్చిన సవ్వర వర్తినులు వారల ముఖారవిందంబులన్
గల యిట్టట్టన నేరకఁ బరస్త్రీ సంభోగ చిహ్నంబులన్ గనుపఱుచు
నెపంబున హస్తంబులం బట్టి చూపు మెఱుంగు టద్దంబుల ధగద్ధగలఁ
గలయ నల్లుకొని, స్వకార్యార్థులై పరదేశంబులకుం జనిన సొగసుకాండ్రు
బహుదినములకు నిజ గృహంబుల కరుదెంచి, యతి వేగంబున మజ్జన
భోజనాదులఁ దీర్చి సకలాభరణ భూషితులై సంతసంబునం బొదలుఁ
దమ భార్యలం దోడ్కొనిపోయి మించు టుప్పరిగెల నధిక రత్నోజ్జ్వ
లంబులగు బంగరుపట్టె మంచంబులన్ దనరు మెత్తని సెజ్జలం జేర్చిఁ
జిత్తజ క్రీడకుం గదిసి, గొబ్బున పయ్యెదలు తొలగించిఁ గంచుకంబులు
సడలింప బిట్టులికి కౌగిలించుకొను నమ్ముద్దు గుమ్మల మందహాస ద్యుతుల
వసంగి పెనంగి, విటశ్రేష్ఠ లఖిలాలంకారంబు లూని ధనాభరణంబులు
సంగ్రహించి మన్మథబాణ పీడితులై యతి వేగంబునం జని గృహ
ద్వారంబుల నిల్చిఁ దమ యాగమనంబు లచ్చోటి ముద్దియల వలనఁ
దెలియఁజేయనప్పుఁ డెదురుఁ జనుదెంచి వార లొసంగు ధనావళులకు

మెచ్చుచు, ననురక్తిన్ దోడ్కొనిపోయి రమ్య సౌధాగ్రంబులం దేజరిల్లు
హంసతూలికా తల్పంబులం జేర్చి యనంగ క్రీడలం దృప్తులం జేయు
వేశ్యాంగనల నిటల స్థలంబుల నేర్పు మీఱ దీర్చిన కర్పూర తిలకంబు
లతోఁ దులదూఁగి, మహాపర్వత శిఖరాగ్రంబులం గరంగి సెలయేళ్ళ
తెఱంగున నల్లనల్లన మిన మినం జాలువారు విస్తంపు చంద్రకాంతపు పీటన్
బ్రతిఫలించి, రమ్యంబులగు సరోవర తీరంబులఁ బద్మాసనస్థులై నయనార
విందంబులు ముకుళించి భగవన్నామంబుఁ జపియింపుచుఁ దదేకనిష్ఠా
గరిష్ఠులైన మహామునులఁ గరాంగుళంబులం దెలంగు శుద్ధ స్ఫటిక మాలి
కలపై నటనంబు సల్పి గిరి ప్రాంతంబులన్ జెన్నుమీఱు నదీతీరంబులన్
బొదలుఁ దరు కదంబంబుల నల్లుకొనిఁ బరిమళంబుల వెదజల్లుచు, విండ్రాత
విరిసిన మల్లికాకుసుమ నికరంబులపై నర్తమిల్లి, మదిరాపానమత్తులై
మన్మథా మోదనంబులఁ జొక్కి, వసనంబు లుడివోవ నరణ్య ప్రదే
శంబుల నిద్రించు శబర శాబరీ గాత్రంబుల వస్త్రధరత్వంబు నిరూపించిఁ
బాలవెల్లి నలుదెసల నుప్పొంగి ధరణీతలంబు నావరించెనో యన నెల్లెడల
విక్రమించి, నిరంతర భగవచ్చరణారవింద సంస్మరణంబునం బవిత్రం
బైన సత్పురుషుని హృదయంబు చందంబున నతి స్వచ్ఛతరంబై, నిఖిలవేద
శాస్త్ర పురాణ గ్రంథార్థ వ్యాపకంబైన మహావిద్వాంసుని మానసంబు తెఱం
గున నాచ్ఛాదిత దిక్తటంబై, సజాతీయ విజాతీయ భేదరహితంబగు స్వభా
వంబుఁ గలిగి, నిష్కామకర్మానుష్ఠానంబునం జరియించి భాగవోత్తముం
డైన పండితుని స్వాంతంబు వడువున, బవిత్రా పవిత్ర స్థలగతంబై మనో
వాక్కాయ కర్మంబుల నన్యంబెఱుంగక నిజనాథుని జగన్నాథుగా
సేవించుఁ బరమ పతివ్రతా చిత్తంబు పోలిక నతి దార్ఢ్యంబై యుల్లసిత
మధురస బిందు బృందంబుల వెల్లిఁ గొలుపుఁ బ్రఫుల్ల మందహాసంబునం
దేజరిల్లు విలాసినీ వదనారవిందంబు భాతి జగదాహ్లాదకరంబై విజ్ఞాన నిశిత
ఖడ్గంబున నజ్ఞానజంబగు కామాది శత్రువర్గంబుఁ దెగటార్చి నిర్భయం
బున మెలంగు సాంఖ్య యోగి చాడ్పున, నఖండ రుచినికర విదళిత
ధ్వాంతంబై యజాత శత్రుత్వంబునఁ బూజ్యంబగు నఖండ రాజ్యవైభ
వంబున నిరంతర విరాజమానుండగు మహాప్రభువు చందంబున నాక్రమిత

సకల ధరణీమండలంబై సకలదేవతా సముదయంబుల కనురక్తి ననవ రతంబు విస్తారంబుల పరిమితంబుగఁ బ్రసాదించు కల్పవృక్షంబు తీరునఁ జకోర తృష్ణాపహారంబై ప్రాణి సమూహంబులకు నిఖిల వస్తు పరిజ్ఞానం బొసంగుచు జగద్వ్యాపకంబై విరాజమానంబయ్యె నయ్యెడ. 97

సతీదేవి స్వప్నమందు సదాశివునిం గాంచుట

తే. గీ. అట్టియెడఁ జంద్రకాంత సౌధాగ్ర సీమఁ
గరముఁ జెలువొందుఁ బూలఁ బప్పరమునందు
మురువుఁ దళుకొత్త నా సతీ మోహనాంగి
యుంద మలరంగ సుఖనిద్రఁ జెందుచుండ. 98

సీ. మిన్నేటి తళుకుల వన్నెఁగుల్కెడు జటా
భరమున నెలరేకఁ బసఁదనర్పఁ
గళలఁ జెన్నలరారు నళికస్థలంబుపై
భసిత త్రిపుండ్రంబుఁ బరిఢవిల్ల
శ్రవణద్వయము నందుఁ జెలఁగుఁ గుండల రుచుల్
గండస్థలము లందుఁ గ్రమ్ముకొనఁగఁ
గన్నుల కరుదైన సన్నంపు రుద్రాక్ష
మాలిక యురమందు లీలఁ బొదల

డమరు శూలాదికములు హస్తముల మెరయఁ
జారుతరమగు ధవళవస్త్రములఁ దాల్చి
ముద్దుమోమునఁ జిరునవ్వు మొలకలెత్త
శంకరుఁడు స్వప్నమందు సాక్షాత్కరించె. 99

వ. అప్పుడు. 100

వ. నిరుపమ సుందరాంగు, మహావీరు చరిత్రు, దయాళు, నమ్మహా పురుషవరేణ్యు స్వప్నమునఁ బొడ్వఁగఁ జూచి సతీలలామ దా నెరగు ముదంబు నొంది, గడువేగమె మ్రొక్కి యనంతరంబ భాసురమగు రత్నపీఠమిడి సొంపుగ సన్నిధిఁజేర్చి యిట్లనున్, 101

క. అనఘాత్మ! నీ సుదర్శన
ఘన సూర్యోదయముగాదు కల్మష తమమున్
మునుకొని విరించి మనం
బున సుజ్ఞానంబు మిగులఁ బొదలఁగ జేసెన్. 102

వ. మహాత్మా! నిష్కాములై భగవదర్పణంబుగ సుకర్మంబు లాచరించఁ గర్మయోగులకున్ గాక. సకాములై గర్మత్యాగంబు సేసి, పలుఁ దెరంగుల సంచరించఁ గపటయోగులకు నిష్కారణ భావంబు నెట్లుఁ బొంద నగు? పూర్వ భవార్జితంబగు భాగవత సేవానుష్ఠాన విశేషంబునం జేసి మజ్జన్మ పావనంబుగా భవద్దర్శనంబు సంప్రాప్తంబయ్యె. దేవా! పరమ శ్రేయంబుఁ గోరి యొక్క ప్రశ్నంబు సేయవలసె. నిర్గుణంబై, నిరాకారంబై, నిష్కళంకంబై, నిరుపాధికంబైఁ దేజరిల్లు పరబ్రహ్మం బేమి కతంబున గుణాకార కళంకోపాధి సహితంబగు జగద్రూపంబు ధరియించెఁ? దద్విధం బంతయుఁ దెలియం దగుదునేని గటాక్షంబున నానతీవలయు ననవుడు దరహసిత వదనుం డగుచు నమ్మహాత్ముం డిట్లనియె. 103

## సతీదేవికి స్వప్నమందు సదాశివుం డధ్యాత్మయోగం బుపదేశించుట

వ. తనకుఁ దోడెద్దియు లేక నేకంబగు నద్వైత బ్రహ్మంబు నుబుసుపోకకు సంసారవేషంబునం గ్రీడింపఁ దలంచి స్వాంశంబున మహామాయా మయంబైనఁ బ్రకృతి నుత్పాదించె. నాఁ బ్రకృతికి మహత్తత్త్వంబుఁ బొడమె. దానికి నహంకారంబు జనియించె. నా యహంకారంబునందు శబ్దగుణకంబైన గగనంబు పుట్టె. నా గగనంబునందు శబ్దస్పర్శ గుణకంబగు వాయువు నుత్పన్నంబయ్యె నా వాయువునందు శబ్దస్పర్శ రూప గుణకంబైన తేజం బుద్భవించె. నా తేజంబునందు శబ్దస్పర్శ రూప రసగుణకంబైన యుదకంబుఁ గలిగె. నా యుదకంబున శబ్దస్పర్శ రూప రసగంధ గుణకంబైన పృథివి సంభూతంబయ్యె. నిట్లహంకార జంబులైన పంచ భూతంబు లొకటికంటె నొకటి గుణాతిశయంబున నుదయించి భగవన్ని యోగంబున నా భూతంబులైదునుఁ గ్రమంబున నొకటి యొకటి

ద్వివిధంబై దశ ఖండంబులగుచునందు నైదు ముఖ్యార్థంబులయ్యె. శేషార్థంబు లైదునుఁ గ్రమంబున నొకటి యొకటి చతుష్టయంబై వింశతి ఖండంబులగుచుఁ గ్రమక్రమంబున నమ్ముఖ్యార్థంబులం జెంది పంచీకరణం బయ్యెనది యెట్లనిన. 104

సదాశివుండు సతీదేవికి పంచీకరణలక్షణం బెఱింగించుట

వ. గగనంబునం దర్ధంబు జ్ఞాతృత్వంబయ్యె. తచ్ఛేషార్థంబు నాలుగు భాగంబులై క్రమంబున గంధవహ వైశ్వానర జల భూభాగంబులం గూడి మనోబుద్ధి చిత్తాహంకారంబులయ్యె. సమీకరణంబునం దర్థంబు వ్యానమయ్యె. తచ్ఛేషార్థంబు నాలుగు ఖండంబులై యాకాశ హుతాశన సలిల ధరిత్రీ ఖండంబులం గలసి ప్రాణాపానోదాన సమానంబులయ్యె. వహ్నియం దర్థంబు నయనేంద్రియంబయ్యె. తచ్ఛేషార్థంబు నాలుగు శకలంబులై వ్యోమమారుత జీవన స్థిరా శకలంబుల మిశ్రమంబై త్వక్ఛ్రోత్ర జిహ్వ ఘ్రాణంబులయ్యె. నుదకంబునం దర్థంబు రసంబయ్యె తచ్ఛేషార్థంబు నాలుగంశంబులై యంతరిక్ష పవన వీతిహోత్ర క్షోణ్యంశంబుల మేళనంబై శబ్దస్పర్శ రూప గంధంబులయ్యె. వసుంధరయందర్ధంబు పాయువయ్యె. తచ్ఛేషార్థంబు నాలుగు తునియలై నభస్సమీరాగ్ని భువనంబుల తునియలం జేరి వాక్పాణిపాదోపస్థలయ్యె. నిత్తెఱంగున ముఖ్యార్థంబులు శేషార్థ ఖండంబు లన్యోన్యంబు నొంద జ్ఞానేంద్రియ పంచకంబును, గర్మేంద్రియ పంచకంబును, విషయ పంచకంబును, వాయు పంచకంబును, నంతఃకరణ చతుష్టయంబునన్ జతుర్వింశతి తత్త్వంబులై భగవదాజ్ఞం జేసి మహా స్థూలంబులై సకల చరాచర వస్తు సహితంబులగుఁ జతుర్దశ భువనంబులయ్యె. నందు జ్ఞాతృత్వం బిరువదేనవదియై జీవతత్త్వంబై క్షేత్రజ్ఞ భావంబునం బ్రవేశించె; నిప్పుగిది భగవత్పర బ్రహ్మంబు జీవ సంజ్ఞుఁడై మహామాయా స్వరూపంబగుఁ బ్రపంచంబు నందు వ్యాపించి సర్వక్షేత్రజ్ఞ భావంబునఁ బ్రకృతి తోడ సంసార సౌఖ్యంబు ఘటింపదుఁ గావునఁ బూర్ణుండయ్యును వ్యష్టి భావంబునం దనరి సర్వంబు స్వాంశంబని తెలియనేరక గ్రాహ్య గ్రాహక నిరూపణంబున మెలంగుచు సల్పబలునిచేత ముగుఁ ద్రాటం

గట్టివడు మహావృక్షఖంబు చందంబున మాయా గుణనిబద్ధుండై యనేక శాఖాకిసలయ కుసుమ ఫలభరితంబైన వనంబున సంచరించు శుకంబు వడువున నానంద విహారంబు సల్పుచు, నింద్రియంబుల వలన విషయ సుఖంబుల ననుభవింపుచు, నిత్యంబును స్థూల సూక్ష్మకారణ శరీరంబులన్ బూని విశ్వతైజస ప్రాజ్ఞ నామదేయంబుల జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల ననుభవింపుచు, నెంక కాలంబునకుఁ దనివి నసక సుఖదుఃఖాత్మకంబగు సంసార చక్రంబునం గ్రీడింపుచు సుకర్మ దుష్కర్మంబు లాచరించి యుత్తమ నీచ జన్మంబులఁ దత్ప్రారబ్ధంబు లనుభవింపుచు, గామక్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులం గూడి మిత్ర శత్రు భేద వ్యవహారం బునం బ్రవర్తింపుచుండు నిది జీవవ్యష్టి భావ ప్రవర్తనంబని విని మహా దాశ్చర్యంబు నొంది రత్నపీఠంబు నలంకరించు నా పరమపురుషుని పదార విందంబులకుఁ దన నయనారవిందంబులు సోక నమస్కరించి భక్తివినయం బులు దీపింప నా సతీదేవి యిట్లనియె. 105

క. సృష్టిప్రకార మెల్లను
వ్యష్టిగతిన్ జీవుడందు వసియించుటయున్
స్పష్టంబయ్యె మహాత్మ! స
మష్టి క్రమమింకఁ దెల్పు మహిత చరిత్రా! 106

క. అజ్ఞానులైన వారల
సుజ్ఞానులఁ జేయఁ గోరి సొరిది జగములన్
ప్రాజ్ఞతఁ జరియింతురు బుధ
సౌజ్ఞల మిము బోటు లధిక సంతస మలరన్ 107

క. సదసద్వివేక యుష్మత్
సదమల వాగమృతధార శ్రవణముఖములన్
ముద మొదవ నెంతఁ గ్రోలిన
మదిఁ గల్గునెఁ దృప్తి వెడగు మర్త్యునకైనన్. 108

క. గురువుల మనుచునుఁ గొందఱు
న్గరుధగు వేషములుఁ దాల్చి యర్థాపేక్షన్

ధర నుపదేశము లొసంగుచుఁ
గరముఁ జింతు రది మిథ్యగాదె మహాత్మా! 109

తే. గీ. ఉత్తమం బగుఁ బ్రశ్నకు నుత్తరంబు
నేర్పుఁ దనకొత్త వివరింప నీకుఁ గాక!
నిల విచారింప నితరుల కలవి యగునె?
యతుల విజ్ఞానసార మహానుభావ! 110

క. అని యిట్లు విన్నవించిన
మనమున హర్షంబు నొంది మగువా! విను నీ
వొనరించినఁ బ్రశ్నమునకు
ననువుగ నుత్తరము నిత్తునని యతఁ డనియెన్. 111

తే. గీ. సర్వలోక స్వరూపుఁడై వెలుఁగుచున్న
యనఘుఁ! బరమాత్ము స్థూలదేహంబుఁ దెలియ
విగత కల్మషవై వేగ విమల నిత్య
శోభనంబులఁ బొందెదు సుందరాంగి! 112

సదాశివుండు సతీదేవికి భగవద్విరాడ్రూప విధంబుఁ
దెల్పుట

వ. అని పలికి సర్వాత్మకుండును, సర్వేశ్వరుండును, సర్వగురుండు నగుఁ బరమాత్ముండుఁ దాన కావున మహానందంబున నేత్ర కమలంబులు ముకుళించి యొక్కించుకఁ దడవుఁ దన విరాడ్రూపంబునుఁ దాన ధ్యానంబు సేసి క్రమ్మఱ నయనారవిందంబులు విచ్చి దన యెదుటఁ గర కిసలయంబులు ముకుళించిఁ గూర్చున్న యా సతీదేవిపై యానందబాష్ప సహితంబులగుఁ జల్లని చూడ్కులు వెల్లిఁ గొల్పి యో ప్రమదోత్తమా! పురాణపురుషుం డగు భగవంతుని విరాడ్రూపంబుఁ దెలిసి వర్ణింప మనోవాక్కుల కగోచరం బైనను, నీ భక్తి వినయంబులకు మెచ్చి నీ యందలి నెయ్యంబునం దెల్పెద. నిశ్చల చిత్తంబున నాకర్ణింపుము. నవ్విశ్వ శరీరంబునకుఁ బాదంబు లతలంబు, గుల్ఫంబులు వితలంబు, జంఘలు, సుతలంబు, జానువులు రసాతలంబు, నూరువులు మహాతలంబుఁ, గటిప్రదేశంబుఁ లాద

తలంబు, గుహ్యంబు, నాగలోకంబు, నాభి భూలోకంబు, జఠరంబు భువర్లోకంబు, వక్షంబు స్వర్లోకంబు, కంఠంబు మహర్లోకంబు, ముఖంబు జనర్లోకంబు, భ్రూమధ్యంబుఁ దపోలోకంబు, మస్తకంబు సత్యలోకంబు, బ్రహ్మదండి మేరువు, నేత్రంబులు సోమసూర్యులు, శల్యంబులుఁ బర్వతంబులు, నాడీ సముదయంబులు నదులు, దనూరుహంబులు వృక్షలతా నివహంబులు, గర్భాంతరాళంబు సముద్రంబులు, వస్త్రంబులు జలదంబులు, బ్రాణంబులు వాయువులు, ధ్యాస కాలంబులు సంధ్యలునై యొప్పార నప్పురాణ పురుషుండు సమష్టి స్థూల సూక్ష్మకారణ శరీరంబుల విరాట్పురుష హిరణ్యగర్భా వ్యాకృత నామధేయంబులం ధరియించి సకల భువన స్థూల సూక్ష్మప్రాణి సముదాయాంతరంగంబుల వ్యష్టి భావంబున మనస్సహితుండై జీవుం డనుభవించు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థానుభవంబుల నయ్యైకాలంబుల సర్వవ్యాపక మనోయుక్తుండై యొక్కఁట నెఱుంగుదు, నిట్లు సర్వక్షేత్రజ్ఞ భావంబున సర్వేంద్రియార్థంబుల దనయందనుభవింపుచు నాత్మారాముండై యనంత రూపంబునం దేజరిల్లు నమ్మహాపురుషుని ముఖంబున బ్రాహ్మణులు, బాహువుల క్షత్రియు, లూరుల వైశ్యులు, బాదంబుల శూద్రులు జన్మించి వర్ణాశ్రమ ధర్మంబులం బ్రవర్తిల్లి, ద్వివిధంబునఁ ద్రిగుణాత్మకంబైన బ్రకృతి సహితంబగు వ్యష్టి సమష్టి దేహప్రకారం బిది యని చెప్పి మరియు నిట్లనియె. 113

ఆ. వె. ప్రకృతి సహితుఁడయ్యుఁ బ్రకృతిని బొరయక
సలిల మధ్య కమల దళము కరణిఁ
దేజరిల్లుచుండుఁ, దెలియని వారలఁ
బొందె నండ్రుఁ గానిఁ బొందఁ డతఁడు 114

తే. గీ. పరమ యోగుల కెల్ల నుపాస్యుఁ డగుచు
నరయ నింధనముల నుండు నగ్ని వోలె
భూత సంతతులందు సంపూర్ణుఁ డగుచు
వెలుఁగు నా బ్రహ్మ మేటికిఁ దెలియఁ బడకే, 115

## సదాశివుండు సతీదేవికి వ్యష్టి సమష్టి భావంబులకు సాక్షియగు పరబ్రహ్మ లక్షణంబుఁ దెల్పుట

సీ. జల కుంభములఁ దోచు సూర్యాంశబింబములకు
సలలితంబుగఁ దాన సాక్షి యగుచు
వెలుఁగు మార్తాండుని విధమున వ్యష్టి స
మష్టి వర్తనమున మాయ యందుఁ
బరగఁ దోచెడుఁ దన ప్రతిబింబముల కెల్ల
సాక్షియై యానంద సహితుఁ డగుచు
నిరుపమాకారుఁడై నిఖిల సంసేవ్యుఁడై
నిర్గుణ బ్రహ్మమై నిత్యుఁ డగుచు

నొక్కపరి సర్వజగముల నుక్కడంచు
నొక్కతరి జగము లన్నిటి నొనరఁజేయు
నొక్కవేళను సమబుద్ధి నూరకుండు
నెటుల వలసిన నా దేవుఁ డటుల నుండుఁ. 116

క. ఆ బ్రహ్మమె పరమేష్ఠియు
నా బ్రహ్మమె కేశవుండు నభవుం డింద్రుం
డా బ్రహ్మమె జగమెల్లను
నా బ్రహ్మమె యంతకంటె నన్యము గలదే! 117

తే. గీ. ఇట్టి యోగంబుఁ దెలిసి మునీంద్రు లెపుడు
నిశ్చల బ్రహ్మ నిష్ఠులై నేర్పు దనర
ప్రకృతి సుఖదుఃఖములఁ బాసి పరమ సౌఖ్య
కారణంబగు మోక్షంబుఁగందు రబల! 118

వ. అని పలికి యప్పరమేశ్వరుండు మరియు నిట్లనియె. సర్వ తత్త్వాత్మ కంబై, సర్వవికారమయంబై చరాచర స్వరూపకంబైన జగత్తు క్షేత్రం బనంబడు, నా క్షేత్రంబు నీవ కావే! దృశ్యంబు గాక నపర భాగంబున నాచ్ఛాదించి ముకురంబునఁ జిత్ర కళల వెలుంగఁజేయు నజ్జరసంబు చందంబున నా క్షేత్రంబునందు సంబంధ భావంబునం గలయ వ్యాపించి

ద్రష్టనై దృశ్యుండఁ గాక సద్భుత ప్రకారంబుల దానిం దేజరిల్లంజేయు క్షేత్రజ్ఞుండ నేన కానే! యని తాదాత్మ్య భావం బుపదేశించి, దన విశ్వరూపం బా సతీరత్నంబునకుఁ గను పఱచం దలంచి యాక్షణంబు దివ్యదృష్టి యొసంగి విలోకింపు మనవుఁడు నమ్మగువ చరాచర సహితం బులగు బ్రహ్మాండంబు లమ్మహాభావునందుఁ గనుంగొని మహదాశ్చర్య భయ సంతోషంబులు మనంబున బెనంగొనఁ గనుంగవ మోడ్చి యాంతర్యంబున నమ్మహామూర్తిని దర్శించుచుఁ గొంతవడికి నానంద బాష్పంబులుఁ జడిగొన నేత్రంబులు విచ్చి మహాప్రకృతిఁ గావున ధైర్యం బొక్కింత యవలంబించి నిటలతట ఘటిత కరాంజలియై గద్గద కంఠంబున నిట్లని స్తుతియించె. 119

## సతీదేవి సదాశివుని విశ్వరూపంబునుం గని స్తుతించుట

సీ. జయ సర్వలోకేశ! జయ శాశ్వతానంద!
జయ దీన మందార! శరణు! శరణు!!
జయ నిర్మలజ్ఞాన! జయనిత్య కల్యాణ!
జయ భక్త నిర్వాణ! శరణు! శరణు!!
జయ రమ్యగుణధామ! జయ కల్మషవిరామ!
జయపావన సునామ! శరణు! శరణు!!
జయశ్రీ మహాదేవ! జయకోటి రవితేజ!
జయ విశ్వరూపక! శరణు! శరణు!!

జయ నిరంకతర శుభకర శరణు! శరణు!!
జయ సురార్చిత పాదాబ్జ శరణు! శరణు!!
జయ కృపాయత పాథోధి శరణు! శరణు!!
జయ మహా తాపసారాధ్య శరణు! శరణు!! 120

క. బహు శిరములు బహు కరములు
బహు పదములు బహు ముఖములు బహు నేత్రంబుల్
బహు జగములు బహు శరముగ
బహు వింతగఁ దోచె నీదు భవ్యతనువునన్. 121

క. ఔదుంబర తరువున నా
హ్లాదంబుగ నుండు ఫలచయంబుల పగిదిన్
శ్రీదంబగు నీ తనువున
మోదమున నజాండ పంక్తి మునుకొని వెలిగెన్. 122

క. ఓయనఘ! చిత్తగింపుము
వేయేటికి సకలలోక వితతులు వరుసన్
నీ యందు జనన మొందును
నీ యందు వసించుచుండు నీయందడగున్. 123

క. లోకంబుల నీ వుందువు
లోకంబులు నిన్ను బొంది లోలత వెలుగున్
శ్రీకర నీ మహిమోన్నతి
ప్రాకటముగ నెన్న బద్మభవునకు వశమే! 124

తే. గీ. భూరి తేజోమయం బయి బూర్ణమగుచు
దేజరిల్లెడు నీ విశ్వ దేహమునకు
నాది మధ్యాంతములు గాన నలవియగునె
సచ్చిదానంద మయమూర్తి సాధు కీర్తి. 125

క. భూరితపో నియమంబుల
నారసి బొందంగ రాని యఖిలాత్మకమౌ
నీ రూపము గని ఘోరా
కార భవాంభోధి దాటగంటి మహాత్మా! 126

వ. అని యిట్లభినుతించి యా సతీలలామ మరియు నిట్లనియె. మహా తేజోనిధీ! యనేక బ్రహ్మాండాశ్రయంబైన భవద్విశ్వ శరీరంబునందు దేవయక్ష కిన్నరగంధర్వ సిద్ధ విద్యాధరాదు లధిక భక్తి వినయంబుల నొక్కచాయనుండి నిన్ను నానావిధంబుల స్తోత్రంబు చేయుచున్న వారింద్రాగ్ని యమ వరుణాద్యష్ట దిక్పాలకు లనేక నిర్జర సహితులై పరశుపట్టి సముద్గర భిండివాల శూలాద్యాయుధంబులు ధరియించి యొక్కసీమ నుద్వదాజ్ఞా బద్ధులై భృత్యకృత్యంబులు సేయుచున్నవారు. మహా

యోగీంద్రులు యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగంబుల తోడ వీరాసన, స్వస్తికాసన, పద్మాసన, యోగాసన, కూర్మాసన, భద్రాసన, సిద్ధాసన, సింహాసనంబుల నుండి నిర్మల మనః కమలంబుల నిల్పి నిశ్చలులై యొక్క భాగంబున ధ్యానంబు సేయుచున్నవారు, బ్రాహ్మణులు ధౌతాంబరంబులు ధరియించి యొక్క యోరన్ గూర్చుండి యజ్ఞ సూత్రంబు లంగుష్ఠంబులం బట్టుచు దదేక నిష్ఠులై వేద శాస్త్రాధ్యయనంబు సేయుచున్నవారు, దానవనాయకు లధిక సైన్యసమేతులై బరాక్రమంబున సకలాయుధంబుల కాంతులు నేత్రంబులకుంమిరుమిట్లు గొలుప నొక్కవంక నాదిత్యులపై నురువణింపుచున్నవారు. యాజక బృందంబు లగ్నులఁ బ్రజ్వలింపఁజేయఁ దమ తమ భార్యలతోడ నేమంబులూని మహామునీంద్రు లొక్కదండనుండి భగవత్సమర్పణంబుగా ననేక యజ్ఞకర్మంబు లాచరించుచున్నవారు. మహా సంపద్యుక్తులైఁ బుణ్య పురుషులనేకులఁ గల్ప వృక్షంబుల చందంబున నొక్క చెంతనుండి బ్రాహ్మణ సముదయంబుల నిరతాన్న దానంబులం దనుపుచున్నవారు. ఖేచరులు సకలాలంకారంబులూని సధూసహితులై రత్నమణి స్థగిత విమానంబులనుండి యత్యంత వైభవంబున నొక్కదారి విహరించుచున్నవారు. హస్తంబుల దండాది సాధనంబులు వెలుంగ నాభి కమలంబులం గూర్చుండి దక్ష కశ్యపాదులు భయి పార్శ్వంబులం జెలంగ వాణీ సహితుండై చతుర్ముఖుండు సృష్టి కార్యంబు నడుపుచున్నవాఁడు. శంఖ చక్ర గదాద్యాయుధంబులు హస్తంబుల ధరియించి నంద సునందాది నిజపార్శ్వచర బృందంబులు బలసి కొలువ వక్షంబునుండి లక్ష్మీ సమేతుండై మహావిష్ణుండు జగత్పాలనం బొనర్చుచున్నవాఁడు. డమరు శూల పాశాదులుఁ గరంబులం జెలంగ రుద్రుఁడు శివాసహితుండై ప్రమథగణంబులఁ గొలువ ముఖంబుల నుండి యనేక ప్రాణి సముదయంబుల శిక్షింపుచున్నవాఁడు పశుపక్షి మృగకీటకాది స్థూల సూక్ష్మజంతువర్గంబు లక్కడక్కడ వనంబుల సంచరించుచున్నవి సకల సాగర నదీ సముదయంబులఁ గటి సూత్ర స్ఫటిక మాలికల భంగి భాసిల్లుచున్నవి. దేవా! యిట్టి భవద్విరాడ్విగ్రహంబు నందు నేను మహా గజేంద్రంబు పాదంబునే నొక్క రోమ కూప భాగంబునం దణంగి యున్న హీన మశకంబు వలె

నివసించి భవత్ప్రసాదిత దివ్యదృష్టి మాహాత్మ్యంబునం గొంత కొంత చూచుచున్నదాన; నట్లగుటం జేసి సర్వంబుఁ దెలిపి వర్ణింప శక్యంబుఁ గాదు, గావున నంతకంతకు నాశ్చర్యభయంబులు మనంబునం బొడము చున్నవి. దయానిధీ! యీ మహారూపం బుజ్జగించి, దొల్లింటి పగిది సాధు శరీరంబునఁ బ్రసన్నుండ వగుమని ప్రార్థించిన నద్దేవుం డట్లసేసి రత్న పీఠంబున నుండి దన సమ్ముఖంబున ముకుళిత నేత్రయై బర వశంబు నొందియున్న యమ్మగువం దేర్చి మృదువచనంబుల నిట్లనియె. బ్రహ్మాదులకైన నెఱుంగరాని మద్విశ్వ రూపంబు దర్శించి ధన్యత్వంబు నొందితి వింక నొక్క విశేషంబు వివరించెద. భక్తి యోగంబునం జేసిఁ బ్రాకృత జనంబులకు నిఖిల కల్యాణంబు లొసంగం దలంచి యీ లోకంబునన్ బ్రసిద్ధంబగు నలంపురంబను పట్టణంబున బాలబ్రహ్మేశ్వ రుండను నామంబు వహియించి వెలసిన సదాశివుండ. నీవు నన్ను వరియించుటకై దక్ష ప్రసూతుల కుదయించి సతియను నామధేయంబు దాల్చిన మహాప్రకృతివి. గావున నిన్ను బ్రపంచ క్రమంబున నేను వివాహంబుఁ జేసికొనియెద ననవుఁడు నమ్ముద్దియ లజ్జావనతవదనయై మనంబున హర్షంబుఁ దొంగలింప దిగ్గన లేచి కరపద్మంబులు ముకుళించి యిట్లని వినుతించె. 127

సీ. శ్రీధరార్చితపాద జీవనోద్భవ ధరాధర
రాజ కోదండ వర గుణాఢ్య!
భువన రక్షణ దక్ష భోగిరాడ్భూషణ
విబుధ లోక స్తుత్య వేదవేద్య!
యదురాజ కోటీర యురు కల్పకోదార
ఘనవార్ధి తూణీర కలుషహరణ!
గౌరీ మనోనాథ ఘన నీలకంధర
నిరుపమాలంకార నిత్యశుభద

యమల చారిత్ర సోమ సూర్యాగ్ని నయన!
వారు గోరాట్తురంగ దుష్టారి భంగ!!

కాంత కరభృత్కురంగ దయాంతరంగ!
రమ్యమౌనీంద్ర సంగ గోత్రా శతాంగ!! 128

తే. గీ. భవ్య సాత్త్విక మౌని హృత్పంకజములఁ
జారు భృంగంబు తెఱఁగున సంచరించు
దేవ దేవుఁడవగు నీకుఁ ద్రిగుణ కలిత
నైన నేనెట్లు దగుఁ దాన ననఘ చరిత 129

వ. ఇట్లు గొనియాడిన సంతసించి యత్తొయ్యలి హస్తంబుఁ దన కరంబున నవలంబించి శీఘ్రంబున నిఖిల కల్యాణయుక్తంబగు మత్పునర్దర్శనం బయ్యెడు నని దీవించి భక్తియోగంబున నన్నేమఱక నెమ్మది నుండుమని చెప్పి యద్దేవుం డంతర్ధానంబు నొందె; నంత నా సతీదేవి మనంబున నమ్మహామూర్తిని ధ్యానంబు సేయుచుండి, యొక్కింత. దడవునకు మేల్కాంచి. 130

ఉ. ఎన్నఁడు గాన నిట్టి కల నేమని చెప్పఁగ నోర్తు లోకముం
దెన్నఁగ నద్భుతం బిది మహేశుని విశ్వశరీర మాత్మలో
గన్నుల పండువౌ నటులఁ గాంచితిఁ బూర్వ భవంబునందు నే
నన్నగఁ జేయు సత్తపమఁ బండెనటంచుఁ జెలంగుచున్నెడన్. 131

చ. ఘుమ ఘుమ తావులెల్లెడలఁ గుప్పుచు గంధవహుండు ద్రైకొనన్
సుమ శరుఁ డగ్గలంబుగ సశోక ముఖాంబుదరాశి మీట నే
ర్పమర శశాంకుఁడాత్మ కిరణావళిపైఁ బ్రసరింపఁ జేయు నా
రమణి మనోఽబ్జతాపమునఁ గ్రాగుచు వారలఁ గూర్చి యిట్లనున్. 132

## సతీదేవి మేల్కాంచి చంద్ర మన్మథ సమీరణుల దూషించుట

చ. విమల చరిత్రుఁడై తనరు విష్ణుని మానసమందుఁ బుట్టి యు
త్తమ విబుధాళి నెప్పు డమృతంబునఁ బెంపుచు నున్నవాఁడవై
సుమహిత వృత్తిఁ బోవిడిచి సొంపగుఁ గీర్తి నశింపఁ బాంథులన్
విమతుఁడు బోలె నే చెదవు షేమఁట నీ కిది. బాడియే శశీ! 1·3

సీ. తోడఁ బుట్టిన దాని వేడుకైన గృహంబు
గాసి సేసిన మేటి ఘాతకుఁడవు!
గరుణ యించుక లేకఁ గన్నతండ్రి మనంబుఁ
గల్క నొందించెడి కల్మషుఁడవు!
భువనపూజ్యుండైనఁ బురహరు శిరముపై
మొనసిఁ గూర్చుండిన ముష్కరుఁడవు!
కంధి గర్భము నందు ఘన విషానలముతోఁ
గూడి జన్మించిన కుత్సితుఁడవు!
గాన నీ కెట్లుఁ గలుగు మేలైన గుణముఁ
బాంథ జన హింస పనిఁగాగ బ్రతుకు విన్నఁ
జూడ దోషంబుఁ గలుగుఁబో సుమతులకును
రట్టడికిఁ బుట్టవైతివిరా శశాంక! 134

తే. గీ. కల్ల గాదిది చంద్ర నీవెల్ల పాంథ
గణము నలయింపఁ దత్పాతకంబు నీదు
గాత్రమునఁ బొందె నల్లని కరుడు కరణి
నటులఁ గాకున్న నీకు నైల్యంబుఁ గలదె? 135

క. విరహుల నేచక ననిశము
ధరఁ బుణ్యులఁ బ్రస్తుతింపఁ దద్దయు నీతి
స్ఫురణమున సంచరింపుముఁ
దిరముగ బొందెదవు యశముఁ దెలియుము చంద్రా! 136

చ. విరహుల నేచు పుత్రకుఁడు వీడని శ్రీహరి నిర్దయాత్ముఁడై
బురహరు కంటిమంటఁబడి బొక్కినవిన్ బ్రతికింపకున్న సు
స్థిర మతియై రతీరమణిఁ జేసిన యా సుకృతంబు పెంపునన్
బరగ జనించి పాంథులను బాధలఁ బెట్టెద వేర మన్మథా! 137

మ. శరము ల్పువ్వులుఁ గార్ముకంబుఁ జెఱుకున్ శాతాళి పంఘంబు వి
స్ఫుర దంచ న్మృదు పల్లవంబులుఁ గదా బొల్పొంద నిర్మించి నీ
కరుదారన్ భగవంతుఁడిచ్చెనటు గాకా సాధనంబుల్ తగన్
గర మొక్కైకొననఁ జెండవే విరహులన్ క్రౌర్యంబునిన్ దర్పకా! 138

ఉ. అగ్గలమైన తామసము నాత్మఁ జెలంగగ నీవు వారనే
యొగ్గులు లేకఁ బాంధులను నేచెదు భర్గుని నేత్ర వహ్నిచే
బొగ్గుగఁ గాలి నీ వకట బోటరినంచుఁ గడంగెదేమనన్
సిగ్గొక యింత లేక యిటుఁ జేయఁగఁ జిత్తజ నీకు నర్హమే? 139

తే. గీ. మామతోఁ గూడి విరహుల మాటికిట్లు
బాధ నొందించుటిది నీకుఁ బాడి యగునె?
బుధులు వర్తించు మార్గంబుఁ బొంది విమల
యశముఁ గను మింక లోకమునం దసమ బాణ! 140

క. సిరికిన్ గొమరుఁడవై కర
మరుదుగఁ గమలాసనునకు ననుజుఁడవై నీ
వరయక మగువల నిటు పటు
శరముల నొంపంగఁ గీర్తి సమయదె మారా! 141

చ. అహహా! యిదేమి వింత, సకలాత్ముఁడ వంచు జగంబులెన్న యా
విహితము మాని హీనమగు వృత్తికి లోనయిఁ బాంధకోటిపైఁ
దుహిన కరాబ్జ సాయకులఁ దోడుగఁ జేకొని దూరెదౌర! ని
న్నహులకు మేతఁజేసెఁ బరమాత్ముఁడుఁ జాలదె శిక్ష మారుతా! 142

క. అని చంద్ర మన్మథా నిలు
లను దూఱుచు నుండ నంత లలిఁ బూర్వ దిగం
గన నాసికమునఁ దాల్చిన
సునిశిత రత్నమన వేగుచుక్కఁ జెలంగెన్. 143

## ప్రభాతకాల వర్ణనము

సీ. అరవిందముల నొంప నమృత దీధితి యశం
బడగె నాఁ జంద్రిక యుడిగి పోవ
రతులఁ జొక్కిన సతీపతుల నవ్వెననంగ
నల్లన దీపికల్ వెల్లఁగాఁగ
దనువుల విరహాగ్నిఁ దగ్గెనో యన యుర
స్థల రత్నహారముల్ చల్లఁగాఁగ
బాంధుల హింసించుఁ బాపంబుచే వ్రాలె
నన మన్మథుఁడు నిద్ర నట్టెఁ దూఁగ

రావు పేయుచు నిద్దుర లేపు మాగ
ద వికరంబన జనణాయుధముఁ గూయ
మహిని బ్రాణులఁ బొందిన మాంద్యమెల్ల
నల్ల నల్లనఁ దొలఁగెనాఁ డెల్లవాతె. 144

క. దినకరుఁడు బొడము వేళ
య్యేను నిద్దుర లేచి మీర లెలమి గృహములన్
జనులార! బనులఁ దీర్పం
డను కరణి విహగ రవము లత్తఱిఁ జెలఁగెన్. 145

క. ఉడుగవ వచ్చెను సూర్యుం
డడుగోనని యా ప్రభాతమను నెచ్చెలి దా
నడుగులకు విడిన మడుగనఁ
గడువడిఁ దూర్పునను ధవళకాంతిఁ దనర్చెన్. 146

తే. గీ. శశధరునిఁ బొంది యలయు బుష్కర లతాంగి
గాత్రమునఁ బుట్టు ఘర్మాంబు కణము లెల్ల
వాలుగ స్పర్శనంబున నడఁగె నన
దోడ నక్షత్ర సముదయ ద్యుతులు మలఁగె. 147

తే. గీ. అపరవారాశిఁ గ్రిడింప నాళఁ బొడమిఁ
బటురయంబున నాకాశపథము నందు
నంచితంబుగఁ జను రాజహంసమనఁగ
నరిగె నప్పుడుఁ జరమాద్రి కమృతకరుఁడు 148

వ. అంత. 149

సూర్యోదయ వర్ణనము

సీ. తలలు వంచి విజేతుఁ దలఁపులోనఁ దలంచుఁ
బద్మినీ నమితి తపః ఫలంబో!
యామినీ రుజ నొంది యలయు గోకములకుఁ
బోషకంబైన దివ్యౌషధంబో!
మహిత నిద్రాజ్ఞాన మగ్న జంతువులకు
ఘువతరార్థ జ్ఞానకారణంబో!
ఘనతపోయుక్తి నస్థలితేంద్రియులునైన
సాంఖ్యులఁ బ్రాపించు సౌఖ్యపదమ్మొ!

మూఁడు పనులకుఁ గర్తలై మొనయు మూఁడు
విగ్రహంబుల కిరవైన విగ్రహంబొ!
యని జనంబులఁ గొనియాడ నరుణ రుచులఁ
బ్రీతి నుదయాద్రిపై భాను బింబ మలరె. 150

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు నత్తఱి సకల జనులర్హ కృత్యంబులు నిర్వర్తింపుచుండి రా సతీదేవి, భగవంతుండును, సర్వాత్మకుండు నగు సదాశివుఁ జిత్తంబున నిల్పి తల్లిదండ్రుల మనంబు లుల్లసిల్ల సంతసం బున గృహంబున నుండె నని చెప్పిన విని శౌనకాది మహామును లానం దంబు నొంది నిఖిల పురాణాఖ్యాన నిపుణుండగు సూతుఁ జూచి బరమహర్ష సమేతులై యిట్లనిరి, 151

క. ఏ నయవాక్య స్ఫురణను
వీనులు సఫలత్వ మొందె వేడ్కఁ దలిర్పం
గా నవ్వలి వృత్తాంతము
నానతి యీ వలయు మాకు నసఘ చరిత్రా! 152

వ. అని యడుగుటయు. 153

అశ్వాసాంతము

॥సుగంధి వృత్తము॥

శ్రీరమా మనోజ్ఞ భృంగ సేవకౌఘ కల్పకా!
వారిజాక్ష భక్తలోక వందితాంఘ్రి పంకజా!!
ఘోర రాక్షసాంతకా! సుఘోష గోపపాలకా!
నీరదాభగాత్ర సర్వ నిర్జర ప్రపూజితా!!

॥కవిరాజ విరాజితము॥

నిరుపమ గాన వినోద జగన్నుత నృత్యకళానిధి కృష్ణ హరీ!
సురవర వందిత సుందర విగ్రహ శోభన వేష కృపా జలధీ!
కురుపతి గర్వ విభంజన యాదవ కుంజర గోపక రంజన మం
ధర ధర పాండుసుతావన భండన దారుణరూప సురారి హరా!!

మాలిని॥

విమల శుభ చరిత్రా! విశ్రుత స్తోత్ర పాత్రా!!
సుమహిత కమలాప్తా! సూరి చేతోబ్జ మిత్రా!!
హిమకర రవినేత్రా! హీరహార ప్రదీప్తా!!
సమర విమత జైత్రా! సమ్యగానందగాత్రా!!

గద్య

ఇది శ్రీ పరమేశ్వర గురుకటాక్ష లబ్ధ కవితాచమత్కార నందవర వంశో ద్భవ కుత్సస గోత్ర పవిత్ర బొడ్డిచర్ల జ్వాలయామాత్య పుత్ర రంగయామాత్య పాలిత కుమారార్య సేవాధురంధర సరస పాండిత్య సుకవిజన విధేయ చన్నకృష్ణ నామధేయ ప్రణీతంబైన సతీ బాలబ్రహ్మేశ్వర పరిణయంబను మహాప్రబంధంబు నందు దక్షప్రజాపతికిఁ బ్రసూతియందు సతీదేవి జన్మించుటయు, బాలక్రీడా వినో దంబులును, సతీదేవి యౌవన ప్రారంభ వర్ణనంబును, వసంతాగమంబును, దధతి వర్ణంబును, సతీదేవి చెలికత్తెలం గూడి వనవిహారంబునకుం జనుటయు, వనవిహార వర్ణనంబును, జలక్రీడాది వర్ణనంబును, సతీదేవి సకియలం గూడి వనంబున నుండి గృహంబునకు వచ్చుటయు, సూర్యాస్తమయ వర్ణనంబును, దమిస్రాది వర్ణనం బును, జంద్రోదయం బగుటయు, దచ్చంద్రికాది వర్ణనంబును, సతీదేవికి స్వప్న మందు శివుండు సాక్షాత్కరించి దివ్యజ్ఞానం బుపదేశించి నిన్ను వివాహంబుఁ జేసి కొనియెదనని చెప్పి చనుటయు, మన్మథ చంద్ర సమీర దూషణంబును, ప్రభాత వర్ణనంబును, సూర్యోదయ వర్ణనంబును, సతీదేవి సదాశివుని మనంబున ధ్యానంబు సేయుచు గృహంబున నుండుటయు, నను కథలుం గల సర్గము ప్రథమా శ్వాసము.

# సతీ బాలబ్రహ్మేశ్వర పరిణయము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరాధాహృదయప్రియ
సారస దళ నేత్ర నిగమ సన్నుత రాజత్
భూరి గుణ భూషణోన్నత
సూరి జన స్తోత్ర పాత్ర శోభనగాత్రా! 1

తే. గీ. అవధరింపుము! శౌనకాద్యఖిల మునుల
నాదరంబునఁ జూచి యిట్లనియె సూతుఁ
డచ్యుత ధ్యాన పరవశుం డగుచు మేఘ
నినద గంభీర వాక్కుల మనము లలర. 2

చ. మునివరులార! మీరుఁ గడు మోదమునన్ రచియించుఁ బ్రశ్నమున్
మనుకొని సర్వలోకముల ముఖ్యమునై తనరారుఁగాన నే
మ్మనమున వాసుదేవు నిటు మానక నిల్పి నుతించి చెప్పెదన్
వినుఁడు దగన్ సదాశివు పవిత్ర వివాహ కథాప్రపంచమున్. 3

వ. అని పలికి. 4

### సూతుండు భగవంతుని ధ్యానంబు సేసి కథఁ జెప్ప నారంభించుట

క. అలి జగదుత్పత్తి స్థితి
విలయము లెద్దేవునందు వెలయుచు నుండున్
సలలితముగ నద్దేవుని
నలవడ భజియింతు నఘము లడగెడు కొఱకున్. 5

క. లోకంబుల నేతేజముఁ
బ్రాకటముగ నిండి తెలియఁబడక వెలుఁగు న
స్తోకంబగు నా తేజము
నేకంబగు భక్తి నాశ్రయించెద నెపుడున్. 6

క. రవి చంద్ర వహ్ని నక్ష
త్ర వితానము లేవని వలన రహిచెలుఁ గొందున్
ప్రవిమలమగు మానసమున
సవినయముగ నతని గూర్చి సన్నుతిఁ జేతున్. 7

క. ఘనులగు యోగీంద్రులఁ దమ
మనముల నెవ్వని జపించి మహితంబగు శో
భన కైవల్యము నందెద
రనయము నా ప్రభుఁ జపింతు హర్షము తోడన్. 8

క. రూపంబు లేక బహుతర
రూపంబుల నొంది విశ్వరూపక ఘనుచున్
దీపించు వస్తు వెయ్యది
దాపగు నా వస్తువును సదా మది నెంతున్. 9

తే. గీ. ఆదిమధ్యాంత రహితమై యఖిలకార్య
కారణంబుల కాదిమ కారణంబు
నగుచు నెయ్యది వెలుఁగు నేర్పమర దాని
నవి శమఁ దలంతు నమృతంబుఁ గనుట కొఱకు 10

వ. ఇట్లు సర్వేశ్వరుండును, సర్వగురుండును, సర్వాతీతుండు నగు పరమా త్మునిఁ దన మనంబున నుతియించి తదేక నిష్ఠాగరిష్ఠుం డగుచుఁ జెప్పం దొడంగె; నిట్లు సూర్యోదయం బగుటయు నా సతీలలామ ముఖప్రక్షాళన స్నానాది కృత్యంబులు నిర్వర్తించి దివ్యసౌధాంతరంబున మణిమయం బగు పీఠంబున నియమంబున నాసీనయై సర్వాత్ముండగు సదాశివు మనంబున ధ్యానంబు సేయుచున్నయెడ నచ్చటికి సఖీజనంబు లరుగు దెంచి యద్దేవి యుండు లక్షణం బాలోకించి విస్మయం బంది పురో భాగంబునం గూర్చుండి యిట్లనిరి. 11

ఉ. అమ్మ! సతీలలామ! వినవమ్మ! యిదేమి విచిత్ర మమ్మ! చి
త్తమ్మున నెవ్వరిం దలఁచి దాలిమిఁ బూని జపించెదమ్మ! ని
శ్చయమ్ముగ నీ యభీష్టము సుఖమ్ముగ మా కెఱిఁగింపు మమ్మ! నీ
యమ్మలికమ్ముఁ దీరు తెఱఁ గొప్పగఁ జేయుదుమమ్మ మానినీ! 12

ఉ. ఎప్పటితీరునన్ చెలుల నేటికి నాదరణంబు సేయ పీ
చొప్పున నుంటఁ జూడఁ గడుఁ జోద్యము మా కిఁకఁ దేటపర్చు మో
యొప్పుల కుప్ప యంచడుగ నొయ్యన వారలఁ గాంచి సంతసం
బుప్పతిలంగఁ బల్కె సునయోక్తుల లే నగవంకురింపగన్. 13

## సతీదేవి తన స్వప్న వృత్తాంతంబుఁ జెలికత్తియలకుం జెప్పి విరహంబు నొందుట

ఉ. సారసనేత్రలారఁ! గడు సంభ్రమ మొప్ప వినుండుఁ దెల్పెదన్
శ్రీ రమణీయమూర్తి సురసేవ్యుఁడు శంకరుఁ డాదిమూర్తి వి
స్తార దయాపరుం డగుచుఁ జయ్యన నా కలలోన వచ్చి క
ర్పూరముఁ జిందు చందమునఁ బూరిత సుస్మితుఁడై జెలంగుచున్. 14

మ. విమలజ్ఞాన మనుగ్రహించి గరిమన్ విశ్వస్వరూపంబు నా
కమరన్ చూపి యనంతరంబ ధరయం దార్యాను మోదంబునన్
క్రమ మొప్పన్ నినుఁ బెండ్లియాడెద సుమీ కంజాయతాక్షీ! యటం
చు మనోజ్ఞంబుగ నానతిచ్చి చనె నీ చోద్యంబుఁ జింతింపరే! 15

వ. అని పలికి యచ్చెలికత్తియలం గలయ గనుంగొని యంత కంతకు
మనంబున నతిశయించు విరహంబున మరియు నిట్లనియె. 16

క. క్షితిరూప చమత్కారో
న్నత తత్త్వజ్ఞాన ఘృణుల నరనుతుఁ డతఁడున్.
రతిపతి గీష్పతి భాషా
పతి గంగాపతులఁ గెలుచుఁ బరవశ మొప్పన్, 17

తే. గీ. పుడమి నట్టివానిఁ బొడఁగన దుర్లభం
బహహా! నిఖిల శుభగుణాన్వితుండు
మగువలార! నాకు సుఖపురాదిక నేమి
సేతు నతఁడు నాకుఁ జెదు టెంట్లు? 18

ఉ. ఎప్పుడు నమ్మహాపురుషు నింపుగఁ గన్నులఁ గాంతునొక్కొ! న
న్నెప్పుడు సద్దయాపరుఁడు నిమ్మహిలో వరియించు నొక్కొ నే
నెప్పుడు నా ఘనుండగు మహేశునిఁ గౌగిలినందు నొక్కొ నే
ర్పొప్ప మనంబులన్ మిగుల యోచనఁజేసిఁ గృపన్వచింపరే! 19

క. అని యిట్లుఁ జింత నొందుచుఁ
గనుగవ నమితముగ బాష్పకణములుఁ దొరుఁగన్
విను మనుచు నొక్క చెలికే
లను నయముగఁ బట్టి సవినయంబుగఁ బలికెన్. 20

ఉ. ఎక్కడ నున్నవాఁడనుచు నేర్పడ నేఁగనుఁగొందు వాని బల్
చక్కదనంబు నిట్టి దని సాధ్యముఁగాదు వచింపఁజెల్ల నా
మక్కువఁదీర నిచ్చటికి మాన్యత నా విభుఁడేఁగదమ్మ యో
యక్కరో! బాలఁజాల విరహాంబుధి నే కరణిం దరింతునే! 21

తే. గీ. స్వప్నమందు శివుఁడు సాక్షాత్కరించి, నా
మనముఁ జెలఁగఁబలికెఁ జనియె ననిన
జనులు నమ్మ రెట్లు సకియరో వివరింపఁ
దగని కార్యమయ్యెఁ దాళు టెట్లు? 22

ఉ. ఏమని చెప్పుకొందుఁ బ్రజకే పగిదిన్నిజ మాచరింతు, ను
ద్దామ మనోజ బాధ కెటుఁ దాళుదు నెమ్మనమారఁ బల్కి యా
ప్రేమఁ దొలంగి యీ గతిఁ దపింపఁగఁజేసెను నా మనోహరున్
వేమరు నే మనందు నికఁ బ్రేముడి వేగ గణింపు నెచ్చెలీ! 23

చ. అతివరో! సైపఁజాల విరహంబు మహేశునిఁ దోడి తెచ్చి నా
వెతఁ దొలఁగంగఁ జేయు మిదె వేడుకతో వెలలేని హారముల్
పతకము లిత్తు నీకు దయఁ బాటిల నిప్పునిఁ జక్కఁబెట్టి యా
తత మగుఁ గీర్తి నొంది సుకృతంబున వర్ధిలు మమ్మ యిమ్మహిన్. 24

చ. చెలియఁ! బరోపకారములఁ జేసినవారికి రెంట సౌఖ్యముల్
కలవనిఁ బ్రాజ్ఞులెన్నఁగఁ దగన్వినుచుందుముఁ గాదె యిమ్మహిన్
చులుకన సేయకింకఁ గడు సొంపుగ నా ఘనుఁగూర్చి వేగ న
న్నలవడ బ్రోవుమమ్మ సునయమ్మ మనమ్మునఁ బూని సత్కృపన్. 25

వ. అని చెప్పిఁ జెలికత్తియల నందఱ నవలోకించి హృదయంబున సతీశ
ధ్యాంబు విరహంబునం జలింపుచు నిట్లనియె. 26

చ. చెలి యనుప్రేమ మీ మదిన సిద్ధముగాఁ గలదేని నన్నికన్
చలనము లేని సౌఖ్యముల సాంద్రనుఁ జేసెదరేని మద్విభున్
కలయఁగఁదెచ్చి యిత్తురివిఁ గావుఁడుఁ గాచితిరేని మిమ్ము, స
ద్విలసిత భోగ భాగ్యములఁ దేల్చుఁ బరాత్పరుఁ డాదరంబునన్. 27

చ. అఱకును సంశయంబు మది నాయకమ్మైఁ దనరారెఁగాని ని
న్నెలమి వరింతు నే ననిన నెచ్చట నెప్పుఁ డదెట్లటంచు నేఁ
బలుకఁగ నేరనైతిఁ గన భవ్యుఁడు శంకరుఁ డాదిదేవుఁడున్
దలఁకనఁజేసి నన్నికనుఁ జూచునొ చూడఁడొ నిర్దయాత్ముఁడై. 28

క. కల యది మిథ్య యటంచని
వలదు సుమీ దలఁప నార్యవందితుఁడతఁడున్
వెలయ నుపదేశ మిచ్చిన
విలసద్బోధ మిదె హృదయవీథిఁ జెలఁగెడిన్. 29

చ. సరసులలోన నుత్తముఁడు సజ్జనులన్ బ్రథముండు మౌనులన్
పరముఁడు దేవతా తతుల భవ్యుఁడుఁ బూరుష వర్గమందు న
ద్వరదుఁడు రూపవంతులనుఁ బ్రాకట మౌళి విభుండు శంకరుం
డరయఁగ నన్ను బోటి యబల లాధమ కెట్లు ఘటించు నక్కటా! 30

తే. గీ. అహరహంబుఁ బ్రీతి నతి భక్తిఁ గొనియాడిఁ
జిత్తమెల్లఁ దన్నుఁ జేర్చి కొలుచుఁ
బరమమౌని తతుల భావంబులనుఁ బట్టు
పడనివాఁడు నాకుఁ బట్టుపడునె? 31

తే. గీ. విభుని నిటుజేక మీర లెవ్విధముతైన
శాంతు లొనరించినను మదిఁజిక్కు పడదు
బ్రదికి యుండిన సుఖములఁ బడయవచ్చు
ననుట వినలేదె యోచింపఁ దతివలార! 32

చ. సదయతఁ బద్మినీ చయముఁ జాలఁగ బ్రోవఁడె పద్మ మిత్రుఁడున్
వదలక మీరలట్లుగ నవశ్యము నన్నిటు బ్రోవకున్న మీ
రదయులుగాక నే వగిది వారసి చూచినఁ గార్యసంగతిన్
సదయు లటంచు మిమ్మునికఁ బయ్యన నామది నమ్మ నెట్లగున్. 33

చ. విధి ప్రతికూలతన్ తనర వేయు కరంబులఁ గల్గువాఁడు నం
బుధిఁ బడలేదె నాకు నిటు ఘూరి సఖీచయ మెంతఁ గల్గినన్
ప్రథితముగా శివున్ గలయఁ బ్రాప్తము నాకిక లేకయున్న నా
వధకు ననంగుఁడేచు నన్ఁ బాలన సేయఁగ నెవ్వరియ్యెడన్. 34

ఉ. ఎన్ని వ్రతంబులన్ సలిపె నేమొకొఁ బూర్వ శరీరమందు సం
పన్నత నే తపంబుఁ గడు భక్తి నొనర్చెనొ లేడిపిల్ల స
త్పన్నుతుఁడైన యా హరునిఁ జారుకరంబునఁ జేరియుండి త
న్మన్ననఁగాంచె దానిఁ బలుమారునుతింపఁ దరంబె యేరికిన్. 35

ఉ. కాంతల జన్మమేల? వృథఁగాదే! స్వతంత్రము లేని దాని నా
కాంతవుఁ గమ్మటంచు గుణకాండ మహత్త్వము లెల్లఁజూపి యే
కాంతమునందుఁ గోరి యిటు గాసిలఁ జెండగఁ జేసిపోయినన్
కాంతున కేమిటన్ కొఱతఁ గల్గదుఁ గాంతకుఁగావె దుఃఖముల్. 36

ఉ. చల్లని చందనంబు ఘనసార జలంబులతోడ దేహమం
దెల్లెడఁ బూసి మల్లె విరులింపుగఁ జల్లుచుఁ జామరంబులన్
మెల్లన వీవ నా మదిని మేకొనె ఘూరి వియోగ వేదనల్
చల్లరె కాచియుండుఁడికఁ జయ్యన జీవము నిల్వధిత్తఱిన్. 37

వ. అని పలికిఁ దన ముందర సదాశివ సన్నిధానంబుఁ గల్పించుకొని యిట్లనియె. 38

చ. అతివకు నాసవెట్టి యది వ్యర్థముఁ జేసిన దోస మింక విన్
వితత దరిద్రతన్ దనిపి విప్పము నెత్తగఁ జేసి ఘోరమై
యతులితమైన హాలహల మానఁగఁ జేసి జగంబులందు నం
తత మొకచోటునం దనక సర్వగతుండుగఁ జేయకుండునే! 39

వ. అని యిట్లాక్రోశంబునన్ బలికి యనంతరంబ విజ్ఞానంబునం జేసి యక్కటా! మహాత్ముం డగు సదాశివుపయిన్ కినుకన్ దూఱితి నింక నా కెద్ది సంప్రాప్తంబగునో యని చింతించి యపరాధం బొనర్చితినని గరాం బుజంబులు ముకుళించి యో దైవశిఖామణీ! నీపై మోహంబునన్ జేసి హృదయంబునన్ బొడము విరహాయాసంబునన్ శాశఁజాలక బలికితిం గాని యొండు విధంబు గాదు. క్షమింప వలయునని యిట్లనియె. 40

క. హర! శంకర! పరమేశ్వర!
సురనాయక! దేవదేవ! సుజ్ఞాన నిధీ!
పరమాత్మ ప్రాణనాయక!
మురహర నుత! వేదవేద్య! మునిజన వంద్యా! 41

సతీదేవి విరహంబున మూర్ఛ నొందుట

వ. అని యిట్లు వినయంబునన్ గొనియాడి యమ్మహామహుని దివ్య సౌంద ర్యంబు మనంబున నూహించుచున్న సమయంబున. 42

చ. విలు నవలీల నొంచి యళిపిండుల నారి యమర్చి మల్లికా
జలజ ముఖాస్త్రముల్ మిగుల సత్వరతన్ గదియించి మారు డ
జ్ఞల జదళాక్షి వక్షమున జల్లున వర్షముఁబోలె నేసినన్
చలనము నొంది బెగ్గడిలిఁ జారు ధృతిన్ విడనాడి యత్తఱిన్. 43

వ. ఇట్లు దురంతంబులగుఁ జెఱుకు విలుకాని నెఱిఁదమ్మి గోరకలఁ జార జార నురంబుఁ గాడిన నమ్మెఱుంగు బోడి భరింపఁ దరమ్ముఁ గాకఁ గరమ్ము నులికిఁ గరువలి తాకునం గదలు మృదుల కదళిక చందంబున నవ యవంబు లదర వడ వడ వడంకుచు మచ్చిక మీఱ నెచ్చెలుల మొగంబు లచ్చెరుగఁ గనుంగొనిఁ బరమేశ్వరుం డగు సదాశివమూర్తియం దంత రంతకు మోహంబగ్గలంబయ్యె; నింక ననంగ పరితాపంబునం జేసి దేహం బునఁ బ్రాణంబులు నిలుపంజాలనని బ్రమాగన్నుపైచుచు నంత రంగంబునన్ బోడము విరహ సముద్రం బతిశయించి యుండ నిమ్మఁ జాలక వెలికిం బొంగెనో యన గనుదమ్ములం జారు కన్నీలధారా నిము దయంబులఁ జెక్కుటద్దంబులం బ్రవహించి గళంబునం జాతి సన్నంపు కంచుకంబు మాటనం దులకించుఁ గుచ కలశంబులపై వెల్లివిరియ నాసా పుటం బల విట్టూర్పు లేసంగ నరిగంచు జలతారు పయ్యెదఁ జనుకట్టు పయిం దిగజాఱ వెన్ను విగుడ్చి బాహుద్వయం బెత్తి కరాంగుళంబు లొండొంటిం బెనచి తూగుచు, హా పరమేశ్వరా! హా మృత్యుంజయా! నీకైన యౌవన పరిపూరితంబగు నీ శరీరంబు దుర్వారంబగు మన్మథ బాణాగ్నిచే భవదర్పితంబుగా దహింపంబడుచున్నది. ప్రసన్న వదనుఁడ వై

గౌగిటం జేర్చి రతిక్రీడలం దనిపి జల్లని సంతోషవార్ధి నెన్నడు దేల్చెదవో యని విలపించి యా సతీదేవి మూర్ఛనొంది చేష్టలుఁ దక్కి రత్నపీఠంబునం బడియెనంత, హేమాంగియు, జంద్రవదనయు, గురంగాక్షియు, బద్మగంధియు, మంజువాణియు, జందనగంధియుఁ, గోకిలవాణియు, మధురవాణియు; గీరవాణియు, గజగమనయు, గుందరదనయు, నీలవేణియుఁ, బుష్పరాగయుఁ, జింతామణియుఁ, బూర్ణచంద్రికయు, శుభాంగియుఁ బల్లవపాణియుఁ, గంబుగంతియు, విద్యుద్భాసయు, శ్యామయు, కోమలయు నను నాఖ్యలుఁ గలఁ జెలికత్తియ లత్యంత భయంబునం గరంబులుఁ బిసికికొనుచు నింక నేమి సేయుదము; సతీలలామ శివుని కతంబునం గలిగిన విరహంబునం గ్రాగె; నింక దక్ష ప్రసూతులు వినిన నెంత పరితపింతురో, మీర లింతఁ జేసితిరని ఁ క్షం డాగ్రహించి మనల నేమి శపించునో యని కొందల మందుచుండి రంతఁ గొంత వడికి వారలలోఁ గీరవాణి యనునదిఁ దన మనంబున యోచించి యందరం జూచి వినుండని యిట్లనియె. 44

క. ఓ యమ్మలార! వినుఁడిదె
బాయని దుఃఖమున మనముఁ బడియుండినచో
నీ యువతిఁ దేర్చ నెవరికఁ
జేయుద మొక యోచనము విశేష మనీషన్. 45

తే. గీ. సదతి దేహమందుఁ బ్రాణంబు బుండినఁ
దడయ కేనుఁ గార్య తంత్ర మెల్ల
నిర్వహింపనేర్తు నిక్కువంబుగ మీరు
సుదతి మొదలుఁ బట్టి చూడుఁ డనిన. 46

ఉ. అంతట నా చెలుల్గదిసి యా సతిదేహము నంటి చూచి స
త్కాంతి దొలంగ కుండుటయు దారుణమై తనరారు యూర్పులం
తంతకు మించుచుండుటయు నప్పుడుఁ గన్గొని పంచ బాణ దు
ర్దాంత మహాగ్ని తాపమున దద్దయు మూర్ఛిలె నంచుఁ జెప్పగన్. 47

వ. అంత నక్కీరవాణి వారలం గనుంగొని మీర లింకఁ జింతింప వలవదు, దైవయోగంబునం జేసి సతీదేవి మూర్ఛదేఱి సుఖంబున నుండంగల

దొక్క విశేషంబుఁ జెప్పెద వినుండు. కామరూపధరత్వంబును, సఖ
స్సంచార క్రమంబును, సంచరించు నెడల మహాత్ములకుం దక్క నితరు
లకుం గానరాకుండుటయు నే దేవతలనైనఁ గనుంగొను శక్తియు నివి
మొదలగు విద్యావిశేషంబులు మహా తపోధనుండగు మా తండ్రి యను
గ్రహంబునం బడసితి. నీ వృత్తాంత మింతకు మున్నెవరితోఁ జెప్పి
యెఱుంగ; నిప్పుఁ డతి విచారంబుఁ బొడముటం జేసి మీకుం జెప్పితి. మీ
యానతిం జని యమ్మహాను భావుండగు సదాశివుం డెప్పటనుండినంగాంచి
వినయంబున నే తద్వృత్తాంతం బ.తయుం దెలిపి, శీఘ్రంబునం దోడి
తెచ్చెద ననవ్పుడు నమృతోపమానంబులగు నప్పలుకుల కానందించి సఖీ
మణు లందరు నక్కీరవాణిం గౌగిలించిఁ గన్నుల నానంద బాష్పంబులుఁ
దొలుఁగ నిట్లనిరి. 48

ఉ. ఇన్ని దినంబులున్మనము నెంతయు నొద్దిక మీర నీ సతిన్
బన్నుగ గొల్చి సన్నిధినిఁ బాటల నాటలఁ దేలు చుండియున్
చెన్నుగ నీ మహత్త్వ మిటుఁ జెప్పనదాక నెఱుంగమైతి మో
సన్నుతకీర్తి మమ్మికఁ బ్రసన్నతఁ బ్రోవుము సార్వకాలమున్. 49

చ. తొలుపగ విజ్ఞరాదులకుఁ బొందన సాధ్యములైన విద్యలన్
వలనుగ నే క్రియన్గనె భవజ్జనకుం డతఁడెట్లు నీకు ని
శ్చలత ననుగ్రహించె నదిఁ జయ్యన మాకెఱుకంగఁ జెప్పి నీ
వలవడఁబోయి శంకరుని నాసతి యొద్దకుఁ దెమ్ము చెచ్చెఱన్. 50

చ. అనవుడు నా సఖీమణుల నందరఁ గన్గొనిఁ గీరవాణిఁ బల్
వినయముఁ దోప నిల్చి పృథివీస్థలి నెవ్వరితోడఁ జెప్ప వ
ద్దని యపుఁడానవెట్టి దరహాసము మోమున నంకురింప నే
మ్మనమునఁ దండ్రినిం దలచి మానుగ వారల తోడ నిట్లనెన్. 51

కీరవాణిఁ దానభ్యసించిన విద్యల తెఱంగు సఖులకుం
జెప్పుట

సీ. సఖులార! వినుఁడు సుచంద్రుఁడన్మా తండ్రి
యీ విద్యలన్నుఁ బొంద నెలమిఁ గోరి
భువన సన్నుతుఁడైనఁ బుణ్యునారదు గూర్చి
మును తపం బొనరింప ముదితుఁడగుచు

నమ్మహాత్ముండుఁ గార్యముఁ జూచి వేంచేయ
మా తండ్రి భక్తి సమ్మదము లలర
నర్ఘ్యపాద్యాదుల నర్చించి యుచితా
సనంబు నునిచి యనంతరంబ

చరణ సేవ యొనర్చుచు సాధువచన
రచన లిగురొత్తఁ గొనియాడ సుచరితుండు
నైన యమ్మౌని మెచ్చుచు నపుడొసంగె
విబుధులకు నైనఁ దెలియని విద్యలెల్ల. 52

వ. ఇట్లుపదేశించి, దన్మంత్ర తంత్రానుష్ఠాన క్రమం బంతయుం దెలిపి భావి కార్యంబుఁ జింతించి సుచంద్రా! నీవు మహా తపోధనుండవు, సత్య వ్రతుండవు, బుధ జనసమ్మతుండవు, మహాధర్మపరుండ వగుట వలన నీ యందలి విశ్వాసంబునం జేసి దివ్యజ్ఞానంబున నెఱింగి నీవు మనంబునం గోరిన విద్యలు మొదలుగా దివిజులకుం బడయ నసాధ్యంబులైనవిఁ బెక్కు లెఱింగించితి. సంతుష్టుండ వగు మింక భవద్గృహిణి యగుఁ బ్రేమావతి యందు నీకు సుగుణ నిధియైనఁ గీరవాణి యనుఁ గూతురుద్భవించి యక్కన్యక సతీ పరమేశ్వర వివాహార్థంబైన రాయబారం బొనర్పంగలదు గావున దానికి సాధనంబులుగా నీ విద్య లుపదేశింపుమని యానతిచ్చి పునః పూజితుండై యమ్మహాత్ముండగు నారదుం డంతర్ధానంబు సేసె; నంతఁ గొన్ని మాసంబులకు నేను జన్మించి నం జూచి సంతసించి నన్ను గారాబునం బెంచి మజ్జనకుండుఁ బూర్వవృత్తాంతం బంతయు నెఱింగించి యమ్మహాత్ముఁ డానతిచ్చిన తెఱంగున మంత్ర తంత్ర పూర్వకంబుగా నీ విద్యలు నా కుపదేశించె. నీ పరమ రహస్యం బిప్పుడు మీకుం జెప్పితి నింకఁ దడవు సేయుటఁ గర్తవ్యంబుఁ గాదు మీర లిందుండి సతీదేవి నుపచారంబులం దేర్చుచుండుం డేను సదాశివు పాలికిం బోయి వచ్చెదనని వారలకు దండ ప్రణామంబు లాచరించి యాశీర్వాదంబులఁ గైకొని యక్కీరవాణి వారలుం జూచుచుండ గగన మార్గంబునం జనియె నంత నిక్కడః 53

సీ. ఘనసార సలిలముల్గల కలశంబులను బట్టి
దనువుగా నొడలెల్లఁ దడుపు వారు
గమ్మ తావులఁ గ్రుమ్మ కమలంబు లొగిఁ దెచ్చి
యొప్పుగా మైనిండఁ గప్పువారు
నాణిముత్తెపు పేరు లధికంబుగాఁ దెచ్చి
యొనరంగ నురముపై నుంచువారు
బన్నీటి పదనుచేఁ జెన్నారు కరములఁ
గడుఁ దిన్నగాఁ గనుల్ దుడుచువారు

జికిలి మగరాల తళుకులఁ జెలువు మిగిలి
విప్పఁ గలిగిన సురటుల విసరువారు
నగుచు శైత్యోపచారంబు లధిక భక్తి
నా సతీదేవి కొనరించి రపుడుఁ జెలులు. 54

వ. అప్పుడు. 55

సీ. చల్లిన ఘనసార జలముఁ జిట్టునఁ బొంగిఁ
గనుఁగొనఁ బొడలేక వింకిపోయెఁ
బైనిండఁ గప్పినఁ బద్మ సంతతులెల్లఁ
గడువడిఁ దుక తుక నుడికి పోయె
ఘనముగా నురమందు నునిచిన ముత్తెంపు
చేరులఁ గడుఁ గ్రాగి జిటిలిపోయె
గన్నుదమ్ముల బూయఁ బన్నీటి పదనెల్ల
వస్త్రకూదకంబుల నడఁగిపోయె

సురటులనుఁ బుట్టుఁ గాడ్పులు సొంపు దఱఁగి
జెలఁగు విట్టూర్పు గాడ్పుల సమసిపోయె
నపుడుఁ గనుఁగొని యా మన్మథాగ్ని యొప్పు
వెలవుఁ దెలియక నేచ్చెలుల్ వెఱగుఁజెంది. 56

వ. ఇట్లు భయంబునం జింతింపుచుండ నందుఁ జంద్రవదన యిట్లనియె. 57

క. దక్షున కెఱిఁగింతము మన
మీ క్షణమే వేగబోయి యాంత యవస్థా

లక్షణములు లేకున్నను
లక్షణవతులార! కార్యలలితమ్ము దప్పున్. 58

వ. హేమాంగి యిట్లనియె. 59

క. చని వినయోక్తుల నింతయు
జననికి జనకునకు దెలియ సతి సంగతి జె
ప్పిన మేలగు మన మిటు జె
ప్పని యెడలన్ మనకు మాటపాటిలు సుమ్మీ! 60

వ. వెండియు బద్మగంధి యిట్లనియె. 61

చ. అది యవుగాని యైన మన మందర మీయెడ నీ సతీమణిన్
సదమల వృక్షవాటికకు జయ్యన వే కొని పోయి యచ్చటన్
పదిలముగాగ నుంచినను బయ్యెదపై బ్రసరింప మేల్కనున్
మదవతులార! యీ క్రమము మంచి దటంచు దలంతు నెంతయున్. 62

వ. ఇట్లు చెప్పిలి కత్తియ లొండొరులు దమ తమ యోచనల కొలంది గొంత దడవు దలపోసి యీ సతీదేవి యంతఃపురంబునం దరింపరాని విరహ వేదనం బడి మూర్ఛనొంది యింతకుం దేరకుండె. నీ సతీమణి కార్య భారంబు వహించి యక్కరవాణి సదాశివు దోడితెత్తునని యతి వేగంబునం జనియె. ఎన్ని భంగులం దైవ యోగంబునం దోడి తెచ్చుట దథ్యం బగు, నైనను మధ్యాహ్న సమయం బగుచున్న యది; మనము శీఘ్రంబునం బోయి దక్ష ప్రసూతుల కీ వృత్తాంతం బెఱింగింపకున్న భావ్యంబుగాదని, యంద ఱొక్క నిశ్చయంబు జేసి, కొందఱమ్ముద్దియం గాచి యుండిరి, కొందఱతి వేగంబునం జని యచ్చట. 63

ఉ. సురుచిర రత్నపీఠమున సొంపు దలిర్పగ నుండి సన్మునుల్
గురుతర శాస్త్రవాదముల కుంఠిత వృత్తి నొనర్ప నిర్జరుల్
చిరతర భక్తి సన్నుతులు సేయ సురాంతకు నాత్మ నుంచి వి
స్ఫుర దరుణాంశుడో యన్నగ శోభిలు దక్షుని గాంచి రచ్చెలుల్. 64

వ. ఇట్లు గాంచి సవినయంబున హస్తకమలంబులు ముకుళించి యిట్లనిరి. 65

### చెలికత్తియలు సతీదేవి వృత్తాంతంబు దక్షున కెఱింగించుట

ఉ. భూరి జనాగ్రగణ్య! విను, పోయిన రాత్రి భవత్కుమారికిన్
ధీరత స్వప్నమందుఁ జనుదెంచి సదాశివుఁ డాత్మవిద్య వి
స్తారతఁ దెల్పి విన్న శుభ సమ్మతి నే వరియింతు నంచు ని
ర్ధారణ మొప్పఁ జెప్పెనటఁ దద్దయుఁ గల్గె నిత్తఱిన్. 66

ఉ. నిద్దురలోన శంకరుని సేర్పుగఁ జూచి సతీలలామ దాఁ
బ్రొద్దుటి నుండి నెవ్వగలఁ బొందుచు మమ్ముఁ జేరఁ జీరి యా
సుద్దులఁ జెప్పి చెప్పఁ గడు చోద్యముగా విరహార్తిఁ దూలుచున్
తద్దయు మూర్ఛనొందె మది దైన్యము మీర దయాపయోనిధీ! 67

క. ఎన్ని యుపచారములఁ దగు
నన్నియు మేమొనరఁ జేయ నవిఁ బలు విరహో
త్పన్నతకుఁ జాల వయ్యెను
బన్నుగ యోచింపుఁ డికఁ బ్రపన్న శరణ్యా! 68

చ. అనవుఁడు దక్షుఁ డత్తఱి మహాత్ముఁడుఁ గావునఁ గార్యమంతయున్
మనమునఁ గాంచి సన్మనులు మాన్యత వెన్కొని రాగ శిష్యులన్
వినయముతో భజింపఁ గడువేగఁ బ్రసూతి ముఖాంగనామణుల్
ఘనమగుఁ జింతతో వెడలఁగాఁ జనుదెంచెఁ గుమారిఁ జూడఁగన్. 69

వ. ఇట్లనేక జన పరివృతుండై దక్షుం డతి వేగంబునం గూతురిం జూడ నంతఃపుర దివ్య సౌధాంతరంబునకుం జని యచ్చట. 70

### మూర్ఛ నొందియున్న సతీదేవిని దక్షుండు జూచి చింతించుట

సీ. కనుఁ దమ్ముల జారు కజ్జలంబుల తోడ
పీడి జారిన నెఱివేణి తోడఁ
జాలఁ గందిన మల్లెపూల దండల తోడఁ
జెదరిన గంధంపు చర్చ తోడఁ

విడువకఁ బ్రసరించు వేదియూర్పుల తోడఁ
బనడించు నధర బింబంబు తోడ
భువనండుఁ జేర్చిన భవ్యచిత్తము తోడ
నతిశయంబగు విరహంబు తోడ

రత్నపీఠంబుపైఁ జాల రహిఁ జనర్పఁ
బాన్పుపై మేనుఁ జేర్చి యభంగయోగ
మొనరఁ బఠించు నొక మహాయోగకరణిఁ
గథల దుండిన నా సతీకాంతఁ గనియె. 71

వ. ఇట్లుఁ గనుంగొని దక్షుం డాశ్చర్య భయ శోకంబులు మనంబునం బొడమ నతి విహ్వలుండై దన వెంట నేతెంచిన మునుల నుచితాసనంబుల నుండ నియమించి దానునుం గూర్చుండి యంతకు మున్న దుఃఖంబునం బొరలు ప్రసూతి మొదలగు కాంతల నుపశమన వాక్యంబుల నాదరించి యప్పుడు — 72

తే. గీ. ఆ సతీమణి యొదలి చిహ్నములుఁ గాంచి
దక్షుఁ డప్పుడు మూర్ఛఁగాఁ దన మనమునఁ
దలఁచి యందరఁ గనుఁగొని ధైర్య మలరఁ
బలికె నటుమిది కార్యంబు పట్టెఱింగి. 73

దక్షుండుఁ దనకుఁ బూర్వంబునఁ బితామహుం డానతిచ్చిన
వాక్యంబు సభవారికిం జెప్పుట

సీ. ఎవ్వండ భేద్యులై యేపారుఁ ద్రిపురరాక్ష
స కోటులను వాఁడి సంహరించె
నెవ్వండు జగముల నేర్చి మిన్నుండెడిఁ
గాలకూటముఁ బట్టి కడిగ్రమింగె
నెవ్వండు జము చేత నేపునఁ జెడకుండఁ
జేసి మార్కండేయు స్థిరుగ నిల్పె
నెవ్వండు మెచ్చి యక్షేశు దిగీశుఁగా
నొనరించి నవనిధు లొప్ప నిచ్చె

నట్టి సర్వేశుఁ డధిక దయా సముద్రుఁ
డైన ధూర్జటి నీకల్లుఁడగు నటంచుఁ
దొల్లి పరమేష్ఠిఁ బలికె నాతోడఁ దెలియ
నమ్మహాత్ముని వరముఁ దథ్యంబుఁగాదె! 74

వ. అని యమ్మహాత్ములందరు వినంబలికి దక్షుం డఖిలజ్ఞుండుఁ గావున భవిష్యత్కార్యక్రమంబంతయు మనంబున నెఱుంగుటం జేసిఁ జింతింపక స్వాంతసంబున నఖిలలోకారాధ్యుండగుఁ బరమేశ్వరునిఁ దన మనంబున నారాధించి విమీలితనేత్రుండై మహాత్మా! మాయానిబద్ధంబగుఁ బ్రపంచం బింద్రియ సంచార మగ్నం బై విషయసుఖంబు లనుభవింపుచు

దక్షుండు సదాశివుని మనంబున నుతించి తదనుగ్రహంబున
సతీదేవిని మూర్ఛ వలనం బాపుట

వ. కర్మ భేదంబుల ననేక జంతు యోనిద్వారంబుల జన్మింపుచు నెంత కాలంబున కైన నొండు మార్గంబు గలదని చింతింపక నగాధంబగు నూతంబడి యున్నఁ గప్ప చందంబున దారాది సుహృత్తరు పరివృతంబగు సంసార గహనంబునం దిరుగుచు మాయాతీతుండ వగు నిన్నుం దెలియం జాలదు. కురూప దేశంబునం బవిత్రులగుఁ బుణ్యపురుషులు విషయాసక్తంబై సకలేంద్రియానుగతంబగు మనం బనియెడుఁ బశువునుం దాలిమి యను యూపంబునం గట్టి వైరాగ్య ఖడ్గంబున విశసించి జ్ఞానానలంబున వ్రేల్చి సంకల్ప వికల్ప శూన్యులై నిరంతరానందంబున నిన్నె కాని యొండెఱుంగక యుండుదురుఁ గావున బ్రహ్మాదులకైన దుర్లభుండ వట్టి పురాణ పురుషుండవైన నీవు నా కూతురగు సతీదేవిన్ పత్నిగాఁ గోరుట నా భాగ్యంబు గాదే! శుభం బయ్యెడు వింక నిబ్బాలన్దేర్చి, మమ్మందఱ రక్షింపు మనిఁ బ్రార్థించి వికసిత నయనుండైఁ గలశంబున నున్న యమ్మంత్రోదకమ్ముల ముద్దియ పయిం జల్లి నేత్రంబులుఁ దుడువ, నప్పుడా సతీదేవి మూర్ఛవాపి యల్లన నయనారవిందంబులు విచ్చి యందఱం గనుంగొని లజ్జావనత వదనయై మనంబున వందనం బాచరించె నంత, 75

క. బృందారకు లపరిమితా
నందంబున నిర్భరతాన లర్చించి భోగిన్

కందళిత హృదయులై మును
లందఱు దక్షుని నుతించి రంచిత భక్తిన్. 76

క. అత్తఱిఁ బ్రసూతి మొదలగు
సుత్తమ కాంతాజనంబు లురుతర గుణ సం
పత్తి గజయానఁ దోడ్కొని
చిత్తము లలరంగ జనిరిఁ జెలు లరుదేరన్. 77

క. మునులతి వినయమ్మున ద
క్షుని తోడనఁ గదలి యధిక శోభనయుతమై
యనుపమ మగు వాహ్నిగృహ
మునకుం జని యచటఁ జిత్తములు విగురొత్తన్. 78

వ. అప్పు డందఱు చితాసనాసీనులై సంధ్యావందనానుష్ఠాన వైశ్వదేవాది కృత్యంబు లనుష్ఠించి, రంతట మున్న సతీదేవిం జలకం బార్చి దివ్యాంబరాభరణ కుంకుమ గంధమాల్యాది శోభితఁజేసి, నెచ్చెలులుం దోడి తెచ్చిన నమ్ముద్దియ తోడ నందఱు సంతసంబున వివిధ రసోపేతంబు లగు నన్నంబులఁ గుడిచి తాంబూలంబు లందుకొని, రనంతరంబ దక్షుం డనేక మునిజన పరివృతుండై సభామంటపంబున నుచిత ప్రసంగంబును నుండె నంతఁ దల్లి యగుఁ బ్రసూతి యను మతంబునం జెలికత్తియ లంతఃపురంబున కా సతీదేవిం దోడ్కొని పోయి యొప్పటి రత్న పీఠంబునన్ బ్రసూనశయ్య నునిచిఁ దాము సమీపంబునం గద్దియలన్ కూర్చుండి హస్తంబుల బంగరు వీణ లమర్చి రత్న కంకణంబులు మొఱయ మధురగానంబు సేయుచున్న యెడ నమ్మగువ సంతసింపుచుఁ గీరవాణి యెందుబోయె ననవుఁడు వారలు వినయంబున హస్తంబులు ముకుళించి యిట్లనిరి. 79

సీ. విరహవేదనతోడ వివశత్వ మొందిన
విను (జూచి మనమునఁ గనికరమున
దంజిల్లు నీ మనోరథము ఫలింపంగ
దేవదేవుని శివుఁ దెత్తుననుచు

సీ॥ యుపచారముల్ నెమ్మితోఁ జేయంగ
 నొగా మమ్మిట మనిచిఁ దాను
దన తండ్రిచే మున్నుఁ దా నభ్యసించిన
 విద్యాబలంబున వేగఁ గదలి

రత్న భూషణములు మేన రహి వెలుంగ
మమ్ము వీడ్కొని యధిక సమ్మదము మెఱయ
మానితంబైన యన్న భో మార్గమందుఁ
జారు తరముగ నేగె నక్కీరవాణి! 80

ఉ. ఎన్నిఁదెఱంగులన్ శివున కింపుగ నీ చరితంబు లెల్లఁ దాఁ
బన్నుగ విన్నవించి సులభంబుగ నమ్మహితాత్ము దివ్య సం
పన్నతఁదోడి తెచ్చు నిక వందన సేయకఁ గీరవాణియో
సున్నతగాత్రి యూరడుముఁ జయ్యనఁగూడెదు నీ మనోహరున్ 81

చ. అనుఁడు సతీలలామ హృదయంబున సంతసమందిఁ జెల్లరే!
మన మిలఁ గీరవాణి మహిమంబులుఁ గంటిమె యెన్నడైనఁ దా
ననయముఁ గూడియుండియు రహస్యముగా నయినన్ వచింపదీ
పనికిపుఁడేగెనే నను శుభంబుల దేల్ప దయా సమేతయై 82

చ. అటఁజని కీరవాణి వినయంబున శంకరుఁజేరి మత్క్రియం
బెటువలెఁదెల్పునో విభుఁడు నింపొదవన్ వినునో గలంగి సం
ఘటనముఁగాదు పొమ్మనుచుఁ గాంత షనంబును నొవ్వఁబల్కునో
దటుకున విశ్వయింపఁగ స్వతంత్రులమౌదుమె యెల్ల భంగులన్ 83

వ. అని చింతించుచున్న సమయంబున 84

తే. గీ. శివునిఁ దెచ్చెదననిఁ గీరవాణిఁ బోయి
యాడఁ దడవుండె నేనేగిఁ దోడితెత్తు
ననుచుఁ జనియెదుఁగంచుకుండనగ నపుడు
నల్లనల్లనఁ జరమాద్రి కరిగె నినుఁడు 85

వ. అంత 86

తే. గీ. భవ్య రసయుక్తమైన భూపద్మమందు
వాపరించినఁ జంచరీకాళి యనఁగ
నెందుఁజూచిన నిబిడమై యేపు మెఱపి
గటిక చీకటి నిండె జగంబు నందు 87

వ. తదనంతరంబ 88

తే. గీ. పరగ నాకాశమను నీలపటమునందు
రమ్యముగఁ గూర్చినట్టి వజ్రములనంగ
గరము సఖుల కానందకరము లగుచు
నవిరళంబుగఁ దారక లతిశయిల్లె 89

తే. గీ. ఆ సతీదేవి నెమ్మనం బలర శివుఁడుఁ
బనుప వడినేగుదెంచిన భటుఁడనంగ
దివ్యకాంతుల దిక్కులఁ దేజరిల్ల
నొప్పు గుల్కుచుఁ జందురుం డుదితుఁడయ్యె 90

వ. ఇట్లుఁ జంద్రోదయం బగుటయు నారాత్రి సతీదేవి తల్లి యగుఁ బ్రసూతిఁ బుత్తెంచిన భక్ష్యభోజ్యాది పదార్థంబులుఁ జెలికత్తియలుం దానును భుజించిఁ దనకిరుఁ గెలంకులఁ బరిమళంబులు వెదజల్లుచుఁ గర్పూరపు దివ్వియ లుల్ల సిల్ల నెచ్చెలులు గద్దియలం గూర్చుండి వీణలు మ్రోయింపుచు సదాశివ కథాగానంబు సేయుచుండ నక్కీరవాణి రాక కెదురు చూచుచుండెనని చెప్పిన విని శౌనకాది మహామును లాశ్చర్యానందంబులు మనంబులం జెలంగఁ బరమహర్ష సమేతుండైన సూతు నవలోకించి యిట్లనిరి 91

చ. అభవునిఁ దెత్తునం చతి రయంబున నేగినఁ గీరవాణి య
వ్విభు కడ కేగతింజని వివేకము మీఱఁగ విన్నవించె నో
త్రిభువన చిత్ర మిత్తెఱఁగుఁ దేటపడన్ వివరింపుమన్న నా
సుభగుఁడు సూతుఁడిట్లనియె సొంపుగ నమ్ముని పుంగవాళితోన్ 92

వ. ఇట్లా రాత్రి సతీలలామ నిద్రా వివర్జితయై నెచ్చెలు లొనరించు మనో హరంబగు గానంబు నాకర్ణింపుచు సదాశివు పదారవిందంబు లంత రంగంబున నునిచి సఖీ శుభాగమనంబుఁగోరుచుండ నారాత్రి మూడవ యామంబు బతిక్రమించుటయు, నప్పుడు 93

## కీరవాణి సదాశివు సన్నిధి నుండి సతీదేవి దగ్గఱకు వచ్చుట

సీ. ఒప్పార విచ్చిన యుత్పలంబుల కంటెఁ
గరముఁ జెన్నగుఁ గన్నుఁగవ వెలుంగఁ
బూర్ణచంద్రుని కంటెఁ బొలుపారు ముఖమందు
నల్లనల్లన మందహాస మొదవ
నెఱిఁ గొప్పునందు బల్పేర్పుగాఁ జుట్టినఁ
బూదండ జారి మూపున నటింప
సన్నంపు వజ్రాల జనఁ గుల్కుఁ గమ్మల
ధగధగల్జెక్కుటద్దములఁ బొదల
రత్నహారాళి రుచు లంబరంబు నిండ
హస్తమున నిమ్మపండు నింపలరఁ బూని
మేఘమధ్యంబు వెలువడు మెఱుగు కరణి
దీరమై యప్పు డరుదెంచెఁ గీరవాణి! 94

వ. ఇట్లుత్తరాపథంబున నుండి ధరణీతలంబున కవతరించిన దివ్యాంగనయుం బోలె నఖండ తేజంబున వెలుంగుచుఁ గక్ష్యాంతరంబులుఁ గడచివచ్చు న క్కీరవాణి నట్టెఁ గనుంగొని సంభ్రమంబున నెచ్చెలులం గూడి సతీ లలామ దిగ్గున గద్దియ నుండి దిగ్గి ప్రత్యుత్థానంబు సేసి, గొబ్బునం బెద్దఁ దడవుఁ గౌఁగిటన్ చేర్చి, చెక్కిలి ముద్దుఁ గొని, యతి వినయంబునం దోడి తెచ్చిన, నమ్ముద్దియ సంతసంబున జగజ్జనని యగు సతీదేవి చరణార విందంబులకు వందనం బాచరించి యనంతరంబ సఖీమణుల కందఱకు నమస్కరించిన వారలా సుచంద్రాత్మజ నాలింగనంబు లొనరించి గద్దియల నుండి రంత, నా సతీదేవిఁ దన ముందట రత్నపీఠంబునఁ గీరవాణి నునిచిఁ దానునుం గూర్చుండి సంతోష యుక్తంబగు నచ్చెలి ముఖార విందంబుఁ గనిఁ దన నయనారవిందంబుల నానంద బాష్పంబులుఁ గ్రమ్మ దేర నేమియుం బలుకనేరక యున్న నా సతిం గనిఁ గీరవాణీ సఖీజను లానందింప మృదుమధుర వచనంబుల నిట్లనియె. 95

ఉ. మెచ్చెను శంకరుం డహహా! మేలగు నీ చరితంబుఁ జెప్పనా
కిచ్చె ననేక భూషణము లింపుగ మన్ననఁ జేసి యాత్మలో
హెచ్చిన వేడ్క తోడ వరియించెద నా సతి నంచుఁ జెప్పి పం
డిచ్చెను నీ కొసంగు మను చేర్పడఁ గన్గొను మో సతీమణీ! 96

ఉ. ఏమని విన్నవింతు విబుధేశ్వరుఁడైన సదాశివుండు నిన్
బ్రేమఁ దలంచి చిత్తమున వేమరు మోహముఁ బల్లవింప న
క్కోమలి నెన్నఁడందముగ గొబ్బునఁ గౌగిటఁ జేర్తునంచు బ
ల్కామ వికార మగ్నుఁడయి కంటికి నిద్దురఁగానఁ డక్కటో! 97

వ. కావున నమ్మహానుభావుండు నిన్ను బెండ్లియాడుట తథ్యంబగు నింక మనంబునఁ జింతింప వలవదు, నమ్ముమని యీ జంబీ ఫలంబుఁ జేతి కిచ్చిన నందుకొనిఁ బరమేశ్వరుం డగు సదాశివుని పొందు నా కొనర్పం జనుఁదెంచిన ఫలస్వరూపంబగు దూతిక యని యత్యాదరంబునం గన్నుల నద్దుకొని, యక్కునం జేర్చి ముద్దుఁగొని మహానందంబున శరీరంబు పులకింప నక్కీరవాణిం గౌగలించుకుని యో సఖీమణీ! విరహాగ్నిం బరితపించు చున్న నన్ను నీ కృపామృత సముద్రంబు వెల్లిఁగొల్పి బ్రతుకంజేసితివి. నీ మహామహిమంబులు వర్ణింప నాకుఁ దరం బగునే! నీ వృత్తాంతం బంతయు నెవ్వేలును వక్కాణింప నెఱింగితి, నొక్క ప్రశ్నంబు సేసెద; నిచ్చటినుండి నీ వతి వేగంబునం గదలి సదాశివు సన్నిధికిం బోవుటయు నమ్మహాత్మునకు నీకుం జరిగిన సంవాదంబును, నీతోడ నవ్విభుండుఁ జెప్పిఁ బుత్తెంచిన యమోఘ వాక్యంబులును సవిస్తరంబుగా వినంగోరెద ననవుఁడు నక్కీరవాణి యిట్లనియె. 98

కీరవాణి తాను సదాశివు పాలికింబోయి వచ్చిన వృత్తాంతంబు
సతీదేవికిం జెప్పుట

మ. శ్రీకరంబుగ విన్నవించెదఁ జెల్వగా వినవమ్మ నే
బ్రాకటంబుగఁ బోయి తెచ్చిన భవ్య శంకర వార్తలన్
పీకతంబున నమ్మహాత్ముని నేనుఁ గాంచి జగంబులన్
వ్యాకీఁ గంటిఁ బురాకృతంబగుఁ గర్మరాశిఁ దొలంగగన్, 99

సీ. కమలాక్షి! విను, భవత్కార్యంబు నెరవేర్పఁ
జెలు లొసంగిన యాజ్ఞఁదల ధరించి
ఘన తపోధనుఁడు మజ్జనకుం డొసంగిన
లలితమౌ విద్యా బలంబు వలనఁ
గొమరొప్ప సఖుల వీడ్కొని వార లలరంగ
విశదమౌ నక్షత్ర వీథియందు
వర విమానంబుల సరసత విహరించు
విబుధ బృందంబుల వేడ్కఁగనుచు
గరుడ గంధర్వ కిన్నర కాంత లధిక
సంతసంబున గానంబు సలుప వినుచు
శ్రీ సదాశివు నాత్మలోఁ జేర్చి యంద
మలరఁ గడు వేగ నే నపుఁ డరుగుచుండ. 100

సీ. జలపూరిత తటాకములు మంజులములైన
నిల్వుటద్దంబుల చెల్వుఁదోచె
ఫలభరితారామ భవ్య తరుశ్రేణిఁ
దోఁటఁ బెంచిన నారువలెనుఁ దోచె
గహనావృతోన్నత గ్రావసమూహముల్
వెన్నెల కుప్పల విధముఁదోచె
సదమల ద్యుతులచే జెల్గెడు నదులెల్ల
నాణిముత్తెపు చేరులట్లఁదోచె
పుర పరంపరలెల్లను బొమ్మరిండ్ల
కరణి నుదధులు మంజు మేఖలల పగిదిఁ
దోచె నప్పుడుఁ జుక్కల త్రోవనుండిఁ
బోవు చిలమీదఁ జూడంగఁ బువ్వు బోణి! 101

మ. ధరణీ చక్రముఁ జక్రవాళగిరి చేతన్ వేష్టితం బౌచు సుం
దరమై యొప్పెను రావియాకు గతి సాంద్రం బౌ మహారణ్య స
త్పుర పల్లీ నదులందనర్చి ఘనపాథోనాథ సప్తాన్వితో
త్కరమై భీషణ శబ్ద యుక్తమగుచుం దళ్కొందె యత్యున్నతిన్. 102

సీ. అమర గంధర్వ యక్షాదుల కిరవులై
గొమరొందు దివ్యలోకములఁ గనుచు
ఘనరత్న రుచుల భూ గగనముల్ వెలుగొంద
గములుగాఁ జను విమానములఁ గనుచు
మిన్నేటిఁ దమ్ముల మించుఁ దేనెలఁ గ్రోలి
మెఱయుచుఁ బోవు దుమ్మెదలఁ గనుచు
నూర్ధ్వరేతస్కులై యూర్పులు బంధించి
బొడవునఁ జనుచున్న మునులఁ గనుచు

సొగసుఁ దళుకొత్త నమ్మేరు నగముఁ జుట్టిఁ
దిరుగు చుండెడు గ్రహములఁ దివిరి కనుచు
భాసురంబగు నాకాశపథము నంను
నంతసింపుచుఁ జనుచున్న సనుయమునను. 108

గీ. అమితముగఁ జైత్రరథ నందనముల నుండు
పారిజాతాది తరుపుష్ప పరిమళములు
ఘుమ్ము ఘుమ్మన నా మీదఁ గ్రమ్ముకొనఁగ
సాగిపోవంగ నటుదైవ యోగమునను. 104

నభోమార్గంబునఁ గిరవాణికి నారదుం డెదురై
సంభాషించుట

మ. తనుకాంతుల్ దిశలందుఁ జంద్రికల చందం బొప్ప దారాళి బో
లిన శుద్ధ స్ఫటికంపు మాలిక లెసన్ లీలన్ వినోదింప స
ద్ధ్వన వీణారవముల్లసిల్లగ హరీన్ కంజాక్షు వర్ణింపుచున్
వినువీథిన్ చనుదెంచె నారదుఁడుఁ దా విజ్ఞాన మగ్నాత్ముఁడై. 106

క. వచ్చిన నారదుఁ గని నే
నచ్చెరుగఁ బ్రణమిల్ల నేమ్మహాత్ముఁడు మదిలో
నచ్చెరు వొందుచు నన్నుఁగని
మెచ్చుచు నిట్లనియె నవ్య మృదు వాక్స్ఫురణన్.

ఉ. ఎవ్వని పుత్త్రివమ్మ! గమలేక్షణ! దుష్కర మార్గమందు ని
న్నెవ్వఁడుఁ బంప నెచ్చటికి నేగెదవన్, బ్రమదంబు నా మది
నివ్వటిలంగ హస్తములు నేర్పలరన్ ముకుళించి భక్తితో
నవ్వన జాననాత్మజున కంతయుఁ జెప్పఁదలంచి యత్తఱిన్. 107

వ. ఇట్లంటి. 108

చ. పరమ తపోధనుం డఖిల భవ్యగుణోన్నతుఁ డార్య సమ్మతుం
డురుతర కీర్తిశాలి యన నొప్పు సుచంద్రుని, గూతురన్ దయా
పర! నను గీరవాణి యనిఁ బల్కుదు రందరు నీ సుదర్శనం
బరుదుగఁ గల్గె నా కిక మహాత్మక! సంఘటిలెన్ శుభోన్నతుం. 109

వ. అని పలికి మునీంద్రా! సర్వరక్షకుం డగు సదాశివుండు దక్షాత్మజ యగు
సతీదేవి స్వప్నంబున సాక్షాత్కరించి తత్త్వజ్ఞానం బనుగ్రహించి యనం
తరంబ మృదుమధుర వచన రచన బల్లపిల్లఁ బ్రపంచ క్రమంబున నిన్ను
వివాహం బయ్యెదనని చెప్పిపోవుటం జేసి యా సతీలలామ యమ్మహా
త్మున్ దలంచి దురంతంబగు విరహవేదనన్ గ్రాగుచు మూర్ఛిల్లిన నంత
దచ్చెలికత్తియల యనుజ్ఞ వడసి మహానుభావుం డగు సదాశివున కత్తె
ఱంగు వక్కాణించి తోడి తెచ్చెదనని పలికి మజ్జనకుం డొసంగిన విద్యా
బలంబు పెంపున నభో మార్గంబునం గదలి యతి వేగంబునన్ బోవు
చున్న దాన నప్పుడు నమ్మునిపుంగవుం డతి సంతసంబునం బొదలి
మొగంబున ముసిముసి నగవు లొలయ నమృతంబు వర్షించు చందంబున
నిట్లనియె. 110

కీరవాణికి నారదుండుఁ బూర్వవృత్తాంతంబుఁ
జెప్పుట

సీ. విను, కీరవాణి నే వినిపింతు నొకవార్తఁ
గొమరొప్ప మును బ్రహ్మ కొలువునందు
ననఘులౌ సురమును లాలోచన మొనర్పఁ
బరమేష్ఠి కవిరి సద్భక్తి మెఱయ

భూలోకమున నరుల్ పుణ్యం బెరుంగక
మరు భవాంబుధి బడియున్నవారుఁ
గావున వారు సద్గతిఁ జెందు విధమింక
జింతింప వలయు సుస్థితి వెలుంగ

ననుచుఁగడు సంతసమున నయ్యఖిల సురల
మునులఁ గనుఁగొని మీరలు వినుఁడటంచుఁ
దన మనంబున నొక కొంతఁ దడవుఁ జూచి
పలికె నయ్యెడఁ గరుణ నప్పద్మ భవుఁడు! 111

క. బాలేందుధరుఁడఁ దడయక దె
భూలోకమునందు జనులఁ బోషింపటకై
బాలబ్రహ్మేశ్వరుఁడన
లాలితముగ వెలయ గలఁ డలంపురి యందున్ 112

క. లోకస్వరూపిణియు బుధ
లోకోన్నత చరితఁ బ్రకృతి లోక జనని యీ
లోకంబులలర సతి యనఁ
బ్రకటముగ దక్షునకుఁ గృపన్ జనియించున్ 113

వ. ఇట్లా ప్రకృతిపురుషులు సతీ బాలబ్రహ్మేస్వరులై ప్రపంచ క్రమంబున భార్యాభర్తృ భావంబు నొంది, భక్తియోగంబునంజేసి, సకల జనంబు లొనర్చు పూజనంబులఁ గైకొనుచు వారల సకల పాపబంధంబులకుం దొలగించి సకలైశ్వర్యంబు లొసంగిఁ బరిపాలించిఁ గృతార్థులంజేయునని యానతిచ్చిన విని సంతసించి యన్నలువకు నమస్కరించి యనుజ్ఞఁగొని యా దేవముని ప్రభృతులు నిజస్థానంబులకుం జనిరి; గావున నమ్మహాత్మువి వచన క్రమంబున నయ్యాది కారణులగుఁ బ్రకృతిపురుష లిట్లు విలసిల్లి, రయ్యలంపుర వివాహంబునకు నీవొనర్చు రాయబారంబు ముఖ్యసాధనంబగు; తొల్లిఁగార్యం బాలోచించి మీ తండ్రియగు సుచంద్రునకు నే నొసంగిన దివ్య విద్యావిశేషంబులు నేటికి నీ కతంబున ఫలియించె, నింకఁ దడయ వలవ దిప్పుడే నలంపురినున్న బాలబ్రహ్మేశ్వరు సన్నిధి నుండి వచ్చి

చున్నవాఁడ, నిదియె మార్గంబు, శీఘ్రంబునం జని రాత్రికాలంబున
నంతర్గృహంబున నుండు సదాశివు సాన్నిధ్యంబునకుం జని మృదుమధుర
వచన చమత్కారంబుల నా సతీదేవి వృత్తాంతంబంతయుఁ దగు సమ
యంబున విన్నవింపుమని యానతిచ్చి యనంతరంబఁ బుత్రికా భావంబున
నన్ను మిక్కిలి సమీపంబునకుం జేరి కటాక్షవీక్షణంబు లొలయ ముద్దు
పెట్టుకొని, సకల జంతు మనోభావంబును, సకలలోక వృత్తాంతంబును
యోచించు మాత్రంబునం దెలియునటుల వరంబు లొసంగి యమ్మహాను
భావుండగు నారదుం డంతరిక్షంబునం జనియె; నంత నే నవలం బోవుచున్న
సమయంబున 114

చ. ఇటుఁ జనుచుండగా నెదుట హేమమణి స్ఫురితాయత ప్రభో
త్కట సముదాయ రాజిత సదాశుభవాద్య విరాజమాన స
త్పటల కలా వివాదహిత పార్వణ చంద్ర సమానకాంతి మ
త్పటుతర సౌధవారయుత పట్టణ రత్నముఁ దోచె ముందటన్. 115

చ. అది గని నే నలంపురము నౌనని కాదని కొంతసేపు నె
మ్మదిఁ దలపోసి చూచి యనుమానతఁ దాల్చి యనంతరంబునన్
సదమల చంద్ర మండల కష ద్వృషకేతన రాజిఁ గాంచి యో
హిదె యని సంతసం బొదవ నెంచి రయంబునఁ బోవు చత్తఱిన్. 116

కీరవాణి తుంగభద్రా నదిం జూచుట

సీ. ఘుమ ఘుమ ధ్వని దిగంతములందు వ్యాపింప
ఘన తరంగములచేఁ గదలు దాని
సంఫుల్ల శతపత్ర చయరసోపేతమై
మించు తావుల గుబాళించుదాని
విమలంబులై యొప్పు వితతాంబుకణములఁ
గడుఁజల్లగా మిన్నుఁ దడుపు దానిఁ
దరళంబులైన ముత్యపురాసులను బోలు
నురుగు కుప్పల చేత మెఱయుదాని

మకర కూర్మాది జంతు సమాజములకు
నంచితంబుగ నుండ నిమ్మైన దాని
మిన్నయై దుంగ భద్రాఖ్యఁ గన్నదాని
నొక మహానదిఁ గనుగొంటి నుజ్జ్వలాంగి! 117

సీ. ముని లనుష్ఠానంబు లొనరింప విరవులై
జాలైన స్ఫటిక పాషాణ తతులు
సమరంగ నారోహణావరోహణములఁ
బనమించు రత్న సోపాన తతులఁ
దటములఁ గ్రమ్మి సంతతముఁ దేనియలొల్కు
విమల భాసుర కల్పవృక్ష తతులు
వైరంబుఁదక్కి జీవనముఁ గ్రోలెడి సింహ
శరభ గజవ్యాఘ్ర హరిణ తతులు

గలిగి లోకములందుఁ బ్రఖ్యాతిగాంచిఁ
జూచు మాత్రంబునన జగచ్ఛోక ముడుపు
మహిమ దనకొంద సజ్జనమాన్య యగుచుఁ
దనరు నన్నది మదికి సంతస మొనర్చె 118

సీ. రమ్యమౌ తరగల రహి దోలికాకేళిఁ
దేలుచుండు మరాళ జాలములను
వికసిత శతపత్ర మకరందములఁ గ్రోలిఁ
జెలఁగి మ్రోగెడు భృంగ సంఘములనుఁ
దరుల పొంతల నుండిఁ దమటోటులనుఁ గూడి
బారుగాఁ జను కోకవారములను
మెఱుపుతీగల మాడ్కి మెఱసి మింటికి మిట్టి
పడుచునుండెడు మీన పటలములను

నీట మునుగుచుఁ దేలుచు నెరయ ముదువుఁ
జెందుఁబలుకొంద కుక్కుట బృందములను
దూరమునఁ జూచి యరుదంది తోయ జాక్షి!
వాసి కెక్కిన యన్నదిఁ దాసి యపుడు 119

సీ. ఒక వంక నరయంగ నొగివధూ యుక్తులై
జలకేళిఁదేలు నిర్జరగణంబు
లొక చక్కఁగనుఁగొన్న సురరత్న తటముల
సంధ్యవార్చెడి విప్రసముదయంబు
లొక చాయఁ జూడంగ నొయ్యన నేత్రముల్
ముకుళించి జపియించు ముని చయంబు
లొక యోర వీక్షింప నుదకము ల్గల
కాలిచే ముంచు విప్రయోషిద్వ్రజంబు

లొక్కఁ యెడఁ గాంచ దీవుల నొప్పు మిగుల
మాటికాడెదు బాలికా మండలంబు
లగణితంబుగఁ గనుపట్టు నప్పుఁడేను
సొరిదిఁగనుఁ జెప్ప వేయకఁ జూచుచుంట 120

వ. మఱియును 121

సీ. తరళంబులైన మత్స్యములుఁ గన్నులుఁ గాఁగ
నవనీరజము లాననములుఁ గాఁగ
వరచక్రవాకంబు లురుకుచంబులుఁ గాఁగ
దిః కుబ్బునలలు బాహావులుఁ గాఁగ
నెఱయఁ జుట్టెడు సుడు ల్నిమ్న నాభులుఁ గాఁగఁ
గరమొప్పు దీవు లుత్కటులుఁ గాఁగ
నొఱపైన నురుగు లింపొసరు నవ్వులుఁ గాఁగ
చాయంచ గములు వస్త్రములుఁ గాఁగ

చారుశైవాలములు శిరోజములుఁ గాఁగఁ
దొరపై యొప్పు చుండు నా తుంగభద్ర
జెలఁగు సద్భామినీ సహస్రముల మాడ్కిఁ
గలర నా చూడ్కిఁ కానందమయ్యె నహహ! 122

### కీరవాణికి నభోమార్గంబున ధర్మవిదుండను నొక మహాపురుషుం డెదురుగా వచ్చుట

ఉ. ఆ సమయంబు నందొక మహాపురుషుం డకలంక వైభవో
ద్భాసితుఁడై మణి స్థగిత బంధుర దివ్య విమానమెక్కి బ
ద్మాసనుఁడో యనన్ కడు రయంబున నంబర వీథియందు బ
ల్వాసిఁ జెలంగఁ బోవుచు ద్రుతంబుగ నాకెదురై ప్రసన్నతన్. 123

ఉ. ఓ కమలాయతాక్షిఁ! గడు నొప్పుగ నెవ్వరుఁ దోడు లేక నీ
వాకస మార్గమందతి రయంబున నేగుచు నున్నఁ దాన వి
శ్లోక మనస్కురాలవయి యెచ్చటి కెవ్వరుఁ బంప నేగెదం
బా కమనీయమూర్తి యన నప్పుడు నేనతి సంతసంబునన్. 124

చ. విమల గుణాభిరామ! పృథివీ స్థలి నారద శిష్యుఁ డార్య స
త్తముఁడు సుచంద్రుఁ డన్మునికిఁ దద్దయుఁ గూరిమి కూతురన్ బుధో
త్తమ! ననుఁ గీరవాణి యని ధాత్రి జనుల్ గణియింప నొప్పుదున్
క్రమముగఁ గల్గునంతయు సుఖమ్ముగ మీరు వినుండుఁ దెల్పెదన్. 126

వ. అని పలికి యమ్మహాత్మునకు దండప్రణామంబు లాచరించి నీ వృత్తాంతం బంతయు సూత్రంబున కాణిముత్యంబులఁ గూర్చు తెఱంగున విన్నవించి యనంతరంబఁ గరకమలంబులు ముకుళించి యో ధన్యాత్మా! యిప్పరో భాగంబునం బ్రవహించు నదీలలామంబు నేత్రంబుల కానందం బొనర్చు చున్న యదిఁ గావున నీ నదీ మాహాత్మ్యం బంతయుఁ గ్రమంబుగ వినం గోరెద, నా సతీవలయు ననవుఁడు నమ్మహానుభావుం డిట్లనియె. ఇచ్చ టికిఁ బశ్చిమ దిగ్భాగంబునం దతి రమ్యంబై దేవ యక్ష కిన్నర గంధర్వ సిద్ధ చారణ సేవితంబై బహురత్న మణి సముదయ నిధానంబై బహు యోజనంబుల దూరంబునం దేజరిల్లు సహ్యపర్వతంబు నందనేక పుణ్య తీర్థంబు లుద్భవించి యనేక ముఖంబులన్ బ్రవహించి బహుదేశ భూములఁ బావనంబు సేయుచు రత్నాకరంబునం గలయుచుండు; నన్నదుల యందుఁ దుంగానది, భద్రానది యను రెండు నదులుఁ బ్రత్యేకంబుగాఁ బ్రవహించి, పిదప నా రెండు నదు లేకంబై తుంగభద్రయను పేరన్బరగి

ఖూ యలంపురంబునకుఁ బూర్వ దిగ్భాగంబుగా వచ్చి బాలబ్రహ్మేశ్వ రాలయ పూర్వ ద్వార ప్రాకారంబు నొరయుచు నుత్తరవాహినియై( గొంత దవ్వుఁ బ్రవహించి యచ్చటఁ బశ్చిమ దిగ్భాగంబు నుండి యేతెంచు చున్నఁ గృష్ణానదిం గలయు. బాలబ్రహ్మేశ్వరాలయంబునకు దక్షిణ దిగ్భాగంబు నందుఁ గ్రోశ మాత్ర దూరంబున నంతర్గంగా తీర్థంబనుఁ బుష్కరిణిఁ గలదు. తత్తీర్థంబునకుఁ బశ్చిమ తటంబున నంతర్గంగేశ్వరుం డుండుటం జేసి యా ఘట్టం బంతర్గంగేశ్వర ఘట్టం బనం బడు. తత్తీర్థం బాగ్నేయ కోణంబునం బ్రవహించి సమీపంబున నున్న తుంగభద్రా నదిం గలయు. ఏ క్రమంబున నీ తీర్థం బాదిగా బాలబ్రహ్మేశ్వరాలయ ద్వారంబున కుత్తర భాగంబునం గ్రోశ మాత్ర దూరంబున నుండు కలకల తీర్థం బంతంబుగా నరువది నాలుగు తీర్థంబు లీ నదీ ప్రవాహంబునం దంత ర్భూతంబులై యుండు; నవి యేవి యనిన

## కీరవాణికి ధర్మవిధుండుఁ దుంగభద్ర యందుండు తీర్థంబులఁ దెల్పుట

1. నంతర్గంగా తీర్థంబును, 2. పాపవినాశన తీర్థంబును, 3. ఛాయా మల్లికార్జున తీర్థంబును, 4. ప్రథమబ్రహ్మ తీర్థంబును, 5. వేదావతీ తీర్థంబును, 6. మోక్షేశ్వర తీర్థంబును, 7. స్వర్గద్వార తీర్థంబును, 8. బ్రహ్మ తీర్థంబును, 9. గణికా సిద్ధేశ్వర తీర్థంబును, 10. భుజంగేశ్వర తీర్థంబును, 11. రుద్రపాద తీర్థంబును, 12. బ్రహ్మనారాయణ తీర్థంబును, 13. జనార్దన తీర్థంబును, 14. నారదేశ్వర తీర్థంబును, 15. మలక్షయేశ్వర తీర్థంబును, 16. దక్షిణేశ్వర తీర్థంబును, 17. రామేశ్వర తీర్థంబును, 18. లక్ష్మణేశ్వర తీర్థంబును, 19. వారుణేశ్వర తీర్థంబును, 20. ప్రయోగమాధవ తీర్థంబును, 21. కర్ణేశ్వర తీర్థంబును, 22. సప్తకోటీశ్వర తీర్థంబును, 23. సిద్ధేశ్వర తీర్థంబును, 24. ఇంద్రేశ్వర తీర్థంబును, 25. కుక్కుటేశ్వర తీర్థంబును, 26. రాజరాజేశ్వర తీర్థంబును, 27. వాగీశ్వర తీర్థంబును, 28. నాగేశ్వర తీర్థంబును, 29. భోగేశ్వర తీర్థంబును, 30. వేదావతీసంగమ తీర్థంబును, 31. సోమేశ్వర తీర్థంబును, 32. నవబ్రహ్మేశ్వర తీర్థంబును, 33. పంచరామేశ్వర తీర్థంబును, 34. సోమ సిద్ధేశ్వర తీర్థంబును, 35. దేవద్రోణి తీర్థంబును, 36. అగ్నీశ్వర తీర్థంబును,

37. శుక్లేశ్వర తీర్థంబును, 38 త్రిజటేశ్వర తీర్థంబును, 39. జలలింగేశ్వర తీర్థంబును, 40. కపాలేశ్వర తీర్థంబును, 41. చండికేశ్వర తీర్థంబును, 42. సాక్షేశ్వర తీర్థంబును, 43. ఆదిదుర్గేశ్వర తీర్థంబును, 44. భగవతేశ్వర తీర్థంబును, 45. మయూరేశ్వర తీర్థంబును, 46. మాధవేశ్వర తీర్థంబును, 47. మణికర్ణికేశ్వర పుష్కరణి తీర్థంబును, 48. ఆదిసిద్ధేశ్వర తీర్థంబును, 49. దివ్యసిద్ధేశ్వర తీర్థంబును, 50. త్రిపురాంతకేశ్వర తీర్థంబును, 51. విశ్వేశ్వర తీర్థంబును, 52. కేదారేశ్వర తీర్థంబును, 53. కపిలేశ్వర తీర్థంబును, 54. సూర్య తీర్థంబును, 55. నక్షత్ర తీర్థంబును, 56. మల్లినాథ తీర్థంబును, 57. అగస్త్యే శ్వర తీర్థంబును, 58. దూర్వాన తీర్థంబును, 59. ఘటికాసిద్ధి తీర్థంబును, 60. బాణేశ్వర తీర్థంబును, 61. కామేశ్వర తీర్థంబును, 62. ఋణమోక్షేశ్వర తీర్థంబును, 63. భైరవ తీర్థంబును, 64. కలకల తీర్థంబును, నన నలువదినాలుగు తీర్థంబులయ్యె; నాయా తీర్థంబుల కెదుట నుండు దైవతంబుల కాయా తీర్థ నామంబులు గలుగుటంజేసి యాయా ఘట్టంబుల కాయా నామధేయంబులు నియామకంబులై యుండు. 126

క. ఖ్యాతిగ పై నదిలో ప్ర
ఖ్యాతములై వెలుగు చుండు గడు చిత్రముగా
నీ తీర్థంబుల మహిమము
లాతతముగ నెంచి చెప్ప నజునకుదరమే! 127

వ. మఱియు నొక్క విశేషంబు గల దాకర్ణింపుము. అత్తీర్థంబుల లోనం బదునెనిమిది తీర్థంబులు ముఖ్య తీర్థంబులని చెప్పంబడు; నవి యేవి యనిన 1. సంతర్గంగా తీర్థంబును, 2. దత్పూర్వ భాగంబున పాపనాశన తీర్థంబును, 3. దత్సమీపంబునం బ్రథమ బ్రహ్మ తీర్థంబును, 4. దదుప కంఠంబున ఛాయామల్లికార్జున తీర్థంబును, 5. దదుత్తర భాగంబున వేదా వతీ సంగమ తీర్థంబును, 6. దదుత్తర దిగ్భాగంబునన్ దశధనుః ప్రమాణ దూరంబున మోక్షేశ్వర తీర్థంబును, 7. దదుత్తర దిగ్భాగంబున భుజం గేశ్వర తీర్థంబును, 8. తదుత్తర దిగ్భాగంబున బ్రహ్మనారాయణ తీర్థం బును, 9. దత్పశ్చిమ భాగంబున మణికర్ణికాతీర్థ పుష్కరణియు,

10. దదుత్తర దిగ్భాగంబునం బ్రయాగమాధవ తీర్థంబును, 11. దదుత్తర భాగంబున దేవద్రోణి తీర్థంబును, 12. దదుత్తర భాగంబున నగ్నీశ్వర తీర్థంబును, 13. దదుత్తర దిగ్భాగంబునం దశధనుః ప్రమాణ దూరంబున శుక్లేశ్వర తీర్థంబును 14. దదుత్తర దిగ్భాగంబున నాగేశ్వర తీర్థంబును, 15. దదుత్తర దిగ్భాగంబున సోమసిద్ధేశ్వర తీర్థంబును, 16. దదుత్తర దిగ్భాగంబున నాదావతీ సంగమ తీర్థంబును, 17. దదీశాన్య దిగ్భాగంబునం గలకలేశ్వర తీర్థంబు నన నష్టాదశ తీర్థంబులయ్యె. దేవగంధర్వాదు లను దినంబుఁ బ్రదోషకాలంబున సకుటుంబులై సంతసంబునం జనుదెంచి, యీ నదీ తీర్థంబులఁ గృతస్నానులై యాయాతీర్థ తటంబుల నుండు దైవతం బుల కభిషేక పూజనంబులు సేసి, నారికేళ గుడాది పదార్థంబులు నైవేద్యంబు లొసంగి, యనంతరంబ బాలబ్రహ్మేశ్వరు సన్నిధానంబున కేగి, యమ్మహాను భావున కభిషేక పూజనంబులు సేసి, నైవేద్యంబు లొసంగి, సంగీత నృత్యాది వినోదంబులు సలిపి, యనుజ్ఞగొని, స్వస్థానంబుల కేగు చుండుదురు. భూలోకంబునం బుణ్యాత్ములగు వారలతి భక్తిం జనుదెంచి యొక్కొక్క తీర్థంబున నొక్కొక్క నాడైన, నొక్కనాడన్ని తీర్థంబులం దైనను, గృతస్నానులై బ్రాహ్మణ సువాసినీ జనంబుల కనేక గో భూ హిరణ్య ధనధాన్య భూషణాంబర కంచుక శూర్పాది దానంబు లొసంగి బ్రహ్మేశ్వరు నారాధించి వీతదోషులై యిహపర సౌఖ్యంబుల నొందు చుండుదురింక వేయుం జెప్పనేల? నొక్క దివసం బిప్పట నొక్క తీర్థం బునఁ గృతస్నానుండై బ్రహ్మేశ్వరు నారాధించిన నరుండు కాశీక్షేత్ర మందొక్క సంవత్సరంబు నివసించి విశ్వేశ్వరు నారాధించిన బుణ్యంబు నొందు, మఱియుఁ బాపనాశన తీర్థంబును, 2. కలకలేశ్వర తీర్థంబును, 3. సోమసిద్ధేశ్వర తీర్థంబును, 4. అగ్నీశ్వర తీర్థంబును, 5. భుజంగేశ్వర తీర్థంబును, 6. బ్రహ్మనారాయణ తీర్థంబును, 7. శుక్లేశ్వర తీర్థంబు నన యేడును వారతీర్థంబులని చెప్పంబడు. నీ తీర్థంబులందుఁ గ్రమం బుగా స్థిర భాను సోమాంగారక బుధ గురు శుక్రవారంబులఁ గృత స్నానులై బ్రహ్మేశ్వరు నారాధించు వారలఖిల సౌఖ్యంబు లనుభవించి శివసాయుజ్యంబు నొందుదురు. ఈ యలంపురంబున నుత్తర దిగ్భాగం బునం బ్రవహించు నాదావతీ నదియును దక్షిణ దిగ్భాగంబునం బ్రవ

హించు వేదావతీ నదియును, నీ రెండుఁ బ్రత్యేకంబుగాఁ దుంగభద్ర
స్గలయుటంజేసి యచ్చటి తీర్థంబులు నాదావతీ సంగమతీర్థంబని, వేదావతీ
సంగమతీర్థంబని చెప్పంబడు. పెండియుఁ బాపనాశనేశ్వర ఘట్టంబున నున్న
నృసింహుని దర్శించి యనంతరంబ గురిగింజ మాధవస్వామి నారాధించు
వార లఖిల పాపముక్తులై శివసాయుజ్యంబు నొందుదురు. మున్దుఁ జెప్పిన
యంతర్గంగా తీర్థంబును, మణికర్ణికా తీర్థంబున రెండునుఁ బ్రత్యేకంబుగఁ
బుష్కరిణులై ప్రవహించి తుంగభద్రా నదింగలయుఁ; దక్కిన యిరువది
రెండు తీర్థంబులు నదీ ప్రవాహంబునం దంతర్భూతంబులై యుండు.

శ్లో. బ్రహ్మేశోయం స విశ్వేశ స్సాక్షాత్ హేమలాపురీ,
పాగంగా తుంగ భద్రేయం సత్యమే తన్న సంశయః॥

వ. అని యిట్లా స్థలపురాణంబునం జెప్పంబడి యున్నది గావున హేమలాపురి
యనందగు నీ యలంపురంబు దక్షిణ కాశీపట్టణంబై దేజరిల్లు. ఈ నదీ
స్థల మాహాత్మ్యంబులు వర్ణింప బ్రహ్మాదులకైన నగోచరంబు లట్లైనను
నీ వొనర్చుఁ బ్రశ్నంబునకు సంతసించి దైవయోగంబున నాకుం గోచ
రించినంత వివరించితి; నింక నా వృత్తాంతంబు వినుము. భూలోకంబు
నందుఁ దొల్లిటి జన్మంబున క్షత్రియుండనై ధర్మ విదుండను పేరం బరగి
దేవ హితంబులగు ననేక సత్కార్యంబు లాచరించి మనుష్య దేహంబు
విడిచి దివ్యదేహుండనై యింద్ర దత్తంబగు నీ దివ్య విమానంబున
నుండి స్వేచ్ఛం జరియింపు చుండుదు. నేడు నీతోడ నీ సుప్రసంగం
బొనర్చుటం జేసి నాకు నీ దివసంబు సుదివసం బయ్యె. నో కీర
వాణీ! యింకఁబోయి వచ్చెదనని రత్నవిమాన ద్యుతులు నలు
దెసల నావరింప నంతరిక్షంబునకుం జనియె. ఇట్లుఁ దన యం దతి
పుణ్యంబులగు తీర్థంబు లిల్లసిల్ల జగత్ప్రసిద్ధంబై స్మరించు మాత్రంబున
సకల జంతు పాపనిర్మూలనంబు సేయుచు నిష్టార్థంబు లొసంగుచు నుత్తర
వాహినియై చెంగు నమ్మహానది నూరక చూచుచుండ నంత సూర్యాస్త
మానంబగుటయు, సంధ్యాకాలంబున నల్లన నన్నదికిం డిగ్గిఁ బాదప్రక్షా
ళనం బొనర్చుకొని దండప్రణామంబు లాచరించి మనంబున సదాశివుం
దలంచుకొని యన్నదీలలామంబుపైఁ జూడ్కులు నిగుడ్చించి హర్షంబున

నానందబాష్పంబులఁ గన్నులం దొరుగ వినయంబునఁ గరకమలంబులు
ముకుళించి యిట్లని వినుతించితి. 128

## కీరవాణి తుంగభద్రానదిం గొనియాడుట
(కందపద్యాష్టకము)

క. శ్రీకరమగు నీ మహిమము
బ్రాంటముగ నెంచఁ బద్మభవునకుఁ దరమే!
లోకముల నెల్ల భవదవ
లోకనములఁ బ్రోతువమ్మ లోలతఁ దల్లీ! 129

క. దేశముల బుట్టి దుఃఖ
క్లేశంబుల నొందకెపుడుఁ గేవల సౌఖ్యా
వేశంబగు నీ తటమున
నాశన్వృతమయి పుట్టుటది భద్రమగున్. 130

క. కుందంబులఁ గేరెడు నీ
బిందువులం దొకటి జంతు పృథు పాపములన్
గ్రమ్మందింపదే సద్హృదయా
నందంబగు నీ చరిత్ర మలవియె బొగడన్. 131

క. మునుకొని భక్ష్యాదుల రుచి
గను నాల్కఁ రసజ్ఞయగునెఁ గల్యాణి భవ
ధ్ఘన మృదు చరితామృత రుచి
గను నాల్కఁ రసజ్ఞ యనఁగఁ గడు నొప్పు నిలన్. 132

క. వ్రతములఁ దపము లొనర్చుచు
సతతంబుఁ గృశింపనేల సద్భక్తి నినున్
మతిఁ దలఁప నిహ పరంబులు
నతులితముగఁ గలుగుఁ గరతలామలకముగన్. 133

క. అల పూర్వ పాపముల నదు
లలయుచు వినుఁడాయ నప్పుఁడయ్యాపదలన్
తొలగించి శుభము లిడుటన్
ఫలియించెను నీకుఁ దుంగభద్రాఖ్యఁదగన్. 134

క. తిరమైన నీ కటాక్ష
స్ఫురణమ్ముఁ బడయంగ నరిది సుర మౌనులకున్
పరమముగఁ బడయని దర్శం
బరయఁగ నేనెంత దానఁనౌదున్ జననీ! 135

క. దినముఁ బ్రాతఃకాలంబున
వినయంబునఁ దలచు జనులు విభవోజ్జ్వలులై
మున సాయుజ్యము నొందుదు
రని బుధులెప్పుడు గణింతురది నిక్కముగున్. 136

వ. అని యిట్లనేక విధంబులఁ గొనియాడి యన్నదీరత్నంబునకుఁ బునః ప్రమాణం బాచరించి జగజ్జనని యగు సతీదేవి కార్యంబు నెరవేర్పం బోవు చున్నదాన, నిక్కార్యంబు శీఘ్రంబుగ ఫలించునట్లుఁ గృపసేయ వలయు ననిఁ బ్రార్థించిన నప్పుడయ్యుదకంబులందు ఫేన యుక్తంబులై బుడ బుడ శబ్దంబుల ననేక బుద్బుదంబు లుత్పన్నంబులయ్యె; నప్పుడా చిహ్నంబు గనుంగొని నే నొనర్పుఁ బ్రార్థనంబునకు శుభ సూచకంబుగాఁ బ్రత్యుత్తరం బొసంగెనని విశ్వయించి హర్షంబున నమృతో పమానంబులైన యుదకం బులఁ ద్రావి మెల్లన నన్నదీ లలామంబుఁ దాటి తటంబులం గుసుమ ఫల భరితంబులై దేజరిల్లు తరులతా వితానంబులం గనుంగొని యరుదం దుచు నల్లన గగనమార్గంబున నుద్గమించి యరుగుచు 137

క. వినవమ్మ! సతి ముదమ్మునఁ
గనులకుఁ బండువుగ నెదుటఁ గనుఁగొంటివి కే
తన వాతధూత కాలాం
బన ధుచి హిత సలిలధరము సదలంపురమున్. 138

## అలంపురీ పట్టణ వర్ణనము

వ. అది మఱియు ననంత చంద్రకాంత మణిప్రభాపటల భాసురంబులై దర్శన మాత్రంబున నెల్లకాలంబుఁ జకోర తృష్ణాపహరం బొనర్చుచు దిట్టంబగు కైదువం బట్టి గట్టుల చట్టువలం దెగఁ గొట్టిన జెట్టి పట్టణంబుఁ జుట్టున మెట్టిపారు వేల్పుఁటేరట్టై యుప్పొంగి పట్టులేక భూమికిం దటంబుగ దిగి వచ్చుచున్నదో యనం దేజరిల్లు ధవళ విశాల సాలంబులును, మకర కమఠ కర్కటక మీనాది జంతు సంతాన ఘూర్ణితంబులై సకల శత్రుదృష్ట భీకరంబులై గంధవహోద్ధూత తరంగ సంఘట్టిత మణితటంబులై వికసిత కమల కువలయ గంధమిళితంబులగు నుదకంబులం బూర్ణంబులగు నగాధ ఖేయంబులును, నిరంతర కుసుమ ఫలోన్నతంబులై మధురసంబుల వర్షింపుచు భగవత్కథాగానంబు లొనర్చు శుకపిక శారిక మయూరాది విహంగవ్రాతంబుల విరాజమానంబులగు నుద్యానవనంబులును, రత్న సోపాన విరాజితంబులై భృంగమరాళ కారండవ చక్రవాక బకాది జలద్విజ గరుజ్జాత సమీరంబులన్ కదలు మంజులోర్మిలితంబులగుఁ గనక కల్హార కుముదంబుల నుండి స్రవించు మకరందంబులం గలసిఁ బరిమళించు జలంబుల నేత్రానందం బొనర్చు సరోవరంబులును మౌక్తిక సుధా లిప్తంబులై యకలంకంబులగు బలభిన్మణి ప్రభాపుంజంబుల నంబరంబు నాచ్ఛాదించుచు, నప్పురంబునం జరుగు వింత లొవ్వునం గనుంగొన నుప్పరంబున నుండి విచ్చలవిడి నరుగుఁదెంచి నిల్చిన యచ్చరలో యనన్ బారుగా నమర్చిన గనగ సాల భంజికా నివహంబుల మనోజ్ఞంబులగు మహోన్నత సౌధంబులును, గారుడోపలనిబద్ధంబులై యగణితంబులగు రుచి నికరంబుల దిగంతంబులకు వెదజల్లుచు నభ్రంకషంబులైఁ జదలన్ జను రవి సుధాంశు లలసటన్ దీర్చుకొను నెపంబున ననేక రూపంబుల నుపరిప్రదేశంబులందు నిల్చిరో యనం జెన్నుమీఱు శాతకుంభ కలశ సముదయంబుల నుజ్జ్వలంబులగు గోపురంబులును, రుచిరంబులగు శుభ్ర స్ఫటిక సోపాన మార్గంబులు నలుదిక్కులం దేజరిల్ల మంజు రంభా స్తంభ లలితంబులగు జామీకర స్తంభ సముదయంబుల కాంతులుపకంఠ ప్రదేశంబుల నావరింప ననేక రత్న తోరణంబుల ధగద్ధగ లాశాంగనలకుఁ

చిత్ర వస్త్రాద్యలంకారంబు లొనంగ నిఖిల శోభన ద్రవ్య పరిపూరితంబులై
గతాగత సుభటజన సంకులంబులై, పరిమళధూప ధూమాచ్ఛాదితంబులై
మహాగజ దానోదక పంకిలాంగణ పరివృత్తంబులై నిరంతర మంగళ
మహావాద్య ఘోషంబు లుల్లసిల్ల దివ్యమణి పీఠాసనాసీనులై వ్యవహారంబు
లొనర్చు శ్రీమంతులగు రాజోత్తములచేత నొప్పుగుల్కు నాస్థాన మంట
పంబులును, మృగమద గంధోదక మిశ్రితంబులై పరిమళంబులు వెదజల్లుచు
నరుణపల్లవ శోభితంబులగు బూర్ణకుంభంబు లుపరి ప్రదేశంబుల వెలుంగ
సన్నంబులై పన్నెలీను ముత్తెంపు రంగవల్లికల నున్నతంబులగు
గోమేధిక రత్న రచితంబులైన వేదికలును, గుంద బృంద మాలికా
సుందరంబులై యపరిమితంబులగు పరిమళంబులం జెన్ను మీరి మధు
రసంబు లాస్వాదింపుచు నవిరళంబుగ నిండుకొను భృంగ సంఘాతంబుల
సుస్వరంబుల మేళనంబు సేసి వీణాగానం బొనర్చుచు దమతమ పతుల
మెప్పించు జంద్రవదనల క్రంమన తేవన్ గుల్కు చల్వచప్పరంబులును,
దివ్యవస్త్రాభరణ ధనధాన్య పదార్థ సమృద్ధంబులై వజ్ర వైడూర్య
గోమేధిక పుష్యరాగ మౌక్తిక నీల ప్రవాళాది రత్నరాసులు దేదీప్య
మానంబులై వెలుంగ గ్రయ విక్రయ వ్యాపారంబుల విశ్రుతంబులైన
వణిగ్జన మందిరాంగణంబులును, చిత్రపటాంచల జాతవాతంబుల వియన్మా
ర్గంబున బుష్పక విమానారూఢులై విహరించు దేవతామిథునంబుల కాతప
జనితంబగు నాయాసం బపనయించి సుఖం బొనర్చు మణిస్థగితంబులగు
ద్వారకేతనంబులును, వజ్రమౌక్తిక తోరణాలంకృతంబులై వాయువశం
బున మణిఘంటికా సహస్రంబులు ఘణఘణ శబ్దంబులం గదల వైడూర్య
చక్ర కూబర స్ఫురితంబులై పరభయంకరంబులగు వృషభ సింహ
వరాహ గజ వ్యాఘ్ర వానరాది ధ్వజ పతాకంబుల నభంబు నొరయు రథం
బులును, రవికాంతోజ్జ్వలంబు లగు పతకంబులు గంఠంబుల జెలంగ
గండస్థలంబుల వర్షించు మదధారా పరిమళంబు లానుచు, ఝుమ్మ
ఝుమ్మన రొదలు సేయు గండుతుమ్మెదల దుండాగ్ర ఫూత్కారంబుల
జడియం జేయుచు మెఱుంగుల దురంగలించు నీలమేఘంబులో యనం గను
పట్టు మహాగజంబులును, గనక రత్నాభరణ విభ్రాజమానంబులై వాయు

వేగంబునుం దిరస్కరించు గమనంబుల హరిహరుల మెచ్చక బరాక్ర మంబులం గరాళించుచు మందిర హజారంబులం బారులు దీరి నటనంబుల సలుపు శ్వేతారుణాశ్వంబులును, బరశు పట్ట సముద్గర భిండివాల శూలాది నానాయుధంబులఁ గరంబుల వెలుంగ దండధరునైన బట్టి గండ దంచెడు శూరత్వంబున నుప్పొంగు ద్వారపాలకులును, సకలవిద్యా ప్రవీణులై వేదోక్తంబులగు యజ్ఞాది కర్మంబు లీశ్వరార్పణంబుగ నాచరింపుచు నిరంతర భగవద్ధ్యాన పరాయణులై లోకోపకారాసక్తులై సంచరించు బ్రాహ్మణోత్తములును, దమ ప్రాణనాథుల జగన్నాథులుగా నెంచి సక లాభరణ భూషితలై నిఖిలోపచారంబుల సలుపుచు ననేక జానపదుల సర సొన్న పానంబులం దనుపు పతివ్రతాంగనలును, సువర్ణ శృంగంబులఁ దామ్ర పృష్ఠంబుల రజతఖురంబుల మెఱయ చోరజనంబులకుఁ బాపక్ష యంబు లగు క్షీరంబులఁ గాలత్రయంబున నొసంగుచు సవత్సంబులై వీథుల సంచరించు సాధుధేనువులనుఁ గలిగి మహాభోగంబున నింద్రుని, సదాచారంబున బృహద్భానుని, న్యాయ విచారంబున దండధరుని, సాహ సాధిక్యంబున నైఋతిని, గరుణాతిశయంబున వరుణుని, బలవేగంబుల ననిలుని, ధన విశేషంబునం గుబేరుని, నైశ్వర్యంబున నీశానుని, ధిక్క రించుచుండెడు జనంబుల నొప్పు మిగిలి సకల సంపత్సహితంబగు నిందిరా సుందరీ మందిరంబునుం బోలె నానందభరితంబగు నయ్యాలంపురంబుఁ గనుంగొని యరుదంచుచు మెల్లన ధరణికిం డిగ్గి యప్పు డప్పురవరంబు సొచ్చి రాజమార్గంబునం జను సమయంబున. 139

తే. గీ. దేవి! నీ కార్య మొనరింపఁబోవు నాకుఁ
దోరమగు నంధకారంబుఁ దోపకుండ
దివిజులెత్తిన కపురంపు దివ్వెయనఁగ
గగన భాగంబునను సుధాకరుఁడు దోఁచె 140

వ. ఇట్లు చంద్రోదయంబగుటయు, నప్పుడే సతి సంతసంబునం బొదలి యా రాజమార్గంబున నుభయ పార్శ్వంబులం దనరారు దివ్య మణిమందిర కుడ్యంబుల నేర్పునం దీర్చినఁ జిత్ర ప్రతిమా విశేషంబుల నవలో కింపుచుం జని చని ముందట మహామణి గోపుర ప్రాకార కేతన పరివేష్టి

తంబును, సముద్రఘోషం బడంచు వీరభట సింహనాద బాహుళ్యంబును, గజహయ ఘీంకారహేషారవ స్ఫుటంబునై పరిపంధి హృదయభేదనం బొనర్చు శశికాంత రచితం బగు దివ్య విశాల భవనంబుఁ గని యచ్చట. 141

## కీరవాణి బాలబ్రహ్మేశ్వరుని గృహంబునకుం బోవుట

సీ. శంకరవిజయ భాస్వత్కథా బిరుదాళిఁ
        జదువు మాగధ భట్ట సంతతిఁ గని
వేదాంతవేత్తలై వెలయు మార్కండేయ
        భృగ్వత్రి ముఖ ముని బృందముఁ గని
దర్శనాపేక్షులై ద్వారమండలిభక్తిఁ
        గాచియుండెడు దేవగణముల్ఁ గని
బలవంతులై బరాబరులు సేయుచు నుండు
        నందీశ ముఖ గణనాథులఁ గని

వజ్ర పంజరముల నుండి వసల నెపుడు
శివ! శివ! యటంచుఁ బలికెడు చిలుకలఁ గని
సంశయము మాని యిదియె సచ్చరిత్రుడైన
యమ్మహాదేవు మందిరం బనుచు నలరి. 142

వ. అంత నా మనంబున సంతోష భయంబు లుప్పొంగ రాత్రి ప్రథమ యామాంతంబునం గదలి జనస్పర్శనంబుఁ గాకుండ నేర్పునం బోవు చున్న సమయంబున నచ్చటి దేవముని శ్రేష్ఠులు నన్నవలోకించి మహాత్ములుఁ గావున నేనుఁబోవు కార్యంబు మనంబుల నెఱింగి యూరకుండి రంత నితరులకుం దెలియబడక నతివేగంబునం జని యనేక దీపమాలికా రాజితంబులును, మహాభటనికరపాలితంబులును, సుందరీ సందోహ వీణా గాన వినోదంబులునై యొప్పుఁ జతుర్దశ కక్ష్యాంతరంబులఁ గడచి ముందట సాంబ్రాణ్యగరు గంధ ధూప పరిమళాహ్లాదంబును, పారిజాత కుసుమ మాలికా తోరణ నిబద్ధంబునుఁ జిత్ర రత్న ప్రతిమావళీ శోభితంబునుఁ గర్పూర దీపకళికా సహస్ర విరాజమానంబునుఁ జంద్రకాంత ఖచితంబునగు రమ్యాంతర్గృహంబున. 143

సీ. పవడంపు పట్టెల బాగుగాఁ బూన్చిన
గొమరైన నీలంపు కోళ్ళ తోడ
నన్నవజ్రపురాలఁ జవులచేఁ గడు సుం
దరములైన పైడి కంబముల తోడ
నరుదారఁగాఁ జుట్టుఁ దిరిగిలాఁ గట్టిన
సవరైన మల్లెపూసరులతోడ
వాణి ముత్తెపు కుచ్చులను పొందగాఁ గూర్చి
కట్టినఁ బలు మేలు కట్టు తోడ
నమరు నా దోమతెర మంచమందు బండి
సొరిది వన్నెంపు వలువ ముసుంగు పెట్టి
విన్ను మదిలోనఁ దలఁచుచు నెన్నరాని
చింతతో నున్న యా సదాశివునిఁ గంటి. 144

వ. ఇట్లుఁ గనుంగొని యచ్చట నెవ్వరు లేకునికి మనంబు యుల్లనఁ గొంత వడి శరీరంబు మరచి యల్లనం దేరి ధైర్యం బవలంబించి మహానుభావుం డగు సదాశివుండు వియోగతాపంబునం జలింపుచు సేవక జనంబుల నంతర బహిర్ద్వారంబుల నునిచి దా నంతఃపురంబునం దేకాంతంబునఁ జింతించు చున్నవాఁడని నిశ్చయించి మెల్లన లోపలికిం జని సమీపంబున నిల్చి ముసుంగిడిన యజ్జిలుగు వలువనుండి గానంబడు మహాభూషణ భూషితం బగు నమ్మహనీయమూర్తి స్గనుంగొని హర్షంబు నొందిఁ గనుంగవ మూసి నిదురించుచున్న నా మహాత్ముని తోడ నీ వృత్తాంతం బెట్లు విన్నవింతు నని యోచించి యచ్చేరువ నున్న రత్నవేదికన్గూర్చుండి యద్దేవుని నిద్ర లేపు తలంపున నితరులతోడ సంభాషించునట్లుఁ బలుకం దొడంగితి. 145

కీరవాణి యొక యుపాయంబున సదాశివుని నిద్రలేపుట

సీ. దక్షకూతురు సతి తరలాక్షి యను కన్య
సుగుణాఢ్యఁ గలఁదతి సుందరాంగి!
యా యాంతి స్వప్నమందభవుండుఁ బొడసూపి
దివ్యయోగం బుపదేశ మిచ్చి

విన్నఁ బెండ్లి యాడెదనని చెప్పి చనెనంత
నా సతి మదిలోన నతనిఁ దలఁచి
విరహ-వేదనఁ జెంది వెస మూర్ఛనొందిన
నా కల్కి వృత్తాంత మతిరయమునఁ

జెప్పవచ్చితి భవునకుఁ జిత్తమలర
నమ్మహాత్ముండు నాపల్కు లాదరమున
నాలకించునొ లేక ననాదరమున
నాలకింపఁడొ బిదప నేట్లొనొ యెఱుఁగ 146

వ. అని వెండియు నహోరాత్రంబులం జెలికత్తియలతి జాగ్రత నొలువ నితరులకుఁ గన నలవిగాకఁ దల్లిదండ్రుల యనుజ్ఞ నంతఃపురంబున నున్న యా సతీదేవికి స్వప్నంబున సాక్షాత్కరించి, నిన్నుఁ బెండ్లి యాడెదనని యాసవెట్టి చని మరలం బొడసూపక నమ్ముద్దుగుమ్మ నత్యంత విరహాంబుధిన్ ద్రోచిఁ గఠిన భావంబున నుండుట మహాత్ము లగు వారికిం దగునె? కటకటా! యా సదాశివుం డాదరింపకున్న నమ్మగునఁ దనువునం బ్రాణంబులు నిల్పనేర్చునే? యని పల్కు నప్పుఁడ మ్మాటలు శ్రోత్రగతంబు లగుటయు నమ్మహాదేవుండు నెమ్మొగంబుపై ముసుంగుఁ దొలగించి దిగ్గున లేచి కూర్చుండి నేత్రంబుల కొంతు లుపకంత స్రంత కుడ్యంబులకు వింత చెలువొసంగ నలుదిక్కులు నిరీక్షించి నిమీలిత నేత్రుండై కొంతఁ దడవుఁ జలింపక యానందంబు నొంది గ్రమ్మఱ నయనారవిందంబులు విచ్చి పురోభాగంబున రత్నవేదికన్ కూర్చుండిఁ గరంబులు మోగిచియున్న నన్నాదరంబునం గనుంగొని యిట్లనియె. 147

సదాశివుండుఁ గీరవాణింజూచి పలుకుట

ఉ. ఎవ్వరిదాన వీ వొరుల కెవ్వరికిం జొరరాని మద్గృహం
బెవ్విధిఁ జొచ్చి వచ్చితివి యెంతటి జాణవు మాటిమాటికిన్
పువ్వులఁదేనె లొల్కుగతిఁ బొంకముగా సతివార్త లిందు నీ
వెవ్వరితో వచించెదవొ యేర్పడ మాకెఱిగింపు మానినీ! 148

చ. బహు భట పాలితంబులయి బ్రహ్మకునైన గమింపరాని యీ
మహిత మణి ప్రభాపటల మంజులతన్ దనరారు ద్వారముల్
విహిత గతిన్ గమించి బటువేగమునం జనుదెంచి తిట్లు నీ
వహహ గణింప నెంత మహిమాధికురాలవు యిజ్జగంబునన్ 149

క. వచ్చునెడ భటులెతింగిన
జెచ్చెఱ నీ కరుగుదేర శక్యమె యిటకున్
వచ్చిన చందముఁ గనుఁగొన
నచ్చు వడెన్ కామరూపివవి మా మదికిన్ 150

చ. అతివ! వినుం గనుం గొనగ హర్షముఁ జెందె మనంబు నీవు నా
సతి కథ లిచ్చటం దగఁ బ్రశంస యొనర్చుట కేమి కారణం
బతుల గుణాఢ్యుఁ డెవ్వఁడిట కంపినవాఁడొ వినుం దిరంబుగా
నతిమధురోక్తులం దెలుపు మంతయు దాచకమాకు వి త్తతిన్. 151

వ. అని యిట్లాజ్ఞాపించిన నమ్మహాత్మునకు దండప్రణామంబు లాచరించి భయ వినయ హర్షంబులు మనంబునం బొడమచుండఁ గరంబులు ముకుళించి నిలిచి యిట్లని వినుతించిరి.

## కీరవాణి సదాశివుని నుతించుట
### (దండకము)

శ్రీమన్మహాదేవ! దివ్యప్రభావా! భవారణ్యదావా! దయార్ద్ర స్వభావా! భవ ద్దివ్యమాహాత్మ్య మెన్నంగ బ్రహ్మాదులునోపరో దేవ! నేనెంత దానన్ సమస్తేశ బ్రహ్మాండ ఖాండంబులెల్లన్ తటాకంబు నందుండు మీనాది జంతు ప్రకాండంబు భంగిన్ భవత్కుక్షిలో నుండగా నట్టి బ్రహ్మాండ సంఘంబు లందెల్లడం దారు మధ్య స్థితంబైన సూక్ష్మాగ్ని చందంబున న్నిండి యున్నట్టి నిన్నాత్మలన్ ధ్యాన యోగంబునం గానగా లేక మూఢాత్ములుం గొందఱుం దైవ మిందుండు నందుండు నంచున్ పరిభ్రామ్యమాణాత్ములై మర్త్యులేశ నాయానముం జెంది వేదోక్త కర్మంబు లెల్లన్ ఫలాపేక్షులై చేసి తత్కర్మ భోగంబులన్ బొందుచుం జచ్చుచుం బుట్టుచుం బెక్కు జన్మంబులైనన్ ఫలాసక్తి పాశంబులం దెంచగా లేక నీవారు నావారు నీ సొమ్ము నా సొమ్మటంచున్ పృథగ్భావముం బొంది వర్తింతు రజ్ఞంతు

సంఘంబులం జెప్పఁగా నేల? విజ్ఞాన లోలాత్ములై సర్వభూతంబులు నీవుగా నెంచి సర్వాత్మకు న్నిన్ను హృత్పద్మవాసుండుగా ధ్యానయోగంబునం గాంచి హర్షింపుచున్ వేదయుక్తంబులైనట్టి కర్మంబులెల్లన్ భవత్ప్రీతిగాఁ జేసి నిష్కా-ములై సర్వమున్ బ్రహ్మమేకాని యన్యంబు లేదంచు నద్వైత భావంబునన్ నిత్య సంతుష్టులై యుండు ధన్యాత్ము లెల్లప్పుడున్ మంగళంబైన నీ దివ్యసాయుజ్యమున్ గందురయ్యా! మహాదేవ!! యీ మర్త్యలోకంబునన్ పూర్వ కర్మంబునం బుట్టి యజ్ఞానలోలాత్మనై గొంత కాలంబు బాల్యంబునం బుచ్చిఁ దొల్లింటి సత్కర్మ మూలంబునం దేవదేవుండవై యాదిమధ్యాంత శూన్యుండవైనట్టి నిన్నుం గనుం గొంటి, నా పాపముల్బాసె, నా కోర్కెలీడేరె, నే ధన్యనైతిన్ మహాత్మా! భవ త్పాద పద్మంబు లెల్లప్పుడున్ నాదు చిత్తంబునం జేర్చి నన్నుం దయంజూడు నాకాది భోగంబులెల్లన్ భవత్సేవతో సాటిగావంచు నార్యుల్ గణింపంగ విందున్, కటాక్షించి నన్నున్ భవద్దాసలో కాళికిం దాసిగాఁ జేసి నీ దివ్యసాయుజ్య మింపార నాకుం బ్రసాదింపవే! భక్త హృత్పద్మవర్తీ! జగచ్చక్రవర్తీ! సదానందమూర్తీ నమస్తే నమస్తే నమస్తే నమః॥ 158

కీరవాణి సదాశివునితోఁ దాను వచ్చిన
వృత్తాంతంబుఁ జెప్పుట

వ. అని యిట్లు వినయంబున నుతించి మహాత్మా! భవత్ప్రియ భక్తుండును, భాగవతోత్తముండునైన నారద మునీంద్రునకు ముఖ్యసేవకుండునుఁ దపోధనుండు నైన సుచంద్రుండను బ్రాహ్మణోత్తమునకు భార్యయగుఁ బ్రేమావతి యందు జన్మించిఁ గీరవాణి యను పేరంబరగి మా తండ్రి యనుగ్రహంబున మంత్రపూర్వకంబుగా నభస్సంచార క్రమంబునుఁ గామరూప ధరత్వంబు, నదృశ్యవిహారంబు వివి మొదలయిన విద్య లనేకంబులుఁ బడసి మహాతపోనిధి యగు దక్షప్రజాపతి కనుంగు కూతు రగు సతీదేవికిం గలఁ జెలికత్తియల యందే నొక్కఁ జెలికత్తియనై మెలంగుదు. నిన్నటి రాత్రి మహాసౌధాంతరంబున నిద్రించు నా సతీదేవి స్వప్నంబునం దాము సాక్షాత్కరించి విజ్ఞానం బుపదేశించి యమృతోప మానంబులగు వాక్యంబుల మానసం బలరించి నిన్నుఁ బరిణయం బయ్యెద

నని చెప్పిపోయిన కతంబున నంతనుండి యమ్ముద్దియయు తద్వృత్తాంతం బంతయు నాప్తలమగు మాతోడం జెప్పి చెప్పి భవత్సౌందర్య వాఙ్మాధుర్యాది విశేషంబులు నుతించి, నుతించి మహావిరహంబునం దపించి తపించి యా సదాశివుండగు బాలబ్రహ్మేశ్వరు నిటకుం దోడి తేకున్నం దాళం జాలనని మణిపీఠంబునం బొరలుచు మూర్ఛం జెందె; నంత నచ్చెలికత్తియ లంద రత్యంత భయంబునం జింతింపుచుండ నేనుం గొంత వడి చింతించి యచ్చెలుల నందరిం జూచి మీరలిందుండి సతీదేవి కుపచారంబు లొనర్చు చుండుం డేను శీఘ్రంబునం బోయి యమ్మహాత్ముండగు సదాశివున కీ వృత్తాంతంబుం జెప్పి తోడి తెచ్చెదనని వారల యనుజ్ఞవడసి నభోమార్గం బునం జనుదెంచుచు భవత్సన్నిధానంబు నుండి యేతెంచు నారదుం గాంచి నమస్కరించి యద్దయాళున కీ వృత్తాంతంబు విన్నవించి గొన్ని వరం బులు వడసి యమ్మునీంద్రు వీడ్కొని గడువేగంబున నేతెంచుచు జగత్పావని యగు దుంగభద్రానదిం గని నంతసించి యన్నదిం బొగడి, సాయంకాలంబున విప్పట్టణంబు సొచ్చి నిఖిల చిత్రంబులుం జూచుచు వచ్చి వచ్చి యుష్మన్మందిరంబుం గాంచి యచ్చట నున్న దేవముని సంఘంబుల దర్శించి భట వికరంబులకుం దెలియబడక నదృశ్య సంచా రంబునం జతుర్దశ కక్ష్యాంతరంబులు గడచి మత్పూర్వ పుణ్యఫలంబున నిచ్చట మంజు తల్పంబునం బవ్వళించి నిదురించుచున్న మిమ్ముం బొడ గాంచి భయహర్షంబులం జెలంగ సమీపంబునం గూర్చుండి మిమ్ము నిదుర లేప నుపాయంబు జింతించి సతీ వృత్తాంతం బొకదొనర్చిన ప్రశ్నంబున కుత్తరం బిచ్చు తెఱంగున వచించితి ననవుడు మొగంబునం జిరునవ్వు మొలయ నతిసంతసంబునం బొదలుచు నాపయిం గటాక్ష వీక్షణంబులు నిగుడ్చి యిట్లనియె. 154

తే. గీ. తరుణి! నీ చర్య లధికాద్భుతములు నీదు
వాక్య సంతతు లమృత ప్రవాహ తతులఁ
గాన మామది సంతోష కలితమయ్యె
నొనరఁ బ్రశ్నములకుఁ జెప్పు ముత్తరములు 155

సీ. కమలాక్షి! విను, సతీకాంత స్వప్నమునందుఁ
గను వేడ్క మముఁ బొడగాంచు టెట్లు?
గాంచి నెమ్మనములోఁ గలుగు మర్మము లెల్ల
సిగ్గెడలించి భాషించు టెట్లు?
భాషించి నంతనే బలువైన విరహంబు
చేఁ దాళలేక మూర్ఛిల్లు టెట్లు?
మూర్ఛిల్లినంతనే మోమాటమున మమ్ముఁ
దెచ్చెద నని నీవు వచ్చు టెట్లు?
లలన! యిటువంటి చిత్రము ల్గలవె జగతి!
ఘనులు విని నైతురే యిట్టి కార్యములనుఁ
జెన్ను మీఱంగఁ గలలోనఁ గన్నవెల్లఁ
దలఁప మిథ్యలుఁ గాకఁ దథ్యంబు లగునె 156

క. కలలో మిముఁ గనుఁగొని సతి
వలచిన దటు రమ్మఁటనుచు వచ్చిన నీ మా
టలు నమ్మి యెన్నఁ డెఱుఁగని
తలమున కేమిచ్చి రాఁగఁ దగవే చెపుమా! 157

వ. ఇందు కొక్క పురాతనం బగు కథఁ గలఁ దాకర్ణింపుము. 158

కీరవాణికి సదాశివుం డొక్క పురాతనం బగు
నితిహాసంబుఁ జెప్పుట

సీ. అఖిల సంపదలకు నాటపట్టైనట్టి
యరుణాబ్జమను నొక పురముఁ గలదు
దత్పట్టణం బేలు ధవుఁడు పృథ్వగ్రీవుఁ
డతని కూతురు కాంచనాంగి యనఁగఁ
బరగి నెచ్చెలులతి భయభక్తులనుఁ గొల్వఁ
బ్రద్యుమ్ను నారవ బాణ మనఁగఁ
దేజరిల్లుచు రత్నదేదీప్యమానమౌ
మేడపై వేడ్కతో మెలఁగు చెపుడు

సంచితంబుగఁ దనకు సీడైన వానిఁ
గాంచి వరియింప నోరణగండ్ల నుండి
పురములోనికి వచ్చుచుఁ బోవుచున్న
సొగసుకాండ్రను దప్పక చూచుచుండు. 159

వ. ఇట్లుఁ జూచుచుండఁ గొంతకాలం బగిరె; నంత నొక్కనా డమ్మానిని రాత్రి కాలంబున మేడపై నిద్రించుచుండఁ దా నెన్నండుఁ జూడని మహా సౌందర్యవంతుఁడగు బురుషుం డొక్కఁ డల్లన నేతెంచి మోహంబునఁ గౌఁగిటం జేర్చి రమించినట్లు స్వప్నంబగుటయు. నంత మేల్కాంచి యుత్కంఠనొంగి మనంబున నది నిశ్చయంబ కాఁదలంచి నన్నిచట రతిక్రీడం దేల్చిన పురుషుం డెందరిగెనో యనిఁ జింతింపుచు నారాత్రి గడిపి మరునా డరుణోదయంబున నాప్తలగుఁ జెలికత్తియలకుం జెప్పఁ జొక్కుచుఁ జెన్నిధింగోలుపోయినఁ బేద చందంబున నప్పురుషుని వలని మోహంబునం బరితపించుచు నా యెమ్మెకాఁడెందుండి వచ్చునో యని గవాక్ష మార్గంబులం జూచుచున్న సమయంబున. 160

అరుణాబ్జమను పట్టణంబున కొక చమత్కారుండైన
మాంత్రికుండు వచ్చుట

సీ. భూరికాంతులఁ గుల్కు భూతి పుండ్రముఁ దిద్దిఁ
బచ్చ బొట్టు రుమాలు మెచ్చఁ జుట్టి
యుల్లిపిల్లుఁ బసిండిఁ దొల్చుఁబోగులఁ బెట్టి
రమణీయ రత్నహారములఁ దాల్చిఁ
బస మించు జలతారు పట్టుదోవతిఁ గట్టి
వలమూపుపై వల్లెవాటుఁ జార్చి
కటితటంబున జంట కనకసూత్ర మమర్చి
క్రియల గోతంబుఁ డాకేలఁ బట్టి
చోద్యమిది యనిఁ దను జనుల్ జూచుచుండ
విసుకపై జల్లి మృగములఁ గసురు కొనుచుఁ
బెక్కు భాషలఁ బలుగులఁ బిలుచుకొనుచు
మహిమ నేతెంచె నప్పుడొక్క మంత్రవాది. 161

వ. మఱియు, నఖిల మంత్ర శాస్త్రజ్ఞుండును, సకల దేశభాషా విశారదుండును, నిఖిల జంతు వాక్యవిదుండునైన యమ్మంత్రవాది యగు బ్రాహ్మణుండు దన వచన రచనా చమత్కారంబులఁ గనుపరచుచు జనుల హస్తంబులం జూచి భూత భవిష్యద్వర్తమాన కాలానుభవంబుల సూచింపుచు, ననేక ధనం బార్జింపుచు నప్పుర వీథులం జరింపుచున్నయెడ 162

చ. అతని మొగంబుఁ గంథమును నాతనిఁ గన్నులు బాహుయుగ్మము
న్నతని విశాలవక్షము నాతనిఁ గౌనుఁ గటి ప్రదేశము
న్నతని యొయ్యార మంతయును నప్పురిఁ గల్గిన కామినీమణుల్
వితత విమోహచిత్తలయి వేమఱుఁ గన్గొనుచుండ నత్తఱిన్ 163

కాంచనాంగి యను రాజకన్యక మాంత్రికుండగు
బ్రాహ్మణునిం జూచి మోహంబునఁ బరితపించుట

తే. గీ. అబ్బురంబుగ నక్కాంచనాంగి యతని
సోయగంబు నెగాదిగఁ జూచి మదన
తాపమున బిట్టు మూర్ఛిల్లి తల్లడిల్లి
దెలిపిఁ దనుఁ గొల్చుచున్న నెచ్చెలుల కనియె 164

క. చెలులారా! స్వప్నమున నన్నుఁ
గలసిన ఘనుఁ డితఁడె దొరికె గ్రక్కున మీర
చ్చెలువునిఁ దోడ్తెచ్చి దయన్
వెలయింపుడు నన్ను సౌఖ్యవితతుల ననినన్ 165

వ. అప్పు డచ్చెలికత్తియల లోనఁ గాదంబిని యనునది యత్తొయ్యలిం జూచి, నీవుఁ జింతింప వలవఁ దతండుండు చోటికేను సాయంకాలంబునం బోయి, నీ వృత్తాంతంబుఁ జెప్పి చమత్కారంబున నీ యొద్దకుం దోడి తెచ్చెదనని యూరడింపుచుండ, నంతఁ గొంతవడికి సూర్యాస్తమానం బగుటయు, నక్కాదంబిని బయనంబై చని పురంబు వెలపట నొక్క బావి సమీపంబునం దేజరిల్లు వటవృక్షంబు క్రింద దర్భాసనాసీనుండై యున్న యమ్మాంత్రికునిం గని దండప్రణామంబు లాచరించి, యో భూసురోత్తమా! యిప్పట్టణంబేలు ప్రభుండు పృథగ్గ్రీవుం డతని కుమార్తె యగుఁ

గాంచనాంగి యనునది విన్నటి రాత్రి లోక సుందరులగు మిమ్ము వరి యించినట్లు స్వప్నంబుఁ గని, దానికి మెఱుంగు, వెట్టిన ట్లీ దివసంబున మిమ్ముఁ గన్నులారఁజూచి విరహవేదనం బొరలుచు మిమ్ము నీ రాత్రి సౌధంబు మీదికిం దోడితెమ్మని నన్నుఁ బుత్తెంచిన నేను వెదకుచు వచ్చి వచ్చి మిమ్మిచ్చటం గాంచితి.

మంత్రవాది యగు బ్రాహ్మణుండు మణిసౌధంబునఁ
గాంచనాంగి స్గూడియుండుట

వ. శీఘ్రంబుగ విచ్చేయవలయునని ప్రార్థించిన నతండు వివేకి యయ్యునుఁ గామాంధకార మగ్నుండై సప్నంబులు నిక్కంబులే యని తలంపక నట్టి దాని వెంటం జనుదెంచి రత్న సౌధంబున నక్కాంచనాంగి తోడం బూలపాన్పున రతిక్రీడం దేలుచుండ నా రాత్రి నేకతంబున సంచరించు చారుల వలన నా పృథగ్రీవుండు వినిఁ గోపంబునఁ గన్నుల నిప్పు లురుల ఖడ్గంబు ధరియించితి య చ్చోరువిం జంపుదు నని విలయకాలుండునుం బోలెఁ జనుదెంచి సోపాన మార్గంబున నెక్కి వచ్చుచున్నయెడ, న మ్మంత్రవాది యెఱింగి య మ్మగువం జూచి మీ తండ్రి నన్నుఁ జంపవచ్చుచున్నవాడు; యిందు కేమి యోచన గణించెద వనిన నప్పొలతుక కళవళం బంది యాట్లనియె. ఈ సమయంబున నాయందు నేరంబు మోపికొనిన నన్ను మాతండ్రి వధించుం గావున నీవవచ్చి పొందితివని నీయందు నేరంబు మోపి చెప్పెద; నీ యోచన కొలందిఁ దప్పించుకొను మనవుఁడు నతండుఁ గటకటంబడి నేను సకల మంత్ర తంత్రజ్ఞుండ నయ్యును, గురు భక్తుండ నయ్యును, వివేక శూన్యుండనై గామాంధకారంబున నిమ్మగువఁ బుత్తెంచిన వాక్యంబులు నమ్మి యిట్టి దుష్కార్యంబునకు వచ్చుటంజేసి మోసంబు వాటిల్లెనని యన్నాతిం దూషిం పుచు, మనంబున రోసి దిగ్గన లేచి నిలిచి తొలంగి పోవుట కొండు మార్గంబు లేమిం జింతించి మహామంత్ర జ్ఞుండుఁ గావునఁ దన కెదురై ఖడ్గంబు ఝళిపించుచు వచ్చుచున్న పృథగ్రీవుం గనిఁ దన మంత్ర సామర్థ్యంబున నతని కరచరణాద్యవయవంబులుఁ గదలకుండం జేసి మెల్లన

సౌఖంబుఁ దిగ్గి దైవయోగంబున సురక్షితుండై జనియెం గావున నతి కుపిత
లగు యువతుల మనమ్ములు నమ్మి సంచరించు కాముకుల కాపద లరు
దెంచు టాశ్చర్యంబె? యని మఱియు నిట్లనియె. 166

తే. గీ. మాన్యులెఱిఁగినఁ బాటిల్లు మానహాని!
ప్రభువు లెఱిఁగినఁ బాటిల్లుఁ బ్రాణహాని!!
గానఁ జన కూడ దిటువంటి కార్యములకు!
వారిజానన! విను మెట్టి వారికైన!! 167

క. ఎక్కడి సతి యెక్కడి నీ
వెక్కడి వృత్తాంత మెవ్వ రెఱుఁగుదు రిచటన్
నిక్కమవి నీదు పల్కులు
ముక్కవతో నమ్మఁదగదు మాకు మృగాక్షీ! 168

చ. అని యిటు లానతిచ్చిన మహాత్ముని పల్కుల కుల్కి నేను నె
మ్మనమునఁ గుంది కార్యమనుమానము లేదిక దప్పె నక్కటా!
యని ధృతిఁ బూనిఁ గేల్మొగిచి యమ్మహనీయ చరిత్రుతోడ స
ద్వినయమునన్ వచించితి వివేకము నాత్మఁ జెలంగు చుండగన్. 169

వ. దేవా! సర్వజ్ఞు లెట్టుఁబల్కినం బల్కుదురు. అందుకుఁ బ్రత్యుత్తరం
బొసంగ నేనెంతదాననైనను భగవద్భక్తుండగు నారద మహాముని యను
గ్రహంబు నంజేసిఁ గోచరించి నంత విన్నవించెద మహాత్మా! నిరాకారుం
డును, నిర్గుణుండును, నిస్సంగుడును, నిష్ప్రపంచుండును, నిర్వ్యాపారుండు
నైన నీవు భవత్కల్పితంబైనఁ బ్రకృతిం గూడి యాకార గుణసంగ
ప్రపంచ వ్యాపార సహితుండవై వ్యష్టి భావంబున జీవుండనఁ గించిజ్ఞుం
డవై సమష్టి భావంబున నీశ్వరుండన సర్వజ్ఞుండవై సర్వకార్య కార
ణుండవై యద్వితీయుండవై పరిపూర్ణ భావంబునఁ "గ్రిడావస్త్వఖిలం
జగత్త"ను న్యాయంబునం జేసి నీయందలి సమస్తంబునుఁ బ్రకాశింపం
జేయుచు నానంద మయుండవై యాద్యంత రహితుండవై "ఏకోదేవ
స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" యను న్యాయం
బున నిఖిల భూతావాసుండవై యంతర్బహిః ప్రదేశంబుల నెక్కడ
న్నీవయ్యై నిగూఢంబునం దేజరిల్లుచుండుదు; వట్టి నీవు భూలోకంబు నందలి

జనంబుల భక్తియోగంబునం గృతార్థులంజేయు కొఱకు బ్రహ్మాది దేవతా ప్రార్థితుండవై బాలబ్రహ్మేశ్వరుండన నీయలంపురంబున వెలసితి వమ్మహా ప్రకృతి యీ లోకంబున దక్షప్రజాపతికిం గూతురై సతి యను పేర విలసిల్లుచున్నది.

## కీరవాణి శివుని ప్రశ్నంబుల కుత్తరంబు లిచ్చుట

అట్టి నీ యందనపాయిని యైన సతీదేవి విభుండవగు నిన్ను స్వప్నంబునం బొడగాంచుట కేమి యాశ్చర్యంబు? బొడగాంచినంతనే సర్వజ్ఞుండవగు నీ తోడ మర్మంబులేక భాషించుట కేమి సందియంబు? భాషించిన పిదప జగత్ప్రియుండవగు నీ యందు మనంబుఁ జేర్చి విర హంబున వివశత్వంబు నొందుట కేమి యనుమానంబు? వివశత్వంబు నొందిన యా సతింగని యార్తనగు నేనుఁ జింతింపుచు నా వృత్తాంతంబుఁ దెల్పుటకు భవచ్చరణారవింద సాన్నిధ్యంబున కేతెంచుట కేమి క్రొత్త యగు? మహేశ్వరా! సామాన్య జనంబుల వృత్తాంతంబులు దృష్టాంతంబు లుగా నాజ్ఞాపించుటఁ దగునే? ప్రపంచంబు ననుసరించి పల్కెదరు గాని మీ రెఱుంగని యర్థంబుఁ గలదే? సందియంబు మాని యచ్చటికి వేంచేసి సతీదేవి నూరార్చి సంతసంబునం బరిణయంబై జగంబుల రక్షింపుఁ డనవుఁడు సదయాపరుండు సన్నత్యాదరంబునం గనుంగొనిఁ జిరునవ్వు మొలకలెత్త నిట్లనియె. ఓ కీరవాణీ! నీ మనోభావంబుఁ దెలియుటకై యట్లు బలికితిమి గాని నీ వచనంబులుఁ దథ్యంబులగు, నా సతీ వృత్తాంతం బంతయుం దెలిపి మద్హృదయ జనితంబైన తాపం బవనయించితివి. నీ వనేక జన్మ సుకృత విశేషంబునం జేసి మహాత్ముండగు నారదుని యనుగ్రహంబు వడసి సతికార్యంబునకై యచ్చటి కరుగుదెంచుట యెఱింగి గూఢవర్తనంబు మాని యెవ్వరికిం గాంచ నలవికాని మద్దివ్య రూపంబు నీకుం గనుపరచి సంభాషించితి మింక నొక్క విశేషంబుఁ గల దాకర్ణింపుము. నీ తోడన మేమిప్పుడు వచ్చుట కార్యంబుఁగాదు. నీవు శీఘ్రంబునం జని, సతికిం సంతసం బొనర్చి, యొక విధంబున దక్షునకుం దెలియఁజేసి వివాహ ప్రయత్నంబు సేయింపుము. కార్యసిద్ధి యయ్యెడు నని యాజ్ఞాపించి నీ కొసంగమని యొక్క దివ్యఫలం బిచ్చి వీడ్కొలిపిన,

నప్పుఁ డజ్జగదీశ్వరునకు నమస్కరించి యతివేగంబునం గదలిన భోమార్గంబున మహూర్తమాత్రంబు లోపల నిచ్చటి కరుగుదెంచితి ననవుఁడు నా సతీదేవి పరమాశ్చర్యంబు నొంది యక్కీరవాణిం గౌఁగిటం జేర్చి యనేక దివ్యాంబరాభరణంబు లొసంగి బహువిధంబులం గొనియాడి యానంద వార్ధిందేలుచుండె; నంత నెచ్చెలు లంద రధిక సంతసంబునం బొదలుచు నక్కీరవాణి కిట్లనిరి. 170

సీ. బర్హిర్ముఖులకైన బడయ సాధ్యముఁ గాని
రమణీయమగు మహాత్వమున మించిఁ
బరమయోగులకైన నరయంగ రానట్టి
వరదుఁడౌ నమ్మహేశ్వరునిఁ గాంచి
యూ సతీవృత్తాంత మెలమి నా ఘను తోడఁ
బడిలంబుగా నాత్మఁబట్టఁ జెప్పిఁ
బ్రత్యుత్తరంబు శుభంబుగాఁ గొనివచ్చి
దంబు మీరిన సుకృతంబు వడసి

విశదకీర్తుల నమ్మెల్ల వెలయఁ జేసి
మన సతీదేవి కధిక సమ్మద మొసర్చిఁ
బెంపుఁ గంటివి మాలోనఁ బేర్మితోడఁ
జారు గుణ జాణ తూణి! యో కీరవాణి!! 171

వ. అని బహువిధంబులం గొనియాడి రంతఁ బ్రభాతం బగుటయు, కాల్య కృతంబులు నిర్వర్తించి యా సతీదేవి సూర్యోదయ సమయంబునఁ గీరవాణి మొదలగు చెలికత్తియ లిరుగడలం గొలువ సుఖాసీనయై సదాశివ కథా వినోదంబున నుండె; నిట్లుండుచు దినదినంబును జగదీశ్వరుండగు సదాశివుని యందలి భక్తి విశేషంబున. 172

సతీదేవి సదాశివ ధ్యానానందయై యుండిఁ
బుణ్యాత్ముల కనేక దానంబులు సేయుట

సీ. కలకంఠు మోహనాకారంబు మనములోఁ
జింతించి కనుమూయుఁ గొంతఁ దడవు
మదనాంతకుని దివ్యమహిమంబు లనురక్తిఁ
గొనరుచుఁ గొనియాడుఁ గొంతఁ దడవు

వాసుదేవుని భవ్యనామ సహస్రంబు
గురుభక్తిఁ బఠియించుఁ గొంతఁ దడవు
శివుఁ గొల్చు భాగ్యంబుఁ జేకూరె నాకని
సునిసి యానందించుఁ గొంతఁ దడవుఁ

జేరి శ్రుతులకు నైనఁ జర్చింపరాని
యభవుఁడిక నాత్మ వల్లభుం డగుసటంచుఁ
జింత నెదలించిఁ బులకించుఁ గొంతఁ దడవు
నందముగఁ ద్రోడి నెచ్చెలు లభినుతింప, 173

వ. మఱియును 174

సీ. శ్రీశైల కాళికాక్షేత్ర రాజంబులుఁ
గానఁబోయెడుఁ బుణ్యమానవులకు
గోదావరీ నర్మదాది తీర్థము లందు
స్నానమాడఁగ బోవు సజ్జనులకు
నిరంతరంబు శివకథల్ నిష్ఠతో వినిపించుఁ
బరమ పావనులైన బ్రాహ్మణులకుఁ
ద్రిపురాంతకునకు సత్ప్రీతిగా నాట్యముల్
సల్పుచుండెడు భవ్యసాధువులకు

నన్న పానీయము లొసంగి యాదరమున
వివిధ ధన భూషణాంబర వితతు లొసఁగి
బొంకముగ వారి మహిమలుఁ బొగడుచుండుఁ
జాల నాసతి శివకథాలోల యగుచు 175

వ. ఇట్లా సతీలలామ సదాశివ భక్తియోగంబునం దేజరిల్లుచు, వివాహంబున కెదురు సూచుచుండెననిఁ జెప్పిన విని శౌనకాది మహామును లానందంబు నొంది బరమహర్ష సమేతుండగు సూతుం జూచి మహాత్మా! యుష్మద్వక్త్ర నిర్గతంబగు భగవత్కథామృతం బస్మ చ్ఛ్రోత్ర ముఖంబుల నెంతఁ గ్రోలినం దనివిఁ దీరఁ దవ్వలి వృత్తాంతం బంతయు నాసతీ వలయుననిఁ బ్రశ్నం బొనర్పుటయు 176

## ఆశ్వాసాంతము

క. గవి వంశాంబుధి చంద్రుఁడు
జనసుతుఁడౌ శేషసుకవి సాహాయ్యమునన్
ఘనముగ నీ యాశ్వాసము
నొనరించితి బుధులు మెచ్చ నురుతర బుద్ధిన్ 177

పంచ చామరం :

ధరావరా కృపా సముద్ర దారితాఖిలాహితా!
పురారి వంద్య సద్యశః ప్రపూరితా ఖిలాదిశా!!
పరాత్పరా ఖిలాధినాథ! పన్నగారి వాహనా!
సురారి నందనా వనా! విశుద్ధ భక్త పావనా!! 178

మాలిని :

సురముని బుధపాలా! సుందరీ గానలోలా!!
వరగుణ గణహారా! వార్ధి గంభీరసారా!!
నిరుపమ జయశీలా! నిత్య సత్యప్రచారా!!
పరహృదయ విదారా! భవ్య గోపాలబాలా!! 179

## గద్య

వ. ఇది శ్రీ పరమేశ్వర గురు కటాక్ష లబ్ధ కవితాచమత్కార నందవర వంశో ద్భవ కుత్సన గోత్ర పవిత్ర బొడ్డిచర్ల జ్వాలయామాత్య పుత్ర రంగ యామాత్య పాలక కుమారార్య సేవాధురంధర సరసపాండిత్య సుకవిజన విధేయ చెన్నకృష్ణ నామధేయ ప్రణీతంబైన సతీ బాల్బ్రహ్మేశ్వర పరి ణయంబను మహాప్రబంధంబునందు, సతీదేవి దన స్వప్నవృత్తాంతంబుఁ జెలులకుం జెప్పి సదాశివుని యందలి మోహ విరహంబులం బరవశంబు నొందుటయు, గిరవాణి యను నెచ్చెలిఁ దన తండ్రి యగు సుచంద్రుండుఁ బూర్వంబున నారదానుగ్రహంబునం బడసిన విద్య లన్నియుండన కొసంగినఁ గ్రమంబుఁ దోడి చెలుల కందరకుం జెప్పుటయు, నెచ్చెలులు శంసించి, గిరవాణిం గొనియాడుటయుఁ జెలుల యనుమతిం గిరవాణి సతీదేవి యొద్దకు సదాశివుం దెత్తునని నభోమార్గంబునం బోవుటయు, సతీ

దేవి విరహం బార్పంజాలక నెచ్చెలులు భయంబు నొంది దక్షునకు విన్న వించుటయు, దక్షుం డాప్త జనంబుల తోడ నేతెంచి సదాశివుని ధ్యానంబు సేసి దన్మంత్రోదకంబులు సతీదేవి పయిం బ్రోక్షించుటయు, నా సతీదేవి మూర్ఛం బాసి దల్లి దండ్రులం గూడి భోజనాదికృత్యంబులు నిర్వర్తిం చుటయు గిరవాణి సదాశివు పాలికిం బోవుచు నభోమార్గంబున నారదుం గాంచి సతీవృత్తాంతంబు విన్నవించి గొన్ని వరంబులు వడయుటయు దుంగభద్రానదీ దర్శనంబును, ధర్మవిదుండను మహాత్ముండు గిరవాణికి దుంగభద్రా నది యందుండు తీర్థంబులం దెల్పుటయు, దన్నదీ వర్ణనం బును, దుంగభద్రా నదీ స్తోత్రంబు, నలంపురీ వర్ణంబును, దివ్య భవ నంబునం గిరవాణి సదాశివుం గాంచి యభివందన స్తోత్రంబు లాచరించి సతీ వృత్తాంతంబు విన్నవించుటయు, నమ్మహాత్ముండు గిరవాణి తోడ బరిహాసంబుగా నొక్క యితిహాసం బానతిచ్చుటయు, గిరవాణి మనం బునం గలంగి ధైర్యంబున నమ్మహాత్ముని వెండియు నుతించి ప్రార్థించు టయు, సదాశివుండు సంతసించి సతిం బరిణయంబయ్యెద నింక వివాహ యత్నంబు సేయింపుమని గిరవాణిం బంపుటయు గిరవాణి సతీదేవి సాన్నిధ్యంబున కేతెంచి తద్వృత్తాంతంబు వివరించుటయు, సతీదేవి సంతసించి గిరవాణి కనేక దివ్యాంబరాభరణంబు లొసంగి గొనియాడు టయు, నెచ్చెలులు గిరవాణిం బహూకరించుటయు, సతీదేవి శివకథా లోలయై వివాహంబు గోరుచుండుటయు నను కథలం గల ద్వితీయా శ్వాసము. 180

# సతీ బాలబ్రహ్మేశ్వర పరిణయము

## తృతీయాశ్వాసము

క. శ్రీ గోపికా మనోహర
మాగధ ముఖ రిపు విదార మన్మథ జనకా!
యోగీంద్ర బృంద సన్నుత
నాగేంద్ర శయాన! నందనందన కృష్ణా! 1

తే. గీ. అవధరింపుము! శౌనకాద్యఖిల మునులఁ
గలయఁ గని సూతుఁ డానంద కలితుఁ డగుచు
నాత్మఁ బరమాత్మనందు లీనంబు సేసి
బలికె నమృతోపమాన సంభాషణముల 2

క. శ్రీకరమై ఘనతర మో
క్షాకరమై సర్వదోష హరమై తగు, నా
శ్రీకంఠుని కల్యాణము
సాకల్యంబుగ వినుండు సన్మునులారా! 3

వ. అని పలికి. 4

సీ. ఏ దేవుఁ డనురక్తి నెలమి రజోగుణ
కలితుఁడై విశ్వంబుఁ గలుఁగఁ జేయు
నే దేవుఁ డాదరం బూది సత్త్వాఢ్యుఁడై
రహిని జంతువుల సంరక్షఁ జేయు
నే దేవుఁ డదయుఁడై యేపారు దమమున
సకల సత్వముల నాశనముఁ జేయు
నే దేవుఁ డవి మాని యిరవొంద సాక్షియై
యణురూపమున నిరీక్షణముఁ జేయు

నట్టి భగవంతు ఁ డవ్యయుం డనఘ చరితుఁ
డప్రమేయుఁ డజేయుఁ డాద్యంత రహితుఁ
డ ద్వితీయుఁ డనంతుఁ డత్యాదరమునఁ
దొలఁగ కెపుడు మదాత్మలో నిలుచు గాక! 5

సీ. సతతంబు భృత్యులై క్రతు భుక్కు లెవ్వనిఁ
గరుణచే సాధు నిర్జరత గనిరి
యురు నిష్ఠచేఁ దాపసోత్తము లెవ్వని
భజియించిఁ గడు మహత్త్వంబు గనిరి
భాగవతోత్తము ల్పరగంగ నెవ్వని
భజియించి సన్మోక్ష పదవి గనిరి
బహు జాతు లపార భక్తిచే నెవ్వనిఁ
బదము లర్చించి సంపదలు గనిరి

భవ్యగుణులగు నా ప్రజాపతులు నెవని
స్వాంశమునఁ బుట్టి సృష్టించు శక్తి పడసిఁ
రట్టి లోకైక గురుఁ బరమాత్మ నెపుడు
నాత్మఁ జింతింతుఁ గైవల్యమందు కోఱకు. 6

సీ. ఏ మహాత్మని తేజ మిన చంద్రవహ్నుల
నెల్ల కాలంబు భాసిల్లఁ జేయు
నే శుభాఢ్యుని తేజమెల్ల యోషధుల నా
వేశించి రసముల వెలయఁ జేయు
నే పరాత్పరు తేజ మెల్ల పర్వతములఁ
జిత్రకాంతులఁ బ్రకాశింపఁ జేయు
నే యఖండుని తేజమెల్లఁ బ్రాణుల, గూడి
యరుదుగా బొమ్మల ట్లాడఁ జేయు

సగుణమయి నిర్గుణంబయి సర్వకాల
మొక్క రీతిగ లోవెలి నిక్కటిల్లి
ద్రష్టయై దృశ్య భావంబుఁ దనకు లేక
వెలరు నా ఘను తేజంబు నభి నుతింతు. 7

వ. ఇట్లు సర్వేశ్వరుండగు భగవంతుని మనంబునం గొనియాడి యా సుతుం డధిక హర్ష సమేతుండై యిట్లనియె; నమ్మహాప్రకృతి యగు సతీదేవి బరమాత్మం డగు సదాశివుని యందుఁ జిత్తంబుఁ జేర్చిఁ దద్భక్తి మోహ విశేషంబులం జేసి దినం బొక వత్సరంబుగాఁ గ్రమింపుచు వివాహ కాలం బున కెదురుసూచుచుండ నాషాఢ మాసాంతం బగుటయు నప్పుడు. 8

## ప్రావృట్కాల వర్ణనము

శా. రాయంచల్ కొలఁకుల్ త్యజింప శిఖివారం బాత్మ మోదింప స
త్తోయంబుల్ వహియించి మేఘములు నుత్తుంగంబులై నీల సం
ఛాయ స్గుల్కఁగఁ జాతక వ్రజమును నిచ్చన్ బొంగ దావాగ్నులన్
మాయన్ లోకము సంతసింపఁగ నభోమాసంబుఁ దోచెన్దగన్ 9

వ. అప్పుడు 10

సీ. సదమలంబుగఁ బారు నదుల తోయము లెల్ల
యమునా జలంబులఁ గ్రమముఁ బూనె
ధాతు చిత్రితములై దనరు శైలము లెల్ల
నంజనాద్రుల భంగి నమువుఁ దాల్చె
బహుళ కాంతులతోడఁ బరగు వృక్షము లెల్ల
నొగి తమాలంబుల సొగసుఁ గనియెఁ
బలు జాతి భేదముల్గల శకుంతము లెల్లఁ
గోకిలంబుల భాతిఁ గొమరు మిగిలె

నఖిల మనుజులు నాశ్చర్య మావహింప
ధరణిపై విష్ణుమూర్తుల కరణిఁ దోచెఁ
ర(త్రి)భమున శ్యామలాభ్రంబు లావరింప
ఘన తరంబగు నవ్వాన కాలమందు. 11

తే. గీ. కరముఁ జెన్నారు నాకాశ గంగ యందు
మిట్టి పడియెడు వాలుగ మీలనంగ
నఖిల సత్వము లద్భుతంబంది చూడ
మేఘ బృందంబు వెలువడి మెఱుపు లడరె. 12

క. లీలఁ జరియించెఁ బ్రావృ
ట్కాల మహాపురుషుఁ డలర గగనంబునను
ద్వేలముగ భేరు లనిమిష
లోలిన్ మ్రోయించి రన్నగ నుఱుములఁ జెలఁగెన్. 13

తే. గీ. స్వర్గజములైన గల్పవృక్షముల నుండిఁ
బెల్లు వానకు రాలినఁ బిందె లనఁగ
ధవళ రోచులఁ బుడమి యం దవిరళముగ
నొప్పు మీఱంగఁ బడియె వర్షోపలములు 14

క. ఉరుతరమగు నాకసమున
మరకత మణి తోరణములు మానితముగ ని
ర్జరవరులఁ గట్టిరో యనఁ
గరమరుదుగ నింద్రకార్ముకంబులఁ దనరెన్ 15

క. వరప్రావృట్కాల విభుం
డరుణంబగుఁ గుంకుమమున నయ్యచల నలం
కరణం బొనరించె ననన్
కరమలరుచు నింద్రగోపకంబులఁ బొదమెన్ 16

తే. గీ. తోరమగు వారిధారం దోగిన గను
లెల్ల రాజిల్లె దరణి యందెల్ల దిశల
శ్రీలు దులకింపఁ బట్టాభిషిక్తు లగుచు
నుల్లసిల్లెడు రాజన్యులో యనంగ 17

తే. గీ. తొరయుఁ గ్రొక్కారునందు భాసురము లయ్యె
నలిల సిక్తంబు లగుచు శాద్వల తలములఁ
దరచుగాఁ జిత్ర రత్నముల్ దాపినట్టిఁ
జారుతరమైన యున్నత జగతు లనఁగ 18

తే. గీ. మేలుఁ గుల్కెడు నవ్వాన కాలమందు
నవని వెలుఁగొందె మంజు సస్యముల తోడ
దివ్యమణి రత్న భూషణాంబరము లొల్కిఁ
దాల్చిఁ దులకించు యౌవన తరుణిఁ బోలె 19

వ. ఇవ్విధంబున నవ్వర్షర్తు వఖిలలోక సంపర్క సౌఖ్యదంబై జగత్సుందరం
బగుచుం దేజరిల్లె, నయ్యవసరంబున :0

## దక్షుండు సతీదేవికి వివాహంబు సేయ నూహించి యుపలాలింపుచు శాస్త్రోక్తంబులగు వివాహ లక్షణంబులుఁ దెల్పుట

క. తన కూఁతురి సుగుణంబులుఁ
గని దక్షుఁడు సంతసించి ఘనతరముగ నీ
వనజాక్షికి కల్యాణం
బొనరింపఁగ వలె నటంచు నూర్జిత వృత్తిన్ 21

తే. గీ. ఒక్కనాఁ డెల్ల నెచ్చెలు లొప్పు మిగులఁ
గొలువ సుఖలీల నున్నయా కూర్మి తనయ
నందితంబుగ రావించి యర్ఘ్యపీఠ
మందుఁ గూర్చుండఁ బెట్టి యిట్లనుచుఁ బలికె 22

క. అమ్మరొ! నీ సుగుణమ్ములు
నిమ్మహి నే కొమ్మలందు నెఱుఁగము, మా వం
శ మ్మిపుఁ డీవు జనించు క
తమ్మునఁ బావనతఁ జెందెఁ దథ్యముఁ దెలియన్ 23

క. ఉత్తమురాలగుఁ దన సుత
నుత్తమునకు దాన మొసఁగి యురుకీర్తి వరుం
డుత్తములగుఁ దమ పెద్దల
నుత్తమ లోకములఁ జెలఁగు చుండఁగఁజేయున్ 24

తే. గీ. అత్తమామల సేవించి యాత్మ విభుని
మనము రంజిల్ల నటియించు మాన్యచరిత్ర
జెన్నుగాఁ గోరి భువి యందుఁ దన్నుఁ గన్నఁ
దల్లిఁ దండ్రులఁ గీర్తిచేఁ దనరఁ జేయు 25

క. ఎప్పుడు నీ మృదుచిత్తముఁ
దప్పక శంకరుని యందుఁ దగిలి నటించన్
మెప్పున లోకము, బొగడఁగ
నొప్పుల కుప్పవగు నీకు నొరులు సమంబే! 26

తే. గీ. అఖిల లోకము లందుఁ బ్రఖ్యాతిఁ గాఁగ
నెలమి నాకుఁ గుమార్తెవై తిందె కానిఁ
బ్రాకటంబుగ నీరేడు లోకములను
బాలనము సేయఁ బుట్టినఁ బ్రకృతి వరయ. 27

తే. గీ. సుగుణ గణరాశివగు నీకుఁ దగిన వరుని
వెదకి తోడ్తెచ్చి సంతోష మొదవ నింకఁ
జెన్ను మీఱ వివాహంబుఁ జేయఁ గోరి
యున్నవాడను బుధజను లుత్సహింప. 28

సీ. ఇంపుగా ధనధాన్య సంపత్తుఁ గలవానిఁ
గుల గోత్రవర్యుఁడై వెలయువాని
దర్పక తుల్య సౌందర్యంబుఁ గలవానిఁ
గౌమరు ప్రాయంబుచే నమరు వాని
శుభ చిహ్నముల చేత సొంపుదేరెడు వాని
దీనుల బోషింపఁ దివురు వాని
వరగుణంబులచేత వన్నెకెక్కిన వాని
బుధజనసంగుఁడైఁ బొదలువాని
సకల విద్యాప్రవీణుఁడై జెలగువాని
వెదకిఁ దోడ్తెచ్చి బాంధవుల్ విశ్వసింప
నంచితంబుగ విరులఁ బూజించి, కన్య
నర్థి నొసఁగుటఁ గర్తవ్యమండ్రు బుధులు! 29

వ. అని వాత్సల్యయుక్తంబుగా గారవించిఁ బూర్వంబునం దనకుఁ బితామహుం డానతిచ్చిన వాక్యంబులుఁ దలంచి మఱియు నిట్లనియె. "తల్లీ! సర్వ శుభ లక్షణ సంపన్నవగు నీకుం దగిన వరు నెచ్చట విచారించి తెచ్చెదనో

యని మనంబునం జింతింపుచున్నవాఁడ. సర్వలోక వందితుండును, సర్వలోకేశ్వరుండునగు నయ్యీశ్వరుండు నీకు విభుండగుటకుఁ దగుంగాక! యితరు లగుదురే? యని పల్కిన నవ్వాక్యంబు లాకర్ణించి సతీలలామఁ జిరునగవంకురింప నవనత వదనయై యూరకుండె నంతఁ; దత్సమీపంబున నున్న కీరవాణి యను నెచ్చెలి దక్షునకు నమస్కరించి వినయంబునఁ గరకమలంబులు ముకుళించి యిట్లనియె. 30

కీరవాణి తాను సదాశివుని సన్నిధికిం బోయి వచ్చిన వృత్తాంతంబు దక్షునకుం జెప్పుట

చ. వినుము, మహానుభావా! యొక విన్నప మిత్తరళాయతాక్షికిన్
ఘనముగ స్వప్నమం దసిత కంఠుఁడు దర్శన మిచ్చెఁ బత్నిఁగా
నిను వరియింతు నింకఁ గడు నెయ్యమెలర్పఁగ నీ మనంబులో
నను భజియింపు చుండుమని నమ్మికఁ దోపఁగఁ బల్కిపోవుటన్ 31

వ. అంత సతీదేవిఁ బరమాత్ముండగు సదాశివునిఁ దన మనంబున ధ్యానంబు సేయుచుఁ దత్సౌందర్య వర్మాధుర్యాతిశయంబు లభివర్ణించి మహా విరహ వేదనం బొరలుచున్న యెడ నప్పుడేను మనంబునం జింతించి సజ్జనకుని యనుగ్రహంబునం బడసిన విద్యాబలంబున నమ్మనుభావుండగు నభవు నిచ్చటికిం దోడి తెచ్చెదననిఁ బయనంబై నభోమార్గంబునం బోవుచు, దైవయోగంబున నఖిలజ్ఞుండగు నారదుంగాంచి నమస్కరించి, యమ్మహాత్మున కీ వృత్తాంతంబు విన్నవించిన సంతసించి యో కీరవాణీ! తొల్లిఁ బితామహప్రార్థితుడై భగవంతుండగు సదాశివుండు భూలోకంబు నందలి జనంబుల భక్తియోగంబున ముక్తులంజేయు కొరకు నలంపురం బను పట్టణంబున బాలబ్రహ్మేశ్వరుండై యున్నవాఁ డమ్మహాదేవునిం బతిగా వరించుటకై జగజ్జనని యగు మహాప్రకృతి దక్షప్రజాపతికిం గూతురై సతి యను పేరంబరగుచున్న దట్లుఁ గావున నీవు శీఘ్రంబున నలంపురంబునకుం బోయి యీ వృత్తాంతం బద్దేవునకు విన్నవింపుము. కార్యసిద్ధియయ్యెడునని యానతిచ్చి యమ్మునీంద్రుం డంతరిక్షంబునకుం జనియె. అంత నే నతివేగంబున నలంపురంబునకుం జని మహాసౌధాంతరాళీనుండై యున్న బాలబ్రహ్మేశ్వరు సాన్నిధ్యంబున కర్ధరాత్రి సమయంబు

నంజని వినయంబున వందనం బాచరించి సతీవృత్తాంతం బంతయు విన్న
వించిన నద్దయాళుండు సంతసిల్లి సతిం బిలిచియం బయ్యెద నింక నీవు
శీఘ్రంబునం జని సతికి సంతసం బొనర్చి యొక విధంబున దక్షున కీ
వృత్తాంతంబుఁ దెలిపి వివాహ యత్నంబు సేయింపుమని యాజ్ఞాపించిన
నప్పుడే నతి వేగంబునం జనుదెంచి యీ సతీదేవి కంతయుం జెప్పిన
నాకర్ణించి మహానందంబు నొందె. ఈ వృత్తాంతం బిప్పుడు భవత్సముఖం
బున విన్నవించితిం గావున నీ సతీదేవి మనంబెప్పు డా బాలబ్రహ్మేశ్వరు
నందుఁ దగిలియుండునని చెప్పిన విని దక్షుం డత్యాశ్చర్యంబు నొంది
సంతోషమగ్నుండై యక్కింకరవాణి విన్నవించిన వృత్తాంతం బంతయుం
దన యోగదృష్టి వలన నెఱింగి నెచ్చెలులతోడ సతీదేవి నంతర్గృహంబున
కనిచి యాశ్రమవాసులగు మహర్షులం దోడితెండని శిష్యవర్గంబులం బనిచి
పుత్రికా వివాహాలోచనపరుండై యుండి మరునాడు సూర్యోదయంబున 83

తే. గీ. చంద్రకాంతోపల స్తంభ సముదయములఁ
జారుతరమగు మౌక్తిక తోరణముల
మహితముగఁ దేజరిలు సభామంటపమునఁ
జిత్రమణి పీఠమందు నాసీనుఁడయ్యె 84

## వశిష్ఠ కణ్వ కశ్యపాది మహామునులు దక్షుని సన్నిధికి వచ్చుట

వ. ఇట్లు సృష్టికార్య నిష్ఠుండగు దక్షుండు సభామంటపంబునం బీఠాసీనుండై
సకలవేదశాస్త్రార్థవేదులగు బ్రాహ్మణోత్తము లుభయ పార్శ్వంబుల
నుచితాసనాసీనులై సుప్రసంగంబులను సంభింప ననిమిష సమూహంబు
లతివినయంబునం జేరి బహువిధంబుల వినుతింప, ననేక పరిచారికా
జనంబు లూడిగంబులు సలుప, నపరిమిత తేజోవిరాజమానుండై రెండవ
సూర్యుండునుంబోలె నొప్పుఁదేరుచు, శిష్యజనాహూయమానులై శిష్య
ప్రశిష్య సంఘంబులతోడ నప్పుడేతెంచిన వసిష్ఠ, కణ్వ, కశ్యపాగస్త్య
శాండిల్య మౌద్గలాంగిరసాత్రి చ్యవన భృగ్వాది మహర్షుల నల్లంతనే
కాంచిఁ ప్రత్యుత్థాన పూర్వకంబుగాఁ దోడి తెచ్చి తత్సభామధ్యంబున

సుచితాసనా సీనులంజేసి యుక్తప్రకారంబునం బూజించె; నంత నా సభా మంటపంబు సుధర్మామంటపంబు చందంబునం దేజరిల్లుచుండె; నా సమయంబున నా దక్షుం డమ్మహర్షుల కిట్లనియె. 34

సీ. శ్రీకర బ్రహ్మావలోకన వ్యాసంగ
పుష్టులై నిత్య సంతుష్టులగుచు
మాధవార్పిత దివ్య మంగళాచార
కర్మఠులై భూతదయాళు లగుచు
శ్రీకంఠ చరణాబ్జ చింతనామృతపాన
మత్తులై నిశ్చల చిత్తులగుచు
జగదీశ చారిత్ర సద్గ్రంథ వార్ధి
విహారులై మోహ సంహారులగుచుఁ

దనరు మీరిందు వేంచేయుటను మదీయ
గృహము పావనమయ్యె సద్విహిత కీర్తి
మంగలంబులు సమకూరె మాకు నిపుడు
సతుల గుణభూషులార! మహాత్ములార! 35

క. మీ మహిమాతిశయంబులు
వేమరుఁ గొనియాడ నురగ విభునకు వశమే!
తామసగుణ రహితములై
మీ మనములు బ్రహ్మమంద మెలఁగుచు నుండున్ 36

వ. కావున మహాతపోధనులు, విజ్ఞాన సంపన్నులును, సర్వభూతదయాళునైన మీ యాగమనంబు మాకఖిల మంగళప్రదం బనవుఁడు వమ్మునీంద్రులు సంతసించి యా దక్షునిం జూచి మహాత్మా! సర్వలోకపూజ్యుండును, సర్వాత్మకుండునగు నారాయణు నధిక తపంబున మెప్పించి తదనుగ్రహంబునం గైవల్యంబుఁ గరతలామలకంబుగ నార్జించి స్రష్టవై సర్వలోకంబుల సృష్టించి మహదైశ్వర్య తేజోవిరాజమానుండవై సుఖదుఃఖ సమాన భావంబున నుత్కృష్టతం దనరు మీ దర్శనంబు మాకననేల! సకలలోక శుభప్రదంబుగాదే! యని నుతించిన నమ్ముని శ్రేష్ఠులకు దక్షుండు మరల నిట్లనియె, 37

### దక్షుండు మహర్షులతోడ సతీ వివాహాలోచనంబు సేయుట

చ. మునివరులార! మీరిపుడు ముఖ్యముగా వినుఁడస్మదీయ నం
దన సుగుణాఢ్యయౌ సతికి దద్దయు వేడుకతో వివాహమున్
ఘనముగఁ జేయఁగోరిఁ గడకన్మిముఁ బ్రార్థన సేసినాఁడ నే
ఘనుని కొనంగ మేలగుఁ దగన్ వివరింపుఁడుఁ జేతు నట్లుగన్ 39

క. లోకమున బుధుల యనుమతిఁ
జేకొని కార్యంబుసేయఁ జెల్వగునది ము
ల్లోకముల సమ్మతం బయిఁ
బ్రాకటముగ ఫలమొసంగు భవ్య స్ఫురణన్ 39

వ. కావునఁ గార్యంబు నడుపు వానికి బుధుల యనుమతంబు వడయుటఁ బరమ
శ్రేయంబగు; నిప్పుడేను మీ యనుమతిఁ గోరుచున్నవాఁడ; నీ ప్రశ్నంబు
నకు సదుత్తరం బానతీ వలయు ననవుఁడు నమ్మహర్షులు మనంబులఁ
గొంతఁ దడవు యోచించి దక్షునిం గని యో తపోధనా! సభాసమ్మతంబు
పడయుటకై యిట్టు లడిగెదరు గాని, మీ రెఱుంగని రహస్యంబు లెందునుం
గలుగ వట్టైనను మా చిత్తంబులం దోచినంత వివరించెద; మఖిల లోకేశ్వ
శ్వరుండును; శాశ్వతుండునగు సదాశివుండు భూలోకంబునందలి జనం
బులఁ గృతార్థులంజేయంగోరి బ్రహ్మప్రార్థితుండై యలంపురంబను
పట్టణంబున బాలబ్రహ్మేశ్వరుండన వెలసియున్నవాఁడు. అమ్మహాత్మునిం
బతిగా వరించుటకై దదనపాయిని యగు మహాప్రకృతి భవత్పుత్రికయై
సతీదేవి యనం దేజరిల్లుచున్నయదిఁ గావున నమ్మహానుభావుండగా బాల
బ్రహ్మేశ్వరున కీ సతీదేవి నొసంగి జగత్ప్రసిద్ధంబుగా వివాహంబు
సేయుటఁ బరమ సమ్మతంబని చెప్పిన సద్వాక్యంబులకు సంతసించి దక్షుం
డయ్యాషాఢ కృష్ణపక్షంబున రోహిణీ నక్షత్ర యుక్తంబగు త్రయోదశి
యందు వివాహంబు సేయుటకు ముహూర్త నిశ్చయంబు సేయించి
తత్కాలంబున బ్రాహ్మణ సువాసినీ జనంబుల కనేక గంధమాల్యాంబరా
భరణంబు లొసంగి యమ్మునీంద్రుల నుచితక్రమంబునం బూజించి
భోజనాదులఁ బరితృప్తులం జేసి వీడ్కొలుప సంతసింపుచు నమ్మహా
మునులు నిజాశ్రమంబులకుం జనిరి. తదనంతరంబున 40

దక్షుం డలంపురంబునకు శుభలేఖా యుక్తంబుగా
బ్రాహ్మణులం బంపుట

ఉ. శ్రీకరమౌ నలంపురికిఁ జెన్నొదవన్ శుభలేఖ తోడ సు
శ్లోకుల బ్రాహ్మణోత్తములఁ బెంపుఁ దలిర్పఁగఁ బంపఁ గోరి ము
ల్లోకము లోలి మెచ్చ నతలోకుఁడు దక్షుఁడు ధర్మపత్రమున్
చేకొని యందు పైనఁ గడుఁ జిత్రముగా లిఖియించె నత్తఱిన్ 41

శు భ లే ఖ

వ. "శ్రీమత్సర్వ జగదాధారుండును, సర్వజగదీశ్వరుండును, సర్వజగద్వ్యాపకుండును, సర్వజగద్రూపుండును, సర్వజగన్నుతుండును, సర్వజగత్సేవ్యుండును, సర్వజగద్రక్షకుండును, సర్వజగదుపాస్యుండును, సర్వజగత్పూజ్యుండును, సర్వజగద్వరందుడును, సర్వజగత్సృష్టి స్థితిలయ కారణుండును, సర్వజగదాత్మకుండునై యలంపురి యందు వేంచేసి యుండు శ్రీ బాలబ్రహ్మేశ్వరస్వామి చరణారవిందముల సన్నిధికి భవదాజ్ఞా ప్రవర్తకుండగు దక్షుం డనేక దండప్రణామంబు లాచరించి చేయంగల విజ్ఞాపనం బిచ్చటికుశలం బచ్చటి భవత్సకల సామ్రాజ్య లక్ష్మైశ్వర్య విభవాతి శయంబు లప్పటప్పటికి లిఖితపూర్వకంబుగా విశదపరచుచుండవలయును. తదనంతరం బీ యాషాఢ కృష్ణపక్షంబున రోహిణీ నక్షత్రయుక్తంబగు త్రయోదశి యందు సుగుణగణ భూషణ యగుఁ దమ కన్యకత్పుత్రిక యగు సతీలలామ నొసంగి వివాహం బొనర్పుటకు వసిష్ఠ కణ్వ కశ్యపాత్రి చ్యవన భృగ్వాది మహర్షులు మహూర్తము నిశ్చయించియున్నారు. కావున మీరు సకల బంధు జన సమేతముగా భట నట గాయక వందిమాగధ బృందంబులఁ గొలువ సుముహూర్తంబునకుఁ దరలి రావలయునని కోరియున్నాడను.

— చిత్తగించవలయును."

వ. అని యిట్లు లిఖియించి తత్క్షణంబున 42

తే. గీ. తగ సుమిత్ర సుదేవులన్ ధరణి సురల
నేర్పుఁ డకుకొత్త రావించి నెయ్యమలర
విమల మణిరత్న రుచిర పీఠముల నునిచి
ఫలికె దక్షుండు గంభీర భాషణముల 43

ఉ. భూసురవర్యులార! ఘనపుణ్యులు మీరతి వేగపోయి స
ద్భాసుర రమ్య హర్మ్యములఁ బ్రస్ఫుట గోపురమంటపంబులన్
వాసన లొల్కుఁ బుష్పవనవాటికలన్ సురలోక మో యనన్
నాసలుఁ గొల్పు మంజు నిలయంబునలంపురిఁ జేరి యచ్చటన్. 44

క. శ్రీ లొసగి భక్తులనుఁ బరి
పాలింపుచు మౌని బృంద పరివృతుఁడై స
ల్లోలతఁ గొలువుండెడు నా
బాలబ్రహ్మేశుఁ జేరి భక్తిఁదలిర్పన్. 45

వ. దండప్రణామంబు లాచరించి యచ్చటి వారు మెచ్చ నిచ్చటి శుభ నిశ్చయం బెఱింగించి శుభపత్రిక యొసంగిఁ దగిన సత్కారంబులు వడసి రండని దివ్యమాల్యాంబరా భరణాళ్యంబు లొసంగి శుభలేఖా యుక్తంబుగా నవ్విప్రవరుల నలంపురంబున కనిచి యింద్రాది దిక్పాలకులం బిలువ శుభలేఖల తోడందగిన వారలం బనిచి సాయంకాలంబున నంతర్గృహంబు నకుం జని సాయాహ్నిక కృత్యంబులు నిర్వర్తించి నిష్ఠాగరిష్ఠుండై దక్షుం డేకాంతంబున నఖిల లోకేశ్వరుండగు నారాయణు నారాధించి వినయం బున నిట్లనియె. 46

దక్షుండు భగవంతుండగు నారాయణు నారాధించి
స్తోత్రంబు సేయుట

సీ. శ్రీరమానాథ! యాశ్రితలోక మందార!
పన్నగ రాట్తల్ప పరమపురుష!
భువన సన్నుతగాత్ర! పురుహూతముఖ మిత్ర!
ధృత చారుగోత్ర! సంతత పవిత్ర!
గురుతర మణిహార! మురదైత్య సంహార!
వర రత్న కేయూర! దురిత దూర!
భువన రక్షణదక్ష! భువనాంత రాత్మక!
భూరి విజ్ఞానద పుణ్యచరిత!

శంఖ చక్ర గదాధర! సారసాక్ష!
విహగరాడ్వాహన! ముకుంద! వేదవేద్య!
వనజహిత సోమలోచన! మునిశరణ్య!
సచ్చిదానందమయమూర్తి! సాధువర్తి! 47

తే. గీ. ఉరుతరాఘాంధకార సూర్యోదయంబుఁ
ప్రకట దారిద్ర్య గహన దవానలంబు
తాపసవ్యూహ మోక్ష ప్రదాయకంబు
దర్శనీయంబు నగు భవద్దర్శనంబు. 48

తే. గీ. సింధుకన్యాలలామ సంసేవితంబు
భూరి వేదాంగనా శిరోభూషణంబు
ఘోర సంసార సాగరోత్తారణంబుఁ
బరమ పావనమౌ భగవత్పదయుగంబు. 49

తే. గీ. శంఖ చక్ర గదాంబక సంయుతంబు
వీరరాక్షస వంశ విదారణంబు
భక్త జన బృంద విశ్రుత భయహరంబు
ఘనతరోన్నతమౌ భవత్కర చయంబు. 50

తే. గీ. అఖిలలోక వితాన జన్మాలయంబు
నఖిలలోక వితాన వృద్ధ్యాలయంబు
నఖిలలోక వితాన లయాలయంబు
లీలఁ జెన్నొందు భవదుదరాలయంబు. 51

తే. గీ. మహిత కర్పూర దరహాస మండితంబు
సవన హవ్య సువాసనా చ్ఛాదితంబు
విస్ఫుటోజ్జ్వల శతపత్ర విస్తృతంబుఁ
బరమ మంగళమైన భవన్ముఖంబు. 52

వ. దేవా! సర్వేశ్వరుండవై మాయాకల్పితంబైన సర్వప్రపంచంబును, ప్రకాశింపం జేయుచుఁ దత్ప్రపంచంబున కగోచరుండవై సచ్చిదానంద మూర్తివై యవిచ్ఛిన్నంబుగ వెలుంగు నిన్నుం గనుంగొన నెవ్వఁడు సమర్థుండగు? లోకంబులం గొందఱు దారాపుత్రాది యుక్తంబగు

సంసారం బపేక్షింపక పర్వతారణ్యంబుల సంచరించుచు వాతాంబు
పర్ణాశనులై యింద్రియంబుల శోషింపం జేసి నిత్యంబు నిన్ను శంఖ
చక్ర గదాధరుండుగా వనమాలికా విరాజమానుండుగా మనఃపీఠంబుల నిల్పి
ప్రణవపూర్వకంబుగా భవన్నామంబులు జపింపు చుండుదురు. కొందఱు
నిన్ను సూర్యమండల మధ్యవర్తిగా భావించి జగచ్చక్షువగు సూర్యుండే
పరమదైవంబని నిశ్చయించి మహాభక్తియుక్తులై ధ్యాన నమస్కార
స్తోత్రంబులు సేయుచుండుదురు. కొందఱు నిన్ను యజ్ఞపురుషుండని నిశ్చ
యించి వేదోక్తంబులగు యజ్ఞాది సర్వకర్మంబులు భవత్సమర్పణంబుగాఁ
జేయుచుండుదురు. కొందఱు భవదవతార రూపంబులుగా సువర్ణ రజత
తామ్రాది లోహప్రతిమంబులు నిర్మించి వేదోక్తాచారంబులం బ్రతిష్ఠించి
షోడశోపచార విధులన్ భక్తియుక్తంబుగా బూజింపుచుండుదురు. కొందరు
వ్రతస్వరూపుండుగా నిన్ను మనంబులం దలంచి కల్పోక్త ప్రకారంబుల
నుపవాసయుక్తులై బహుదక్షిణల ననేక వ్రతోద్యాపనంబులు భవత్ప్రీతిగాఁ
జేయుచుండుదురు. కొందఱు తామసగుణ ప్రధానులు మహాశక్తి స్వరూ
పంబుగాఁ జింతించి యనేక మంత్ర తంత్రంబుల నావాహనంబు సేసి
ఘోరకృత్యంబుగా మద్యమాంసాది పదార్థంబులు బలు లొసంగి యజింపు
చుండుదురు. ఇట్లనేకు లనేక దైవంబుల ననేక విధంబులుగా నిష్టార్థ
సిద్ధి కొఱకు పూజింపు చుండుదురు. అట్లైనను "సర్వదేవ నమస్కారః
కేశవం ప్రతిగచ్ఛతి" యను వాక్యంబునం జేసి సర్వదేవతల కాచరించు
నమస్కార పూజనంబులు సర్వాత్మకుండవగు నీకే సమర్పణంబగుం
గావున నా యా జనంబు నొనర్చు భక్తిధ్యానంబులకుం దగిన యోగ
మాయా యుక్తంబులైన రూపంబులఁ బ్రసన్నుండవై యా యా జనం
బుల కా యా యిష్టార్థంబు లొసంగుచుండుదు, వదియునుం గాక, గొంద
రధ్యాత్మయోగులు లబ్ధ గురూపదేశులై, పంచముద్రల నభ్యసించి మూలా
ధారాది చక్రగతం బగు నూర్ధ్వ మార్గంబున మనస్సహితంబుగాఁ బ్రాణా
పానాది వాయువుల భ్రూమధ్య స్థానంబున కతిప్రయాసంబుగాఁ దెచ్చి
నిలిపి యచ్చట దృశ్యంబగుఁ జంద్రమండలంబును నిన్నుగా భావించి
తద్దర్శనంబున నానందమగ్నులగుచుండుదురు. కొందరు సద్గురూప
దేశంబునం గృతనిశ్చయులై, జూపునం జూపు నైక్యంబు నొందించి నీల

మేఘ మధ్యస్థంబగు విద్యుల్లేఖ భంగి సర్వభూత చక్షుర్గోచరాంతర్వర్తివై యతి సూక్ష్మ జ్యోతి రూపంబునం దేజరిల్లు నిన్నుం గాంచి కృతార్థులగు చుండుదురు. కొందఱు మితాహార విహార చేష్టులై యేకాంత స్థలంబుల నుచితాసనాసీనులై యింద్రియంబులం జలింపనీక గురూపదేశ లక్ష్యంబున బిందువుం జేర్చి హస్తాంగుళంబుల శ్రోత్ర నాసా రంధ్రంబులు మూసి దశవిధ నాదంబు లాలింపుచు భవత్కళా చిహ్నంబులగు దశవిధ మండలంబుల నాలోకింపుచు నిత్యసుఖం బనుభవింపు చుండుదురు. కొందఱుం బరమ సాత్త్విక భావంబున నిన్ను సర్వభూతాంతరాత్మగాఁ దలంచి సర్వభూతాంతస్థుండగు నతండే తమయందు గలండని సుఖదుఃఖంబుల వలన వికారంబు నొందక నిత్య సంతుష్టులై విహరింపు చుండుదు రిట్లు గురూపదేశ సాధనంబుల నిన్నన్వేషించి కాంచు మహాత్ములందఱు రాజ యోగు లగుదురైనను నద్వితీయంబై యాది మధ్యాంత రహితంబై, యనంత తేజోవిరాజమానంబై నిఖిలవేద కర్మాతీతంబై యిందు నందు ననక సర్వగతంబై మహా సముద్రజల మధ్యంబునం దిరుగు మీనంబుల చందంబున జరాచర వస్తు సహితంబులగు ననేక బ్రహ్మాండంబులు లోపలం దిరుగుచుండ నలలు లేని దుగ్ధాంబుధి వడువున నిశ్చలంబై నిఖిల విలక్షణంబై యతి సూక్ష్మంబయి వెలుంగు నీ నిత్యస్వరూపంబు నెవ్వ డెఱుంగు నతండు రాజయోగి శ్రేష్ఠుం డనందగి భవత్సదృశుండై యాత్మా రాముండై యుండుఁ గావున
53

సీ. లోలతఁ బ్రసరించు లోక వాసన లెల్ల
జ్ఞానానలంబునఁ గాల్చి వైచి
మూడంగముల బాసి మూడవస్థల మీఱి
మూటి కవ్వలి మార్గమున వసించి
నిత్య సంతుష్టుఁడై నిర్మల చిత్తంబు
నానంద వార్ధియం దడగఁజేసి
కనుమూసినప్పుడుఁ గనువిచ్చినప్పుడు
నీ దివ్యరూపంబు నెఱయఁగనుచు
శమదమోన్నతి తోడఁ బ్రశాంతమైన
యగ్ని తెఱఁగున వెలుగొందు నట్టి యోగి

సకల దుఃఖంబులను బాసి సత్యముఁ గను
నిత్యకల్యాణ విధివగు నిన్నుఁ జెందు. 54

తే. గీ. ప్రబలమగునట్టి సంసార పంకమందుఁ
గలసి కలయక మృత్కీటకంబు భాతి
సంచరింపుచు విజ్ఞాన చతురుఁడగుచు
నొనర నిను గన్నవాఁడె పో యుత్తముండు. 55

వ. మహాత్మా! తొల్లి సృష్టి క్రమం బెఱుగుటకై యనేక సంవత్సరంబు లేను తపం బొనర్చినఁ బ్రసన్నుండవై సృష్టించు విధం బుపదేశించితివి. భవత్ప్రసాదలబ్ధుండ నగుటం జేసి మోక్షంబు ముంగిటి కల్పవృక్షంబయ్యెఁ గృతార్థుండనైతి; నెవ్వఁడేనియు సంసారంబునందుండి, దత్సుఖ దుఃఖంబులం బొరయక నిర్వికారుండై భవచ్చరణారవిందంబుల నారాధించు నతండు భవత్ప్రియుండగు; నతనికి ధ్యానమాత్రంబున సాక్షాత్కరింతువు. నిఖిల భక్తజన సులభుండవైన నీకు నమస్కరించి యొక్క విన్నపం బాచరించెద. భగవంతుండు నాత్మారాముండునగు బాలబ్రహ్మేశ్వరున కస్మత్పుత్రికయగు సతీదేవి నొసంగి వివాహం బొనర్చుటకు వసిష్ఠాది మహర్షులీ యాషాఢ కృష్ణపక్షంబున రోహిణీ నక్షత్ర యుక్తంబగు త్రయోదశియందు ముహూర్తంబు నిశ్చయించి యున్నారు; గావున నిక్కార్యంబు సర్వంబు నెరవేర్ప నీవు సమర్థుండవుఁ గాక నితరు లగుదురే యని ప్రార్థించిన ననుమతించి సకల పదార్థంబులు వర్షింప నొక్క కామధేనువు నొసంగి వివాహకాలంబునకు విచ్చేసెదనని యానతిచ్చి యప్పుండరీకాక్షుం డంతర్ధానంబు నొందె; నంత దక్షుండా రాత్రి సుఖ నిద్ర సలిపి మరునాఁ డరుణోదయంబున కాల్యకృత్యంబులు నిర్వర్తించి యనేక బుధజన పరివృతుండై సభామంటపంబు నందుండి పౌర జనుల రావించి వివాహ వృత్తాంతం బెఱింగించి పట్టణం బలంకరింపుఁడని యాజ్ఞాపించిన వారలతి సంతసంబునం జని యప్పుడు. 56

పౌరజనులు దక్షనగరం బలంకరించుట

సీ. ఘనరత్న ఖచిత కాంచన రమ్య గేహముల్
కర్పూర జలములఁ గలయ నలికి
విమల మౌక్తిక వితానముల ముగ్గులఁదీర్చి
తపనీయ రుచిర కేతనములెత్తి
క్రొత్తగా గోడలఁ జిత్తరువ్వులు లిఖించి
యెల్లవాకిళ్ళ బందిళ్ళు వెట్టి
రత్నతోరణములు రమణీయముగఁ గట్టి
యరటులు పుంగిళ్ళ నమరఁ బూన్చి
సకల గోపుర మంటప స్థలములందు
భాసురోన్నత రత్న కుంభములు నిలిపి
సాధు జన బృందములు మెచ్చ వీథులందు
విమల గంధోదకంబులు వెలయఁ జల్లి. 57

క. రథ కరి తురగంబులదగు
విధములఁ గైసేసి రపుడు విభవోజ్జ్వలతన్
బుధులలర నప్పురంబు, వి
బుధనాథుని పురముఁ బోలె పొల్పుఁ దనర్చెన్. 58

తే. గీ. ఇట్టులా దక్ష నగరమందెల్ల జనులుఁ
బొంకముగ నెల్ల యెడల నలంకరింపఁ
జారుతరమైన యొక మహాసౌధమెక్కి
కాంచి దక్షుండు సంతోషకలితుఁ డగుచు 59

వ. ఇట్లు సంతోషించి యా సౌధంబుఁ డిగ్గి సభామధ్యంబున నున్న సమయంబున. 60

సుమిత్ర సుదేవులను బ్రాహ్మణు లలంపురము నుండి
యేతెంచి దక్షునిం గాంచుట

తే. గీ. లలిత మణి భూషణాంబర కలితు లగుచు
పరశుభోద్యోగ సూచక వదనులగుచు

సతులముగ సైంధవా రూఢులగుచు విప్ర
వరులుఁ జనుదెంచి రపుఁడలంపురము నుండి. 61

వ. ఇట్లు విచ్చేసిన యా సుమిత్ర, సుదేవులంగని దక్షుం డత్యంత సంత
సంబునం బొదలుచు నర్ఘ్యపాద్యాది విధులం బూజనంబులు సేయించిన
సభామధ్యంబున వారి నుచితాసనంబుల నాసీనులంజేసిఁ గుశలంబు లరసి
శుభ వృత్తాంతం బడుగ వారలతి మృదుమధుర వచనంబుల నిట్లనిరి. 62

సీ. దేవ! మీ యానతి తెఱఁగున మే మలం
పురమున కతివేడ్కఁ బోయి యందుఁ
జంద్ర కాంతోపల స్థగిత సౌధంబున
నార్యులు సురలు సంయములుఁ గొలువ
భద్రాసనస్థుఁడై ప్రజలఁ బాలింపుచు
నున్నతంబుగఁ గొలువున్న వాని
నొ సదాశివుఁ గాంచి యనురక్తి దండ ప్ర
ణామ పూర్వకముగ నతులొనర్చి
సవినయంబుగ నచ్చటి సభికులెల్ల
నలర నిచ్చటి శుభ నిశ్చయంబుఁ దెల్పి
మీర లొసఁగిన శుభలేఖ మెచ్చుఁదోప
నిచ్చినఁ జెలంగి యాదరం బచ్చుపడఁగ. 63

బ్రాహ్మణు లలంపురంబునం జరుపు శుభోద్యోగాది
లక్షణంబులు దక్షునకుం జెప్పుట

వ. ఆమ్మహాను భావుండగు బాలబ్రహ్మేశ్వరుండుఁ దగువారలచేత మా
కప్పుఁ దర్ఘ్య పాద్యాది విధుల సత్కారంబులు సేయించి యుచితాసనంబుల
నుండ నియమించి యచ్చటి సభికులం గనుంగొని మహాత్ముండగు
దక్షుండు బుత్తెంచిన శుభవృత్తాంతంబు వింటిరి గదా! యందు కేమిఁ
ప్రత్యుత్తరం బనవుఁడు వారల మ్మహాదేవు నాలోకించి దేవా! సర్వ
లోకేశ్వరులగు మీకుఁ బ్రత్యుత్తరం బొసంగ మేమెంత వారలమైనను
వినుండని యిట్లనిరి. 64

క. కరమరుదుగ నీ లోకముఁ
బరిపాలన సేయఁగోరి బాలబ్రహ్మే
శ్వరుఁ డన వెలసిన శివుఁ డవు
దిరముగ మిముఁ గలయఁగోరి ధృతి విద్ధరణిన్. 65

క. సుతయై సతి యనఁగా, నా
తత మతి యగుఁ బ్రకృతిఁ బొడమెఁ దగదక్షునకున్
మతిఁ దలఁప నా సతీమణి
సతి మోదమునన్ వరింప నగు మీ కరయన్. 66

క. అని యిట్లు విన్నవించిన
మనమున హర్షించి శివుఁడు మాన్యత మెఱయన్
వనజ భవ శత మఖాదుల
కనువుగ శుభలేఖలంపెఁ దతివేగమునన్. 67

తే. గీ. వర తపోధనులగు మునివరులఁ బిలువఁ
దగిన వారలఁ బంపెఁడుత్కలిక తోడఁ
బుర మలంకార మొనరింప బుద్ధిమంతు
లైన వారల నియమింపెఁ దనుచుఁ బలికి 68

వ. మఱియు బంధుహిత సామంతాదుల సహకుటుంబ పరివారంబుగాఁ బిలి పింపుండని యా సభామధ్యంబున నున్న యుద్యోగుల కాజ్ఞాపించి యప్పు డంతః పురంబున కేతెంచి మాంగళ్యంగనాది సత్కారంబులు సేయించి, భోజనానంతరంబున దివ్యాంబరా భరణంబు లొసంగి వివాహ ముహూర్తం బునకుఁ దరలి వచ్చెద మింకఁ జనుండని వీడ్కొలిపిన సమ్మహాను భావుని మనంబులం బొగడుచు భవత్సన్నిధానంబున కరుగుఁదెంచితి మనవుఁడు దక్షుండానందభరితుండై వివాహంబునకు వలసిన వస్తుసముదా యంబుల నాయత్తంబుసేయ శిష్యవర్గంబులం బనిచి ముదంబున నుండె నంత. 69

సీ. ఇంద్రాది దేవత లెల్ల నబ్జాసను
కడ కేగి భక్తి సంకలితు లగుచు
మ్రొక్కి తదాజ్ఞచే నక్కాల్వనం
దుచితాసనాసీనులై యాత్మ లలర
నఖిలేశ! దక్షుండు హరునకుఁ దన కూతు
నొసఁగి వివాహంబు నొనరఁ జేయఁ
దలఁచిఁ బెండ్లికి వేగఁ దగరండటంచు
నయముగా శుభలేఖ లంపె మాకు
గాన మీ తోడ నరుగంగఁ గాంక్షఁ జేసి
సారమతి నిచ్చటికి వచ్చినార మనుచు
విన్నవించిన వారల వేడ్కఁ జూచి
పలికె నవ్వాగ్వరుఁడు మంజుభాషణముల. 70

సీ. అఖిల లోకేశ్వరుండైన సదాశివుఁ
బెండ్లికి మనము సంప్రీతిఁ జనుట
మేలగు దక్షుండుఁ జాలతపోధనుం
డతని యాజ్ఞను మీర నలవిఁగాదుఁ
గావున నిది మహత్కార్య మయ్యెనను
వినఁపింతు వినుఁడొక విధముఁ దెలియ
మన తోడ నచటికి మాధవుం డరుగంగఁ
దలఁచునోఁ దలఁచఁడోఁ దెలియవలయు
నమ్మహాత్ముని సన్నిధి కతిరయమునఁ
బోయ యదుగంగ నిఖిలంబు బోధసేయు
ననుచు వారలతో జతురాననుండు
మోదమున నేగె నవ్విష్ణుమూర్తి కడకు 71

శతానందుండు సకలదేవతా సహితుండై నారాయణుని
సన్నిధికిం జనుట

క. చని భోగిరాజ తల్పం
బున లక్ష్మీసహితుఁ డగుచు భువనము లెల్లన్

తన యాజ్ఞలోన మెలఁగగ
ఘనముగఁ గొలువున్న విష్ణుఁగని భక్తిమెయిన్. 72

క. పరమేశ్వర! దామోదర!
కరివరద! కృపా సముద్ర! కల్యాణ గుణా!
కర మురదైత్యాంతక ముని
వర హృదయ సరోజమిత్ర! వారిజనేత్రా! 73

క. అవధారు! దక్షుఁ డలరుచు
భువనంబులు మెచ్చఁ దనదు పుత్రిక నిపుడున్
భవున కొసంగి వివాహము
సవినయముగఁ జేయఁగోరి జతురత్వమునన్. 74

వ. మమ్మందఱ నవ్వివాహంబునకు రండని శుభలేఖల తోడం దగువారలం బుత్తెంచె; నిందు కేమి యాజ్ఞ నొసంగెద, రచ్చటికిఁ దా మరుగం దలంచినం దమ తోడ నరుగుఁదెంచు వారమని విన్నవించిన నమ్మాధవుం డలరి యిందుకు విచారంబుఁ బనిలే దఖిల లోక పూజ్యుం డగు సదాశివుం డస్మత్సఖుండగు. మహా తపోధనుండగు దక్షుం డస్మద్భక్తుండగు; నిక్కార్యం బస్మత్కార్యంబుగా నెరవేర్పవలయుఁ గావున నేను బయనం బయ్యెద. మీ రతివేగంబునం జని సకల బంధు సహితంబుగా నిచ్చటికి రండని యాజ్ఞాపించిన వారలాక్షణంబునఁ దమ తమ నివాసంబులకుం జని సకలాభరణ భూషితులై కుటుంబ పరివార సహితంబుగా రత్నమణి స్థగిత విమానారూఢులై యేతెంచిన నా బ్రహ్మాది దివిజ వర్గంబులం గని సంతసంబున నన్నారాయణుండు 75

బ్రహ్మాది దేవతలతోడ నారాయణుండు వెడలి
దక్ష నగరంబునకు వచ్చుట

సీ. దివ్య మణిప్రభా దేదీప్యమానమౌ
ఘన కిరీటము శిరంబున ధరించి
వజ్రరత్న రచితమౌ చౌకట్లయొంటులు
శ్రవణ యుగ్మమునందు రహినమర్చి

నక్షత్రములఁబోలు నవ్యమౌక్తికహార
సంహతి జారువక్షమునఁ దాల్చి
శత్రు భీకరమైన శంఖ చక్ర గదాది
సాధనోత్కరము హస్తములఁ బూన్చి
హాటకాంబర రుచి దిక్కులావరింప
మహిత వైభవమున రమాసహితుఁడగుచు
గరుడ వాహన మెక్కి లోకములఁ జెలఁగ
వేడ్క లిగురొత్త సమ్మధుద్వేషి వెడలె. 76

వ. ఇట్లు వెడలి నంద సునందాది నిజపార్శ్వ చరులనేకులఁ బలసి కొలువ బ్రహ్మేంద్రాది సకల దేవతా బృందంబులు విమానంబుల నుండిఁ దోడ నేతేర మంగళ మహావాద్యనాదంబులు దిక్కులం బిక్కటిల్ల భూలోకంబున కేతెంచుచు, నప్పుండరీకాక్షుండు పరమేష్ఠిం గనుంగొని యిట్లనియె. నందసునందాదులతోడ నేను దక్ష నగరంబునకుం బోయెద. నీవు సకల దేవతా సహితుండవై యలంపురంబునకుం బోయి యచ్చట నీవ యుపద్రష్టవై సర్వశుభ కార్యంబుల నెరవేర్చుచు వివాహ ముహూర్తంబునకు సకల బంధు పరివార సమేతంబుగా సమ్మహాను భావుండగు బాల బ్రహ్మేశ్వరుం దోడి తెమ్మింక నొక్క విశేషంబుఁ జెప్పెద. స్నాతక కృత్య సమయంబున వటు రూపంబున నే నచ్చటం బొడసూపి యప్పటి కార్యంబుఁ దీర్చి వచ్చెదనని యాజ్ఞాపించిఁ దాను నిజపరివార యుక్తుండై దక్ష నగరంబునకుం జని దక్షుని చేత నధిక సత్కారంబులు వడసి యుండె నంత; నా బ్రహ్మాది దేవతలా రమాపతి యాజ్ఞంజేసి యలంపురంబునకుం బోయి బాలబ్రహ్మేశు దర్శించి, యమ్మహాత్ముం దొనరించు నభివందన పూజావిధానంబులం బరితుష్టులైఁ దన్నియోగంబున సువితానసనాసీనులై యుండి రప్పుఁడు సమ్మునులు సూతున కిట్లనిరి. 77

ఉ. సరస గుణాభిరామ! నిజసైన్యముఁ గొల్వ రమాసమేతుఁడై
మురహరుఁ దక్ష జాద్యమర ముఖ్యుల నెల్ల ననంతవైభవ
స్ఫురణ నలంపురంబునకుఁ బొండని యాజ్ఞ యొసంగిఁ దాను సు
స్థిరమతి తోడ దక్షపురిఁ జేరుట కేమొ యెఱుంగ జెప్పుమా!

సూతుండు పూర్వ పురాణ వృత్తాంతం బొకటి చెప్పుట

వ. అనిన సూతుం డిట్లనియె. తొల్లి యాదికాలంబునఁ బరాశక్తి చేత సృష్టింపం బడిన యండత్రయంబునం దొక దానియందు నీలవర్ణంబున విష్ణుండునుఁ బార్వతియు నొక్కదాని యందు ధవళ వర్ణంబున శివుండును, సరస్వతియు, నొక్కదానియందుఁ బీత వర్ణంబునఁ బితామహుండును, లక్ష్మియు నీ క్రమంబునం బుట్టిరని పురాతన వృత్తాంతంబుఁగలదా క్రమంబు ననుసరించి సతీదేవి తనకుఁ జెలియలనియు, దక్షుండుఁ దండ్రి యనియు, మనంబున విచారించి యమ్మహా విష్ణుం డక్కార్యంబు దక్షుని పక్షంబున నుండి నెరవేర్చుటకై దక్షనగరంబున కతివేగంబునం జనియె; నట్లలంపురంబునన్ బ్రహ్మాదిదేవతలా బాలబ్రహ్మేశ్వరు సన్నిధి నుచితాసనాసీనులై యున్నయెడ 79

తే. గీ. శిష్యవర్గంబు లతి భక్తిఁజేరి కొలువ
హస్తములఁ దీర్థ కలశముల్ శిస్తుఁగులుకఁ
గంథుఁ దలఁచుచు దారాది సహితులగుచు
మునులు నేతెంచి రధిక సమ్మోద మెసఁగ, 80

ఉ. భూతలనాథులెల్లఁ దగ భూషణ భూషితులైఁ త్రిలోక వి
ఖ్యాతములైన వస్తువులఁ గానుకలుఁగాఁగొని మంత్రి సద్భట
వ్రాతము లోలిఁగొల్వ ఘన వాహన చిత్ర రథాధి రూఢులై
యాతత వైభవం బలర నచ్చటికిం జను దెంచి రింపునన్. 81

వ. మఱియుఁ గవి నట గాయక పాఠక పరిహాసకాది సకల విద్యాప్రవీణు లేతెంచి రంత నిఖిల మునిగణ సమేతుండై పద్మగర్భుం డబ్బాలబ్రహ్మేశ్వరున కంజలిఁ జేసి, మహాత్మా! వివాహ ముహూర్తంబునకు శీఘ్రంబునం దరలి పోవలయుఁ; నింక మంగళ స్నానం బాచరించి వేదోక్తంబుగా స్నాతక కృత్యంబు సేసికొనవలయునని విన్నవించి మణిమయంబగుఁ బీఠంబునం గూర్చుండఁబెట్టె; నంత సరస్వతీదేవి మొదలగుఁ బుణ్యాంగనా జనంబులుఁ బరివేష్టించి యప్పుడు. 82

## బాలబ్రహ్మేశ్వరుండు మంగళస్నానం బాచరించి స్వాతక హోమం బొనర్చుట

ఉ. బంగరు పళ్ళెరంబులు శుభంబుగ హస్తములం దమర్చి బల్
రంగుగ రత్నహారములు రంబుల సన్నటనంబు సల్ప, సు
ఘ్వాంగుచుఁ గంకణ క్వణన పుంజము వీనుల విందు సేయ స
త్సంగున కిచ్చి రారతులఁ జయ్యన మంజుల యుక్తిఁబాడుచున్. 83

క. ఉరు తర తూర్యరవంబులు
వరుసం జెలగంగ దేవవనితాఘుణులం
దరు శోభనంపుఁ బాటలు
సరుదుగఁ బాడంగ సద్విజాంగన లంతన్. 84

సీ. కమనీయమైన సుగంధ తైలంబుచే
నలువొంద నభ్యంగనం బొనర్చిఁ
గమ్మతావులఁ గ్రుమ్ము ఘనసార రజమున
నలలితంబుగ మేన నలుగు పెట్టి
స్నానంబు సేయించి జయ్యనఁదడి యొత్తి
పట్టు దోవతి జోడుఁ గట్టనిచ్చి
నుదుట కుంకుమబొట్టుఁ గుదురుగా పసరించి
కర్పూర గంధంబుఁ గలయనల్లఁది

విమల మణి రత్నమయ భూషణములఁ బెట్టిఁ
బుష్పహారంబు ఉరమునఁ బొందుపరిచిఁ
బ్రేమఁ దళుకొత్త హాటక పీఠమందు
నుంచిరప్పుడు సుతులు సముంచితముగ 85

వ. అంత నఖిల దేవముని గణంబు లానందింప నార్యపురోహిత జనంబు లిరుఁ గెలంకులం బరివేష్టింప, జతురా ననుండుఁ దానయాజ్ఞికుండై విధ్యుక్త ప్రకారంబున వేదిక యందగ్ని ప్రతిష్ఠాపనంబు సేయించి వేదోక్తంబుగా నూతనాశ్వత్థ సమిత్సమిద యాజ్యంబుల తోడ శుభ చరు ద్రవ్యం బాహుతి వ్రేల్పింపనప్పుడు భగవంతుం డగ్ని హంత్రాళనుండు

సవ్యధూమయుక్తంబుగా శిఖశిఖల వెలింగె; నంత నా సదాశివుం డార్యాను
మతంబునఁ దండుల గ్రంథి వామకక్షంబునం బూన్చి, దండకమండలు
కృష్ణాజిన ధరుండై, పాదంబుల నుపాసనంబు లమర్చి మునిగణంబు
లిరుగడల నేతేరఁ దీర్థయాత్రాభిముఖుండై గవ్యూంతరంబులఁ గడచిపోవు
చున్న సమయంబున 86

విష్ణుండు వటురూపంబున బాలబ్రహ్మేశ్వరు
సన్నిధిం బొడసూపుట

సీ. కుడురుగా నుదుటిపై కొన గోటఁ దీర్చినఁ
  జిన్నినామపుఁ డాలుఁ జెన్నుఁ గులుకఁ
జంద్రునాచ్ఛాదించు జలదంబువడువునఁ
  జికురముల్ మోముపైఁ జిందులాడ
బహురత్న ఖచితమౌ బంగారు కటకముల్
  పాణి పద్మము అందు భాసిలంగఁ
ధరణిఁ బుట్టి వెలుంగు పరిధి పోల్కినిఁ గటి
  తటమునఁ గనక సూత్రము వెలుంగ

నెదనుఁ బొదలుచుఁ బైడి జన్నిదము మెఱయఁ
బట్టు పుట్టంపు ప్రభ లుట్టిపడఁగ
విమలవారి కలశంబుఁ జేఁబూని వనరుహాక్షుఁ
డచటి కేతెంచె వటురూప మచ్చుపడఁగ 87

వ. ఇట్లు గోవిందుం డచ్చటి జనంబు లాశ్చర్యంబు నొంద వటు రూపంబునం బొడసూపి తీర్థయాత్రోన్ముఖుండై పోవు సద్బాల బ్రహ్మేశ్వరున కడ్డంబై, మహాత్మా! నిఖిలలోక నిలయంబగు భవత్తనువు నంద, నిఖిల తీర్థంబులుఁ దేజరిల్లుచుండఁ దీర్థంబుల సేవింపం బోయెద నన్న వినఁ జిత్రం బయ్యెడు. పరబ్రహ్మంబవైన నీవు లీలార్థంబుగా నీ జగత్కర్మ తంత్రంబుల నంగీకరించితివి. తొల్లి బ్రహ్మాదిసురప్రార్థితుండవై భూలోకంబు నందలి జనంబులఁ గృతార్థులం జేయు నిట్లు వెలసిన సదాశివుండవుఁ గావున నొక్క విశేషంబుఁ జెప్పెద. భావా! మత్సోదరి యగు సతీదేవిని వివాహంబై

సుఖంబున లోకంబులఁ బాలింపుచుండుమనిఁ బ్రార్థించి కలశోదకంబులఁ బాదంబులఁ గడిగి మరల్చి తెచ్చి రత్నపీఠాసనాసీనుం జేసి, దివ్యాంబరాభరణంబులఁ దానుఁ బూజితుండై యమ్మాధవుం డంతర్ధానంబు నొందె; నంత నయ్యీశ్వరుండా వేషంబుఁ బరిత్యజించి బ్రహ్మాదు లుల్లసిల్ల ననేక రత్నమణి స్థగిత కిరీటహార కేయూర కటిసూత్ర కటకాంగుళీయకాది నానా విధ భూషణ భూషితుండై యుదయాద్రి శిఖరంబునం దోచు బాల భానుండునుం బోలె నఖండ తేజోవిరాజమానుండై దేజరిల్లె, నయ్యవసరంబున 88

సుఖాసినీమణులు బాలబ్రహ్మేశ్వరు నలంకరించుట

సీ. శ్రీలతోఁ దులకించుఁ జెలువైన నుదుటిపైఁ
జొక్కపు తిలకంబుఁ జక్క నొత్తి
కమనీయ కర్పూర కస్తూరికా గంధ
మలవడ నెమ్మేనఁ గలయ నలఁది
బసపు కుంకుమ తోడఁ బద పద్మముల యందు
నయ మొప్పఁ బారాయణంబుఁ దీర్చి
యద్దంబులనుఁగేరు నిద్దంపు చెక్కిళ్ళఁ
బోలు పొందఁ గాటుక బొట్టుఁబెట్టి

క్రొత్త పూవుల దండలు గ్రుచ్చి యురము
నందు దిగజారఁ గంఠము నందు వైచి
యంగుళంబుల నెఱ్ఱని రంగు వెట్టిఁ
బొసఁగఁగై సేసి రట్టులఁ బూవు బోండ్లు! 89

వ. ఇట్లలంకరించి శిరంబున సేసలఁ బెట్టిరా సమయంబున. 90

సీ. అకలంకమగు దుకూలాంబరంబులఁ గట్టి
వరరత్న భూషణావళులఁ దాల్చిఁ
బరిమళ గంధముల్ సురుచిరంబుగఁ బూసి
విమల ప్రసూన దామములు ముడిచిః

బరమపావనమైన భవుని కల్యాణంబుఁ
గనఁగల్గె మనకని కాంతిఁ గదలి
పుత్ర పౌత్ర సుహృత్కళత్రాది సహితులైఁ
గరి హయ రథము లుత్కలిక నెక్కి

భవ్యతర భూషణాంబర ప్రతతు లొలిఁ
గానుకలఁ గొంచు భృత్యవర్గమ్ముఁ గొలువ
భూరి వాద్య రవంబులు భోరు కొలుఁ
బౌరు లేతెంచి రధిక సంభ్రమము తోడ. 91

సీ. చారుమౌక్తిక రత్న తోరణావళులచే
రాజిల్లు హాటక రథము లెక్కి
ఘనమణిస్థగితమౌఁ గనకంపు జోళ్ళచే
రమణీయమగు మదేభముల నెక్కి
సొంపుఁదేరెడుఁ గుందనంపు కళ్లెములచేఁ
గొమరుఁ దీరినఁ దురంగముల నెక్కి
మణిమయ ఘంటికా ఘణ ఘణ ధ్వనులచే
దంబుఁ గుల్కెడు శిబికంబు లెక్కి

పూర్వ భవములఁ జేసినఁ బుణ్యమెల్ల
నిశ్చయంబుగ ఫలియించె నేడటంచు
సకల దేశాధి నాథులు సంతసమునఁ
బయనమై నిల్చి రపుడు సంపదలుఁ జెలఁగ. 92

### బాలబ్రహ్మేశ్వరుం డఖిల పరివారయుక్తుండై పెండ్లికి దక్షనగరంబునకుం దరలిపోవుట

వ. ఇట్లఖిల మంత్రిహిత బంధు సామంతాది పౌరజనంబులును, సకల దేశాధీశులగు రాజోత్తములునుఁ బయనంబై దమ తమ పరిజనంబులతోడఁ దగు విధంబునం బొడ సూపిన సంతసించి యబ్బాలబ్రహ్మేశ్వరుండుఁ దనకుఁ బ్రపంచ క్రమంబున గురుండగుఁ బుష్పగిరి శంకరుండుఁ

బుత్తెంచిన విభూతి కుసుమాక్షతంబులతి వినయంబునం గొని, వివాహ
ప్రయాణోన్ముఖుండై శుభ ముహూర్తంబున నంతఃపురంబు వెడలి దివ్య
రథారూఢుండై విబుధ బృందంబులు దారాది బంధు యుక్తంబుగా విమా
నంబు లెక్కి యనేక విధంబుల నుతియింపఁ బుణ్యాంగనా జనంబు లర
దంబుల నుండి సుస్వరంబులం బాటలుఁ బాడుచుఁ గుంకుమ హరిద్రా
చందనాది పరిమళ శోభన ద్రవ్యపూరితంబులైన బంగరు పళ్ళెరంబులు
హస్త పద్మంబుల ధరియించి కంకణ క్రేంకారంబులుఁ జెలంగఁ బుష్పాక్ష
తంబులుఁ జల్లుచుఁ బిలుంద నేతేర, నిఖిల మునీంద్రు లానంద కందళిక
హృదయులై శిష్యప్రశిష్య సంఘంబులుఁ గొలువ శిరంబుల జటా బంధంబు
లుల్లసిల్ల శతాంగంబు లెక్కి యుభయ పార్శ్వంబుల స్వస్తిఁ జెప్పుచుం
బఱతేర, నిఖిలాభరణ భూషితులై బంగరు బెత్తంబులు హస్తంబుల
ధరియించిఁ ప్రమథగాణంబు లతి సంతసంబునం బరాబరులుసేయ,
నఖిల సురజ్యేష్ఠుండగుఁ జతుర్ముఖుండు దక్షిణ భాగంబుననుండి శ్రోత్రా
నందంబులగు వాక్యంబులు గోష్ఠి న్బలుకుచుఁ గైదండ యొసంగ
సహస్రాంబకంబుల నిగన్నిగ లుపకంఠ ప్రదేశంబుల విందుకొన సకల
దేవ వల్లభుండగు శచీవల్లభుండు శ్వేతచ్ఛత్రంబుఁ బట్టి, సింధు యక్ష
నాయకులగు వరుణ, కుబేరు లిరువంకల న్బరివేష్టించి వింజామరంబులు
వీవ బరళు పట్టిస ముద్గర భిండివాల త్రిశూల చక్ర తోమరాద్యాయు
ధంబులు ధరియించి శౌర్యధైర్య స్థైర్యంబులుఁ బిక్కటిల్ల వీర భటు
లనేకులు బలసికొలువ, రత్న కటకంబుల కాంతు లంబరంబు నిండ
హస్తంబులెత్తి జయజయ శబ్దంబుల వందిమాగధ బృందంబులు బహు
వారంబులఁ గైవారంబులు సేయ, మృదంగ తాళాది వాద్య స్వరంబుల
తోడ రంభోర్వశీ మేనకా ద్యప్సరః కాంత లతి నైపుణ్యంబున నాట్యం
బులు సలుప, సకల దేశ్యంబులు, సకల జాత్యంబులు, హాస్యంబులుఁ
జెప్పుచు ననేక పరిహాసకులు వినోదంబులు సలుప, నిట్లపరిమిత వైభవం
బున నప్పరమేశ్వరుం డఖిల పరివారయుక్తుండై యల్లనల్లన మేఘ
మండలంబు వెలువడు నక్షత్ర పరివృతుండగు రాకా సుధాకరుండునుం
బోలెఁ బురద్వారంబు నిర్గమించె; నప్పుడు,

సీ. పృథులమై మిన్నందు భేరీరవంబులఁ
గుల పర్వతంబులుఁ జలన మంద
ఘోరమై చెలరేగు తూర్యనాదంబులఁ
బోరి దిక్కరుల కర్ణపుటము లదర
సలలిత స్యందన చక్ర ఘట్టనములఁ
బృథ్వీస్థలం బెల్ల భేదిలంగ
భటుల వీరాలాప చటుల నిస్వనములఁ
దిన్నగా ధీరుండు భయముఁ జెంద

భూసుర స్వస్తి వాదముల్ పూవుబోండ్ల
పాటల వివాదముల నొక్కఁ బంగిఁ జెలఁగి
దిశలు నిండంగ నపుడు నుద్వేల మగుచుఁ
బ్రీతితో నేగుచుండె నప్పెండ్లి జనము. 94

సీ. చల్లని వాయువుల్ మెల్లగా వీతెంచె
రాజించుఁ బుష్ప వర్షములఁ గురిసె
ఘననదుల్ విమలోదకంబుల రాజిల్లె
ఫలపుష్పయుతములై వనములలరెఁ
గరి ఘోషణంబుల ఘన బృందముఁ జెలంగె
భానుఁడుగ్రంబుఁ బావక వెలింగె
శుకపికంబులు మంజుసూక్తులఁ బ్రకటించెఁ
బుష్ప పరాగము ల్పొదల నెగసె

మెండు కొని భృంగ సంఘముల్ మింటమ్రోసె
సకల పరివార మొగిఁ గొల్వ సంతసమున
మహిత మంగళ యుక్తుఁడై మదనహరుఁడు
మంజులంబుగఁ బోవు నమ్మార్గమందు. 95

వ. మఱియును. 96

క. వన దేవత లెడ నెడగడు
వినయం బలరంగఁ జేరి వినుతింపుచు, స
ద్వన పుష్ప ఫల చయంబులు
ననుపుగఁ గానుక లొసంగి రతి భక్తి మెయిన్, 97

## బాలబ్రహ్మేశ్వరుం డఖిల పరివారయుక్తుండై దక్ష నగరోద్యానంబుఁ బ్రవేశించుట

వ. ఇట్లు సుఖ గమనంబునం బోవుచు, నచ్చటచ్చట దివ్యరసోపేతంబులగు ఫలంబులు భక్షించి మఱియు మృష్టాన్న పానంబులఁ బరితృప్తులై సకల పరివార జనంబులు సంతసంబునం బొదల, నబ్బాల బ్రహ్మేశ్వరుండా రోజు సాయంకాలంబున దక్ష నగరంబు సమీపించి, దత్పూర్వ భాగంబున నిరంతర ఫలదళ కుసుమ భరితంబై యనేక రత్నమణివేదికా సహస్ర కలితంబై నందన వనంబు భంగిం దేజరిల్లు నుద్యానంబుఁ బ్రవేశించి సకల దేవ ముని బంధు హిత మంత్రి సామంతాదుల తోడ నుచిత క్రమంబున నాసీనుండయ్యె; నప్పు డఖిల సేవకు లతిముదంబునం భేరీ మృదంగ తూర్యాది వాద్యంబు లొక్క- మొగి మ్రోయించి రయ్యవసరంబున. 98

ఉ. కరుగుణవార్ధి శంభుఁడు సుహోత్ర సుబాహు లనంగ నొప్పు భూ
సుర వరులం గనుంగొని విశుద్ధ మతింజని మీర లింక భా
సురముగఁ గొల్వు కూటమున శోభిల దక్షునిఁ గాంచి మేము స
త్వరముగఁ దర్లి వచ్చిన విధంబు సమగ్రముఁ దెల్పిరండనన్. 99

చ. అనవుఁడు వారలప్పుడు రయంబున నప్పురిఁ జేరి దక్షునిన్
వినయము తోడఁ గాంచిఁ గడువేడుకతోఁ బరివారయుక్తుఁడై
ఘనముగ శంకరుం డిదె సుఖంబుగఁ బెండ్లికిఁ దర్లి వచ్చి యు
ద్వనమున నున్నవాఁడు భటవర్గముఁ గొల్వఁగ నందుఁ జెప్పినన్. 100

ఉ. అప్పుడు దక్షుఁ డందర బ్రియంబుఁ జెలంగగఁ జూచి శంకరుఁ
డొప్పుగఁ దర్లి వచ్చె నిక నుజ్జ్వలత న్మనమేగి సంతసం
బుప్పతిలంగఁ బూజనము లున్నత రీతి నొనర్చి యా ఘనున్
చొప్పుగఁ దోడి తేవలయు సుందరత న్పరివార యుక్తుగన్. 101

చ. అని సభ మెచ్చఁ బల్కి వినయంబున నచ్యుతు తోడ నాక్రమం
బనువుగ విన్నవించి సతినంచిత రీతి నలంకరింపు డం
చని, తగువారి బంచి యపుఁ డార్యపురోహిత బంధుమిత్ర స
న్ముని నికరంబు లోలిఁ గడుమోదమునం దన వెంట దర్లగన్. 102

ఉ. మంగళ తూర్యముల్ మెఱయ మానుగ భూషణ భూషితాంగలై
యంగన లెల్ల శోభన పదార్థ చయంబులు నించినట్టి బల్
బంగరు పళ్లెరంబులు శుభంబుగ హస్తములన్ ధరించి యు
ప్పొంగుచుఁ దోడరాగ వరపూజ యొనర్పఁగ బోవుచుండగన్, 103

క. నంద సునందాదులుఁ బలు
చందములం గొలువఁ గార్యసాధకుఁడై యా
నందంబుగ హరి దక్షుని
ముందర నేతెంచె నిఖిలముని సంఘముతోన్. 104

వ. ఇట్లు అంత శుభప్రదుండగు ముకుందుండుఁ గార్యధురంధరుండై యగ్రభాగంబునం జనుదేర దక్షుం డఖిల పరివార సమేతుండై భేరీమృదంగ తూర్యాది మంగళ వాద్యరవంబులు సెలంగ నగరంబు వెడలి ఘృతతైల సిక్తంబులగుఁ గరదీపికా సహస్రంబులు వెలుంగ రంగుమీఱు శృంగార వనంబున కేగి యచ్చట దివిజముని వర్గంబు లిరుగడలఁ బరివేష్టింప నిఖిల బంధుహిత మంత్రి సామంతాది జనంబు లధిక భక్తిం గొలువ, మణిమయం బగు విశాలవేదిక యందుఁ జిత్రాసనాసీనుండై యున్నఁ బరమేశ్వరున్గాంచి చేరంబోవ నప్పు డుభయ సభికు లన్యోన్య నమస్కారాలింగనంబులం బరితుష్టులై యఖిలలోక పూజ్యుండగు నిందిరారమణున కందరు దండప్రణామంబు లాచరించి తదాజ్ఞ నుచితాసనంబుల నుండిరంత, బరమేష్ఠి మంత్రంబులు నొడువఁ బ్రసూతి మొదలగు నంగనామణు లతి సంభ్రమంబున నవ్యచందన ప్రసూన హరిద్రా కుంకుమాక్షతంబుల నప్పెండ్లికొడుకగు బాలబ్రహ్మేశ్వరున్ పూజించి నూతనంబగు జరీయుత్తరీయంబు భుజంబులపై నుంచి రయ్యవసరంబున. 105

క. కరివరదుని యనుమతిఁ గొని
నిరుపమ హర్షంబు తోడ నిర్జరనాథుం
డురుభద్ర గజముపై న
వ్వర హరుఁ గూర్చుండబెట్టెఁ బొలుపుఁ దలిర్పన్. 106

తే. గీ. చారుతర మౌక్తిక చ్ఛత్ర చామరంబు
లొప్పఁ దాల్చి నిర్జరు లోలిఁ గొలువ

నుదయగిరి నెక్కు చంద్రుతో నుద్ది యగుచుఁ
బరఁగ నా భద్రగజముపై భవుఁడు మెఱసె. 107

క. గరుడారోహకుఁడై బుధ
సురముసు లిరుగడలఁ బొగడ సురుచిర లీలన్
మురహరుఁడు వలపటన్దన
బరివారముఁ గొలువఁ గదలెఁ బరమప్రీతిన్. 108

క. మురహరుని యాజ్ఞఁ గొని జను
లరుదంద మరాళ వాహవారూఢుండై
పరమేష్ఠి గదలె దాపట
వరముని సంఘంబుఁ దను సవాక్యతఁ గొలువన్. 109

వ. అంత నఖిల పరివారంబు దివ్యవిమాన గజ హయ స్యందన బృందంబుల తోడ నొక్క మొగి నడలె; నట్టియెడఁ గర్పూర దివిటీ సహస్రంబుల కాంతులు భూనభోంతరంబు నిండి పట్టపగలుగా నాచరింప నప్పుడప్పుర కాంతా జనంబు లతికాంతబులగుఁ జంద్రకాంత సౌధంబు లెక్కి మంగళాలంకారంబు తోడ మహాజన మధ్యంబున భద్రగజా రూఢుండై వచ్చు నా సదాశివుం గనుంగొని మంతంబున నిట్లనిరి. 110

సీ. ఇతఁడెపో, యఖిలదేవతలకు మేటియై
బొగడఁదగ నట్టి పురుషవరుఁడు
నితఁడెపో, భక్తుల కిరవంద నిష్టార్థ
సముదయంబు లొసంగు సద్యశుండు
నితఁడెపో, త్రిపురంబు లేర్చి లోకంబులఁ
దగఁ బ్రోచినట్టి సద్ధార్మికుండు
నితఁడెపో, యోగీంద్ర వితతి చిత్తంబుల
సంచరించెడు మహాసాత్వికుండు
నిట్టి దేవుండుఁ బెనిమిటో నట్టి తపము
మన సతీదేవి యే భవంబున నొనర్చె
నో యటంచును బురకాంత లొనరఁ గూడ
నిందు వేడుకఁ గీర్తింపుచుండ నపుడు 111

సీ. వలనొప్ప నఖిల సువాసినీ మణులెల్లఁ
దరుచుగాఁ గుసుమాక్షతములఁ జల్ల
భూసురోత్తములెల్లఁ బొలుపొందఁ దీరి
సుస్వరముతో మంగళ స్వస్తిఁ జెప్ప
భేరీ మృదంగాది పృథువాద్యంబులు
నింపుగా భటులు మ్రోయింపుచుండ
రంభాది దివ్యాప్సరః కాంతలగ్ర భా
గంబున రుచిర నాట్యంబు సేయ
గంధవడి యుభయ సఖులు గలసి మెలసి
గుప్పు గుప్పునఁ బిడికిళ్ళఁ గుప్పుచుండ
వందిమాగధు లుత్సాహ మందిఁ బొగడ
విరుఁగడలఁ గంచుకులు బరాబరులు సేయ. 112

వ. ఇట్లు దక్షుం డఖిల పరివార యుక్తంబుగ ననంత కల్యాణ గుణపరిపూర్ణుం డగు నబ్బాల బ్రహ్మేశ్వరుం దోడి తెచ్చి

దక్షుండఖిల పరివార యుక్తంబుగా సదాశివునిఁ
గల్యాణ మంటపంబునకుఁ దోడి తెచ్చుట

రమ్య స్ఫటిక సోపాన సమూహ దేదీప్యమాన ద్వార చతుష్టయాంచితంబును, రుచిర వజ్ర వైడూర్య గోమేధిక స్థగిత శాతకుంభ స్తంభ సహస్ర సంభృతంబును, విమల చంద్రకాంత నిబద్ధ మంజులోజ్జ్వల కుడ్య విరాజితంబును, మరకతమణి సముదయ స్యూత గగన కషచ్చామీకర కేతన పరివృతంబును, గారుడోపల నిబద్ధ ధర్మవేదికా వితాన శోభితంబును, విమలోన్నత చారు మౌక్తిక రంగవల్లీ విరాజమానంబును, రమణీయ ప్రభా పుంజ రంజిత దివ్య మాణిక్య తోరణాలంకృతంబును, రవి కాంతి కాంత శాతరూప సింహాసన సహస్ర విభ్రాజితంబును, బలభిదుపల రాజికాష్టాపద కుంభ సంఘాత మండితంబును, జందనా గరు కర్పూర కస్తూరికా పరిమళ ద్రవ్య పాత్ర కదంబక పూరితంబునగుఁ గల్యాణ మంటపంబున విడి దించె నప్పుడు, చతురాననుండుఁ గ్ధిదండ మొసంగి యల్లన నక్షో

శ్వరుం దోడి తెచ్చి రుచిర రత్న మణిమయంబగు గల్యాణవేదిక యందుఁ బ్రాఙ్ముఖుండుగా నాసీనుం జేసె. అంత నంద సునందాది నిజ పార్శ్వచర బృందములతోడ నారాయణుండును, సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాత, నారదాదులతోడఁ బద్మసంభవుండును, వైశ్వానర, దండధర నైఋతి వరుణ వాయు కుబేరులతోడ నింద్రుండును, దేవ యక్ష కిన్నర గంధర్వ గరుడ సిద్ధసాధ్య విద్యాధరాదులును, వసిష్ఠ కణ్వ కశ్యపాంగిరస కౌశిక భరద్వాజ గౌతమ శాండిల్య మౌద్గల్య భృగ్వత్రి చ్యవన వరతంతు కౌత్స జాబాలి మంకణ మతంగ కాత్యాయన వామదేవ విభాండక జమదగ్ని కుంభసంభవ మార్కండేయ దూర్వాస గార్గేయ రోమశాది మహామునులును, వంగాంగ కళింగ బంగాళ కాశ్మీర కాంభోజ కుంతల కొంకణ మత్స్య పుళింద నేపాళ గాంధార సింధు సౌవీర కర్ణాట వరాట లాట మగధ మళయాళ ద్రవిడ చోళ కురు ఘూర్జర కేరళ కోసలాది సకల దేశాధీశులగు రాజోత్తములును, దేవముని భూసుర క్షత్రియాంగనా సముదయంబులును, బంధుహిత మంత్రి సామంత భూసురార్యజనంబులును బరివేష్టింప ననేక పరిచారజనంబు లధిక భయ భక్తులం జేరి యుపదిగంబులు సలుప, భేరీ మృదంగ వేణు కాహళ శంఖాది వాద్యంబుల నేవాజన స్తోమంబులు మ్రోయింప, బరిహాసక జనంబు లఖిల జాత్య హాస్యంబులఁ బ్రకటింప, రంభోర్వశీ మేనకా తిలోత్తమాద్యప్సరః కాంతల వ్యక్త మధుర గానంబు లలర నాట్యంబులు సలుప, సుగంధ తైల దీపికా సహస్రంబులు రత్నమణిమయ స్తంభ కుడ్యాదులన్ బ్రతి ఫలించి నేత్రంబులకు మిఱుమిట్లుఁ గొలుప నక్కల్యాణ మంటపంబు గోటి చంద్ర ప్రభా భాసమానం బయ్యె నయ్యెడ. 113

## సతీ బాలబ్రహ్మేశ్వర కల్యాణము

క. పరమేష్ఠి భృగుమహర్షులు
గురుతర వేదోక్తవిధి నకుంఠితము గన్
వరవైవాహిక తంత్రము
బరుదుగ నొనరింపుచుండి రార్యులు మెచ్చన్. 114

వ. అప్పుడు 115

చ. వలపిన వస్తుసంతతులవారిగఁ గొట్టిడి కేగి తెచ్చి, మి
త్రులు నొడగూర్ప నందముగఁ దొయ్యలు లల్లన శోభనంపు పా
టలు మదువంగ దక్షుఁడు దృఢంబుగ నా శివుఁ బూజసేసి మం
జుల మధుపర్కమిచ్చె మధుసూదనుఁ డాత్మఁ జెలంగి చూడగన్ 116

వ. ఇట్లు మధుపర్కంబొసంగి దక్షుండా సదాశివు నారాధింపుచు నెదుట
నూర్చుండె; నంత ధాతృ భృగువులు విధ్యుక్త ప్రకారంబునం దెరపట్టి
రయ్యవసరంబున దక్షానుమతం బెలింగి లక్ష్మి సరస్వతీ శచీ ప్రముఖాం
గన లంతర్గృహంబునకుం జని యచ్చట నిఖిల మంగళాకార యుక్తయైఁ
గీరవాణి మొదలగుఁ జెలికత్తియ లిరుగడలం గొలువ రతనంపు గద్దియ
నున్న పెండ్లికూతురగు సతీదేవిం దోడి తెచ్చి రప్పుడు 117

సీ. చెలువొంద నుదుటఁ దీర్చిన కుంకుమపుఁడాలు
వజ్రకుద్యము లందు వన్నె లీన
శ్రవణ యుగ్మము నందుఁ జెలఁగుఁ గమ్మల కాంతిఁ
బసిడి కంబములందుఁ బ్రతిఫలింప
రహినురంబునఁ గుల్కు రత్నహార ప్రభల్
గుప్పున జనముపైఁ గప్పుకొనఁగఁ
బదకంజముల మ్రోగుఁ బసిడి యందెల దీప్తిఁ
బొంకమై ధరణి నలంకరింప

నల్లనల్లనఁ దెరమాటు కపుడు వచ్చి
జనకుఁడగు దక్ష దక్షిణోత్సంగమందుఁ
జారుతరముగఁ గూర్చుండె సంతసమున
నా సతీదేవి సభవార లభినుతింప 118

వ. ఇట్లు పెండ్లికూతురగు సతీదేవి పుణ్యాంగనా జనంబులఁ బరివేష్టింపఁ జెలి
కత్తియలఁ గొల్చిరా నేతెంచి మేఘబృందంబు మాటున మెలంగుఁ జంద్ర
రేఖ చందంబున యవనికాభ్యంతరంబున దక్షుని దక్షిణోత్సంగంబు
నందున్న యెడ నా ధాతృ భృగువులఁ గ్రమంబున నుభయ వక్షంబులం

ప్రవరగోత్ర సూత్ర నామధేయంబులఁ బ్రస్ఫుటంబుగఁ బఠియించి
గన్యాదానంబునకు మహాసంకల్పంబు సేయించి దప్పుడు .. 119

సీ. శ్రీకరంబగు సదాశివుని పాదద్వయం
బపరంజి పళ్లెరం బందునునిచి
భార్యఁ బ్రసూతి సద్భక్తితో బంగారు
కలశంబుఁ జేఁబూని జలము వోయఁ
బ్రక్షాళన మొనర్చిఁ బరగు గంధాక్షత
పుష్పబృందంబులఁ బూజ సేసి
"కన్యాం సదా జగద్ధన్యా మిదానీం ప్ర
దాస్యామితే శుభదా"యటంచు
నిర్మల జ్ఞాన నిష్ఠుఁడై నేర్పు మెఱయ
సకల లోకేశుఁడైన యా శంకరునకు
దక్షుఁ డప్పుడు బేర్మితో ధార వోసెఁ
గుసుమ వర్షం బవార్యమైఁ గురియు చుండ. 120

వ. ఇట్లఖిల లోక పూజ్యుండగు సదాశివునకు దక్షుం డతి సంతసంబున ననేక రత్నమణి స్థగిత భూషణంబులతోడఁ గన్యాదానంబు సేసిఁ దోడన నిఖిలాలంకార యుక్తంబులై నిరంతర క్షీరధారాప్రదంబులై సవత్సంబులైన ధేను గణంబుల నొసంగి వెండియు 121

దక్షుండు సదాశివున కనేక రథ గజాశ్వాదుల నిచ్చుట

సీ. ఘనరత్న రుచిరకేతన విరాజితములౌ
దండైన యరదముల్ రెండువేలు
ధవళోజ్జ్వల చ్చతుర్దంత సుందరములై
నలువొందు గజములు నాల్గువేలు
మంగళప్రదమైన మంజు చిహ్నంబుల
నటియించు హయ లిరునాల్గువేలు
నిఖిల కార్యములందు నిపుణులౌ సద్భట
వీరులఁ బదునారువేల షండి

నప్పుడా దక్షుఁడ శివున కర్పణంబు
సేసె సభవార లిది మహాచిత్ర మనుచు
వినుతు లొనరింపు చుండ నవ్విధి భృగువులు
సంచితంబుగ నత్తెఱ వంచిరపుడు. 122

వ. తత్సమయంబున. 123

తే. గీ. ఒప్పుఁ గుల్కెడు శివు నేత్రోత్పలంబు
లా సతీ ముఖ చంద్రోదయమున నలరె
నా సతీదేవి చూడ్కులు శివు పాద
కమలములఁ దేటి తండంబు గతి జెలంగె. 124

తే. గీ. వరసతీ ఘన సౌందర్య వార్ధియందు
మెఱసె శివు చూపు లెదురెక్కు మీలనంగ
బరగు శివు దేహకాంతి ప్రవాహమందు
సొరిదిఁ బద్మంబులన భామ చూపులలరె. 125

క. ఇందునిభ వదన లప్పుడ
మందంబుగనేగి రమ్యమౌక్తికములు బల్
కుందనపు పళ్ళెరంబుల
నంద బుగ నించి తెచ్చి యందిచ్చిరొగిన్. 126

తే. గీ. ఎసఁగ నమ్ముత్తియములు దోయిటను బూని
శివుఁడు సంతసమున సతీ శిరమునందు
బోయు నవి మేనఁ జారుచుఁ బొలుపుఁదాల్చె
వన్నె కెక్కిన యమునా ప్రవాహ మనఁగ. 127

తే. గీ. అప్పు డభవుని శిరము నందతివ బోయఁ
జారు ముత్యంబు లల్లన జారి మెఱసె
సొంపుఁ దళుకొత్త దజ్జటా జూటమందు
వడిగ వెడలెడు గంగా ప్రవాహ మనఁగ. 128

వ. అయ్యవసరంబున సదాశివుం డా సతీదేవి కరంబు పట్టిఁ దన పీఠంబునం జేర్చుకొనియె; నిట్లవ్వధూవరు లేక పీఠంబున నుండ నప్పుడు మాధవాబ్జభవ పురంధర వైశ్వానర.

## సతీ బాలబ్రహ్మేశ్వరుల కందఱుఁ దామఁ దెచ్చిన కానుకలు సమర్పించుట

దండధర నైఋతి వరుణ వాయు కుబేర లతి సంతసంబున ననేక దివ్యమాల్యాంబరా భరణంబు లొసంగి రంత, దక్కిన దేవతలును, బంధు మిత్ర మంత్రి సామంతాదులును, సకల దేశాధీశులగు రాజన్యు లును, దామఁ దెచ్చిన దివ్య వస్త్ర భూషణ ధనంబు లతి మోదం బున సమర్పించి రా సమయంబున నారాయణుండు వ ఱియు నొక్క దర్శ నీయంబగు మౌక్తిక హారం బయ్య భవున కొసంగిన నతండద్దామంబు నత్యాశ్చర్యంబునఁ గొంతఁ దడవుఁ గనుఁగొని మోహంబున భార్యయగు సతీదేవి కిచ్చిన నమ్మగువ యల్లనం బతి ముఖారవిందంబు వీక్షించి, గనుసన్న వడసిఁ దన సమీపంబున నున్నఁ బ్రియులగుఁ జెలికత్తియల యందఱి ప్రియయగుఁ గీరవాణి కంఠంబున నుంచె; నప్పు డఖిల జనంబు లా కీరవాణి పుణ్య విశేషంబు లనేక విధంబులఁ గొనియాడి రా సమ యంబున. 129

క. హోమాది కార్యములఁ గడు
నేమంబునఁ దీర్చె శివుఁడు నిర్మలమతియౌ
భామామణిఁ గూడి బుధ
స్తోమము మెచ్చంగ నపుడు సురుచిర లీలన్. 130

వ. ఇట్లు ముహూర్తానంతరంబునఁ దక్షుఁ డత్యానందమగ్నుం డగుచు భోజనంబు లకు విచ్చేయుండని యందఱ నాహ్వానింప ననుమతించి సతీ బాలబ్రహ్మే శ్వరుల తోడ సభావార లంద ఱక్కల్యాణ మంటపంబు వెలువడి, నిఖిలా లంకార శోభితంబును, వివిధ రత్నమణి స్థగిత హాటక స్తంభ సుంద రంబును, సుగంధ తైల దీపికా సహస్ర విరాజమానంబు నగు భోజనశాలం కరిగి యచ్చట మడుంగు పట్టుపుట్టంబుల ధరియించి కనకాసనంబుల నుండి రంత, నా సతీసదాశివుల నిందుకాంత పీఠాసనాసీనులం జేసి సువా సినీజన సహస్రంబు లిరుగెలంకుల రతనంపు గద్దియలం గూర్చుండి రయ్యవసరంబున. 131

## సతీ బాలబ్రహ్మేశ్వరులం గూడి యందఱు భోజనంబు సేయుట

తే. గీ. కామధేనువు వర్షించు ఘనపదార్థ
జాలములఁ బళ్లెరంబులఁ జాలఁగొనుచు
స్వర్ణరంభా పలాశ సంచయములందుఁ
దొయ్యలులఁ గూడి వడ్డింపఁ దొడఁగి రర్థి. 132

సీ. గుణహాశిగణ వడల్ కొమరైన మండిగ
లతిరసంబులు దేనె లప్పడములు
వడియముల్ గారెలు వఱ్ఱు వప్పులు
కర్జకాయ లిడ్డెనలు జొక్కంపు లడ్లు
సారాన్నములఁ గాయకూరలు బచ్చళ్ళఁ
గమ్మని పొళ్ళు బొంతమగుఁ బాలు
సద్యోఘృతంబులఁ జారులు మీగడల్
పానకంబులు మోర్లుఁ బాయసములు

బడిదములు నూరగాయలఁ బనస తొలలు
నాదిగా గల సకల పదార్థ సమితిఁ
బళ్లెరంబుల నిడుకొనిఁ బణతు లపుడు
తీవిఁ దణ కొత్తఁ దీరి వడ్డించి రెలమి. 133

ఉ. ఎక్కడి పిండి వంటకము లెక్కడిఁ జిత్రపు కూరలిట్లు మే
మెక్కడఁ గాన మంచని నుతింపుచు శ్రీహరి శంభుకీర్తనల్
చొక్కపు రాగరీతులను శ్లోక కదంబముగాబఠింపుచు
న్నెక్కుడు వేడ్కతోడ భుజియించిరి యొక్కట భూసురోత్తముల్. 134

ఉ. బంధురమౌ సతీశివుల పంక్తిఁజెలంగుచు వంతులూని బల్
నందడి మీర బాటలతి చాతురితోడ బుధాళి మెచ్చ ని
ష్యంద మరంద బిందువుల చందము సన్మధురోక్తి బాడుచున్
చందన గంధు లెల్లఁ గడు సంతస మొప్ప భుజించి రత్తఱిన్ 135

వ. ఇట్లు కామధేను ప్రవర్తితంబులగు సకల పదార్థ భోజనంబులఁ బరితృప్తులం జేసి దక్షుం డనంతరంబ తాంబూలంబు లొసంగినం గైకొని యందఱు నంతసింపుచు నున్నత ప్రదేశంబున నుచితాసనంబులం బవ్వళించి రిట్లైదు దినంబు లమ్మహా ప్రకృతిపురుషు లగు సతీ బాలబ్రహ్మేశ్వరుల నానందంబునం జూచుచు మజ్జన భోజన తాంబూల సన్మానాది కృత్యంబులం బరితుష్టులై సుఖంబున నుండి రంత. 136

సీ. వెలయంగ నెచ్చోట విననట్టి సుప్రసం
గంబు లచ్చోట సౌఖ్యంబుగ విని
యున్నదే నరలోన నెఖ్ఖఁగవి క్షిత హా
స్యంబు లా నరలోన జాల నెఖిగిఁ
బొలుపొంద నెక్కడఁ భుజియింపని రసాన్న
తతులెల్ల నక్కడఁ దగ భుజియించి
యరసి యచ్చట గాంచ నతిదుర్లభుండైన
యమ్మహాదేవుని నరుఁ గాంచి
వితతమగుఁ బూర్వకృత తపోవ్రతము లెల్ల
నంచితంబుగ నేడు ఫలించె ననుచు
సకల జనములు సంతోష సహితముగను
ప్రియముఁ దళుకొత్త నుండి రప్పెండ్లిలోన. 137

వ. ఇట్లవ్వివాహంబుఁ బరిపూర్ణం బగుటయు, దక్షుండామోద భరితుండై కేశవాబ్జ భవ పురందరాదుల నతి వినయంబున దివ్య వస్త్ర గంధ మాల్యాభరణంబులు నర్పించి, యనంతరంబ నిఖిల ముని భూసురోత్తముల వధూ యుక్తంబుగ రావించి యనేక వస్త్రాభరణ ధనంబు లొసంగి, నిఖిల దేశాధీశులగు రాజన్యుల కధిక సన్మాన పూర్వకంబుగా ననర్ఘ్యాంశుక రత్నాభరణంబు లొసంగిఁ దక్కిన యాచక సముదయంబులకు వలసిన వస్తు వాహన ద్రవ్యంబు లపరిమితంబుగ బహుమానంబులు సేసి యప్పు డట్లిం ద్రగు సదాశివు నతి సంతసంబునం బూజించి యాద బిడ్డయగు సతీదేవి

కనేక సుబుద్ధు లుపదేశించి యుపరూపంబులగు వస్త్రాభరణంబు లనేకంబు లొసంగి గృహ ప్రవేశంబున కా సదాశివుని తోడ నలంపురంబునకు బయనంబు సేయ నప్పుడా సతీలలామ దల్లిదండ్రులకు నగ్రభగినీ సముదయంబున కభివందనంబు లాచరించి వీడ్కొనియె. 138

## సదాశివుండు సతీసహితుండై భక్తాదులతోడ నలంపురంబునకు వచ్చుట

వ. అంత నబ్బాల బ్రహ్మేశ్వరుండు వధూ సహితుండై పద్మనాభాబ్జ భవ పురందరాదులతోడ నచ్చట నున్న సకలవార లందఱు దివ్య విమాన స్యందన కరి తురంగ శిబికా రూఢులై తన వెంటనేతేర నత్తమామలగు బ్రసూతి దక్షుల నభివందన పూర్వకంబుగ వీడ్కొని దివ్యరథారూఢుండై, ఛత్ర చామరాందోళికంబు లిరు గెలంకుల మెఱయ భేరీ మృదంగ కాంస్య కాహళ వేణు మురజఝర్ఝర పణవ డిండిమాది మంగళ వాద్యంబులు మ్రోయ సువాసినీ జనంబులు జల్లు కుసుమాక్షతంబులతోడ బుష్ప వర్షంబు గురియ నెదనెద రంభాద్యప్సరః కాంతలు నృత్యంబులు సలుప వందిమాగధులు జైవారంబులు సేయ నఖండ వైభవంబునం గదలి సుఖంబున నచ్చటచ్చట రుచిరాన్న భోజనంబులు సేయుచు దిన్నని ప్రయాణంబున మూడవ దివసాంతంబున కలంపురంబు సమీపించి పురద్వారంబు చేరవచ్చు సమయంబున. 139

చ. మదనుని బాణ జాలముల మాడ్కి జెలంగుచు నప్పురాంగనల్
పదముల రత్నహార గణ చారు విగన్నిగ లల్లనల్లనన్
కుదురుగ గబ్బి గుబ్బలను గోమున నన్నటనంబు సల్పగా
నెదురుగ దెచ్చి రారతులు నింపు దలిర్పగ నప్పురారికిన్. 140

సీ. అంతః పురాంగన లందమౌ మేడ
లందుండి పుష్పాక్షత లోలి జల్ల
భాసురం బైనట్టి భూసురాశీర్వాద
భూరి నినాదముల్ బొలుపు మిగుల

బుధాంగనా జను లగణ్యంబుగ వచింప
　　　బాటల రవము నభంబు నిండ
గపురంపు దివిటీల కాంతులు దిశలందు
　　　బ్రమరంబులై బట్టపగలు సేయ
రమ్యతరమైన శుభవాద్య రవము లెల్ల
దఱచుగానుబ్బి భూనభోంతరము నిండ
విహితమగు లగ్నమున వధూ సహితుఁడగుచు
నాత్మవిలయంబుఁ జేరె నయ్యభవుఁ డపుడు, 141

వ. ఇట్లమ్మహాదేవుం డఖిలాలంకార యుక్తంబగు నాత్మమందిరంబుఁ బ్రవే
శించి యారాత్రి యందరతోడ భోజనాది కృత్యంబులు నిర్వర్తించె నంత
సువాసినీ జనంబు లతి సంతసంబునం జని విచిత్ర చంద్రకాంత మణి
మయంబును, సుగంధ తైల దీపికా వితాన విరాజమానంబునుఁ, బరిమళ
ధూప ధూమ సంవాసితంబునగు నంతర్గృహంబున 142

## బాలబ్రహ్మేశ్వరుండు సతీ సహితంబుగా నంతర్గృహంబునఁ బవ్వళించుట

సీ. పద్మరాగపు కోళ్ళఁ బట్టె మంచము నందు
　　　బసఁ గుల్కెఁ దెలిపట్టు పరుపుఁ బరచి
గపురంపు రజముఁ బొంకముగ నంతటఁ జల్లిఁ
　　　బరిమళ కుసుమముల్ పైన నెరపి
సన్నంపు కుంచలఁ బన్నీరుఁ జిలికించి
　　　మూపైన మృదులోపధానము లిడి.
సారహీర వితాన తోరణంబుల తోడ
　　　ఘనతరంబుగ మేలు కట్టమర్చి
పాట లల్లనఁ బాడుచు పీటుఁ దనర
మురువుఁ దళుకొత్త నవ్వధూవరుల నపుడుఁ
దోరమగు వైభవంబునఁ దోడి తెచ్చి
భవ్యతరముగ మంచపు రవ్వ నందు 143

వ. ఇట్లుఁ బుణ్యాంగనామణు లయ్యాదిమ దంపతులగు సతీ బాలబ్రహ్మేశ్వరులఁ
గేళికా గృహంబునకుఁ దెచ్చిఁ జెన్నుమీఱుఁ బూలపాన్పునం
గూర్చుండఁబెట్టి యున్నపుడు 144

సీ. నిద్ధంబులైనట్టి నిలువుటద్దంబులఁ
గరమొప్పు నగ్రభాగమున నునిచిఁ
బరిమళ గంధంబుఁ బన్నీటి పదునుచే
నంగుమీఱఁగ శరీరముల నలఁది
మల్లికాకుసుమ దామము లురంబులఁ జార
నల్లనఁ గంఠంబు లందు వైచిఁ
దపనీయ తాళవృంతమ్ముల మెల్లన వీచి
వలనొప్పు రుచిర వివాహ లోనఁగి

యాళ్లుఁ గైకొనిపోయి రయ్యతివ లంతఁ
జెలువుఁ దళుకొత్త నా సతీశివులు మంజు
గోష్ఠు లలరంగ రతులచేఁ గూడి మెలఁగి
జెలఁగి సుఖనిద్ర సల్పిరి సలలితముగ. 145

వ. ఇట్లఖిలలోక గురుండగు బాలబ్రహ్మేశ్వరుం డమ్మహాప్రకృతి యగు సతీ
దేవితోడ నిష్టాలాప తాంబూలచర్వణ రతిక్రీడాది వినోదంబుల నానం
దంబు నొంది యా రాత్రి యొక్క క్షణంబుగ సుఖనిద్ర సేసి మరు
నాఁడు ప్రభాతంబున వందిమాగధులు మంగళవాద్య గీతంబుల మేలు
కొలుపన్నయ్యన లేచి కూర్చుండి యంతకుమున్న లేచిఁ దన కెదుట నిలిచి
యున్న సతీదేవి నిద్దంపు చెక్కుటద్దంబులం దన మంజులంబగు
రూపంబుఁ గాంచి, యల్లనన్ పాన్పుఁ డిగ్గి కాల్యకృత్యంబు లగు స్నాన
సంధ్యానుష్ఠానోపాసనాదులఁ దీర్చి దివ్యగంధ మాల్యాంబరాభరణభూషి
తుండై నిఖిలముని భూసురాశీర్వాచనంబు లాచరించి యింద్రాది దిక్పాల
కుల నాలింగనాది కృత్యంబుల సన్మానించి సకలదేశాధీశు లగు రాజోత్త
ముల నంతఃకరణ దృష్టి నవలోకించిఁ బుణ్యాంగనా జనంబులు సేస లిడ
నందర తోడ నగవలిఁ గక్ష్యాంతరంబులు గడచి, వజ్రసోపాన సముచిత
ద్వారాష్టక సంయుతంబును, దివ్యమౌక్తిక తోరణ సహస్రాలంకృతంబును,

బాలబ్రహ్మేశ్వరుండు మాధవాబ్జ భవ పురందరాదుల తోడ
సభామండపంబునం దాసీనుండగుట

మాణిక్య స్తంభ దివ్యప్రభాచ్ఛాదిత దిగంతంబును, వైడూర్య పద్మ రాగ స్థగిత శాతకుంభోరు కలశ సందోహాభ్రంకషంబును, నానా రత్న రచిత చిత్ర సాలభంజికా సమూహ విరాజితంబును, బురందర మణిస్థగిత గాంగేయ కవాటగేహళీ పరివృతంబును, రవికాంత మణికదంబ సంఘటిత సువర్ణరుచిర కుడ్యోన్నతంబును, బహువిధ కుసుమ మాలికా గంధబంధు రంబునగు గొలువుకూట మంటపంబున కేతెంచి యచ్చటి కంతకుమున్న వచ్చి దర్శనంబున కెదురుచూచు బంధుహిత మంత్రి సామంత భృత్య వర్గంబు లనాదరించి యప్పు డందర నుచితపీఠంబుల నుండ నియమించి దాను దత్సభామధ్యంబున రుచిరమణి పీఠాసనాసీనుండై సేవకజనంబు లిరుగడల రమణీయచ్ఛత్ర చామరాందోళికంబులు బట్టి యతి భక్తిగొలువ నక్షత్ర పరివృతుండగు పూర్ణచంద్రుండునుం బోలె దేజరిల్లుచు నప్పుడు 146

క. గురుతర మణిపీఠంబున
సురుచిరముగ నుండి దివ్యశోభన దృష్టి
స్ఫురణంబున నను గనుగొను
మురహరు వీక్షించి పలికె ముదముఁ దలిర్పన్ 147

క. గజరాజ వరద మాధవ
సుజనావన భువన వినుత సురుచిర విభవా!
కుజనహర! నిత్య శుభకర
రజనీచర నికర హరణ రమ్య వితరణా! 148

సదాశివుండు నారాయణు నభినుతించి దక్షుని
మాహాత్మ్యం బెన్నుట

క. ఘనమగు విజ్ఞానముచే
నిను మనమునఁ జేర్చి కొలుచు నియతాత్మలకున్
వినుతింప దుర్లభంబై
యొనరెడు మోక్షంబుఁ గూర్మి నొసఁగుదువు హరీ! 149

క. అనయంబు భవత్ప్రియులగు
జనముల కెచ్చోటనైన నాపదఁ గలదే!
ఘన విజ్ఞాన నిపుణులై
యనుపమముగఁ దిరుగుదురు నిరామయు లగుచున్. 150

వ. మహాత్మా! యీ దక్షుండు భవచ్చరణారవిందంబులం గూర్చి యనేక సంవత్సరంబులఁ దపం బాచరించి భవదనుగ్రహంబున మోక్షంబు వడయుటయ కాక లోకంబుల ననేక ప్రాణి సముదయంబుల సృష్టించి రెండవ పరమేష్ఠియై జగంబులఁ దన యాజ్ఞన్ ప్రవర్తింప మహదైశ్వర్య సంపన్నుండై, నిర్మల జ్ఞానంబున నసంసారి యయ్యును సంసారి చందంబున గృహంబునందు భార్యా సమేతుండై క్రీడింపుచు, సుగుణ గణ ధన్యలగు ననేక కన్యలం గనిఁ ప్రియపూర్వకంబుగాఁ దగువారల కొసంగి జగత్ప్రసిద్ధంబుగా వివాహంబులు సేసె; నిమ్మహానుభావుని సుకృత విశేషంబులు గణింప శేషునకైన నలవిగా దింతయు భవత్కటాక్షంబు గాదే! భవన్నిగ్రహానుగ్రహంబు లఖిలలోక నాశక్షేమకరంబులై ప్రవర్తిల్లుఁ గావున సర్వేశ్వరుండవు, సర్వగురుండవు, సర్వవ్యాపకుండవగు నీ మాయా ప్రభావంబు నీవ యెఱుంగుదువు గాక, నితరులఁ దెలియ నెంతవారని యనేక విధంబులం గొనియాడి దివ్యగంధ మాల్యాంబరాభరణంబులఁ బూజించి యభివందనంబులు సేసె నట్టియెడ. 151

క. సురముని భూసుర కిన్నర
వరు లానందించి రఖిల వాద్యరవంబుల్
సరిజెలఁగెఁ బుష్పవర్షము
లురుతరముగఁ గురిసెఁ బవనుఁ డొయ్యన వీచెన్. 152

సదాశివుం డందఱకు దివ్యాంబరా భరణంబు లొసగుట

వ. ఇట్లు నారాయణుం బూజించి తదనంతరంబున 153

క. చతురాస్యున కసురద్విన్
వితతంబుగఁ బూజసేసి వినుతించి జగ
న్నుత దివ్యాంబర భూషణ
వితతులు నర్పించె విబుధ వితతి చెలంగన్. 154

తే. గీ. నిందు వేడుకతోడ నాఖండలాది
దిక్పతుల నోలి బూజించి దివ్యవస్త్ర
భూషణంబు లొసంగి సత్పూజ్యుఁడైన
దక్షుఁ గనుఁగొని యుల్లసితాక్షుఁ డగుచు 155

క. సామజవరదుని కరుణన్
శ్రీమహిమోన్నతుఁడ వగుచుఁ జెలువొందితివో
మామా! యిటు రమ్మని స
త్ప్రేమంబుగఁ బూజ సేసి పృథు భక్తిమెయిన్ 156

క. ఘనవస్త్రాభరణంబులు
వినయంబున నొసఁగి యంత విభవోజ్జ్వలులౌ
దన మంత్రులఁ బనిచెను ద
క్కిన వారలఁ బూజసేయఁ గృపదళుకొత్తన్ 157

వ. ఇట్లమ్మహాదేవుని యనుజ్ఞ వడసి మంత్రివరు లుల్లసిల్లుచు సకల దేవ ముని భూసుర సిద్ధసాధ్య యక్ష కిన్నర గరుడ గంధర్వాదుల సుగంధ మాల్యంబులన్ క్రమంబునం బూజించి దివ్యాంబరాభరణ ధనంబు లొసంగి వెండియు నిఖిలదేశాధీశులగు రాజోత్తములకు సమర్యాదంబుగా దివ్య చందన కుసుమ చేల కలాపంబు లిచ్చి వివిధ యాచక తండంబులకు వలసిన వస్తువాహన ధనంబు లవారిగ బహూమతులు సేసి రట్టియెడ నంతః పురంబున నమ్మహాదేవి యగు సతీలలామ సంతసంబున రమాసరస్వతీ శచీదేవుల దివ్యచందన హరిద్రా కుంకుమ కుసుమాక్షతంబులం బూజించి రమ్యవస్త్ర కంచుకాభరణంబులు సమర్పించి తదనంతరంబుఁ దక్కినవారలం బూజింపఁ గిరవాణి మొదలగు సఖీజనులంబంచిన వారలతి ముదంబున దేవముని భూసుర యక్ష కిన్నర గరుడ గంధర్వ సిద్ధ విద్యాధర పార్థి వాంగనల నుచిత క్రమంబున నర్చించి రుచిర వసన కంచుక రత్నాభరణ ధనంబు లొసంగి రా సమయంబునఁ గొలువు కూటంబు నందుండు సభ వారలంద రానందంబునం బొంగుచు,నొక్కమొగి నా సదాశివు నవలోకించి సవినయంబున నిట్లనిరి.

సభవారలందఱు గొల్వుకూటంబున సదాశివుం గొనియాడుట

సీ. జయ సర్వలోకేశ! జయకల్మషవినాశ!!
జయ సతీ ప్రాణేశ! జయమహేశ!!
జయ సత్కృపాపాంగ! జయవారిధి విషంగ!!
జయదైత్య మదభంగ! జయ సుసంగ!!
జయవార్ధి గంభీర! జయజగన్నుత శూర!!
జయభోగి వరహార! జయ సుధీర!!
జయ రమ్య గుణజాల! జయభక్తజనలోల!!
జయమన్మథ విఫాల! జయశీల!!

జయమహాదేవ! శంకర! శశికిరీట!!
జయపురాంతక! భూతేశ! సాధువరద!!
జయమహానంద! దివ్యవిజ్ఞాన నిలయ!!
జయ సదాశివ! సూర్యాగ్ని చంద్ర నయన!! 159

క. భూలోకమందు జనుల
న్పాలింపగ నాత్మనెంచి భవ్యస్ఫురణన్
బాలబ్రహ్మేశ్వరుఁ దన
లాలితముగ వెలసితి వలంపురి యందున్ 160

తే. గీ. చెన్ను మీఱంగ మీ చర్య లెన్నుకొనుచు
భాసురంబుగ నిక మా వివాసములకుఁ
బోయి విచ్చేతు ముంచుముఁ బూర్ణకరుణ
చిర శుభాకార! సంతత శ్రీవిహార!! 161

వ. అని బహు విధంబులం గొనియాడి దండప్రణామంబు లాచరించిఁ దమ తమ నివాసంబులకుం బోవ ననుజ్ఞ యిండనప్పుడు నమ్మహాను భావుండగు బాలబ్రహ్మేశ్వరుండు సంతసంబున వీడు కొలుప నప్పుడుఁ గేశవాబ్జ భవులు రమా సరస్వతీ సహితులై నిజ పరివారంబులుఁ గొలువ భేరీ మృదంగాది వాద్యంబులు మ్రోయ గరుడ మరాళ వాహనారూఢులైఁ దమ

లోకంబులకుం జనిరి. నిఖిల బృందారక బృందంబులు నిజవధూసమేతులై విమానంబు లెక్కి యుభయ పార్శ్వంబుల నేతేర జంభాంతకుండు శచీ యుక్తుండై మంగళ వాద్య రవంబులఁ జెలంగ నైరావతారూఢుండై త్రివిష్ట పంబునకుం జనియె. నిఖిల మునీంద్రులతి సంతసంబునం గదలి శిష్య ప్రశిష్య సంఘంబు లనేక వస్త్రాభరణ ధనంబులు మోచుకొని తోడం జనుదేర నిజపత్నులం గూడి దమ తమ యాశ్రమంబుల కరిగిరి,

బాలబ్రహ్మేశ్వరుని యనుజ్ఞ వడసి యందఱుఁ
దమ తమ నివాసంబులకుం జనుట

వ. నిఖిల దేశాధీశులగు రాజోత్తము లతి ముదంబున సభార్యులై మంత్రి భట వర్గంబులఁ గొలువ రథ గజ హయాధిరూఢులై భేరీ మృదంగ కాహ ళాది వాద్యరవంబులు మిన్నుముట్ట నెలంగుచు నిజదేశంబులకుం బోయి రంత దక్షుండు సభార్యాయుక్తుండై గూఁతురు నల్లునిం దీవించి వీడ్కొని నిజ పరివారంబుతోడం గదలి శిష్య సంఘంబులఁ గొలువఁ దన నగరంబు నకుం జనియె; నిట్లందఱు నిజ నివాస స్థలంబులకుం బనిచి వారల భక్తి స్నేహవిశేషంబులఁ గొంతఁ దడవు మనంబునం దలపోసి యనంత రంబున నాస్థానంబు వెడలి యంతఃపురంబునకుం జనియె; నిట్లు సతీ యుక్తుండై యప్పరమాత్ముండగు బాలబ్రహ్మేశ్వరుండు మంత్రి సామంత మిత్ర భట వర్గంబులఁ గొలువ నఖండ వైభవమున భక్తజనుల కిష్టార్థంబు లొసంగుచు జగంబుఁ బాలింపుచుండెనంత. 162

సీ. నిర్జరేంద్రుని యాజ్ఞఁ బర్జన్యుఁ డవనిపై
తుష్టిగా నెపుడు సువృష్టి గురియ
మెండైన ఘాసము ల్మెక్కిధేను గణంబు
లమలంబులైన క్షీరము లొసంగ
బుడమి నెల్లెడలందు నెడలేక సస్యముల్
నలువొంద నఖిల ధాన్యములుఁబండ
యీతిబాధలు లేక నెల్లకాలము లందు
ననువుగా నారోగ్య మావహిల్ల

వర్ణనిర్ణయ విధములు వదలకెపుడు
నోజఁగడు భోగభాగ్య సంయుక్తు లగుచుఁ
జెన్ను మీఱంగ నా సదాశివుని కరుణ
నింపుఁదళుకొత్త సుఖముండి రెల్ల జనులు 163

మహాశక్తియగుఁ బ్రకృతి యష్టాదశ నామధేయంబుల
నష్టాదశ పీఠంబులందుండు విధంబు జెప్పుట

వ. మఱియు నొక్క విశేషంబుఁ గలదు; వివరించెద, నమ్మహానుభావుండగు సదాశివుండు లోకంబున భక్తజనుల కిష్టార్థంబు లొసంగి రక్షింప నెచ్చ టెచ్చటఁ బ్రసిద్ధంబుగ వెలసియుండు, నచ్చటచ్చట నమ్మహాప్రకృతి యగు దాక్షాయణి సాధుస్వరూపంబున నప్పరమేశ్వరు సేవింపుచు మఱియుఁ బ్రత్యేకంబున ఘోరరూపిణియై వెలసి జను లొసంగు మద్య మాంసాది పదార్థంబు లాహారంబుగా నంగీకరింపుచుండు; నెట్లనిన 164

శ్లో. లంకాయాం శాంకరీదేవీ
కామాక్షీ కాంచికాపురే ।
ప్రద్యుమ్నే సింహళాదేవీ
చాముండా క్రౌంచపట్టణే॥

శ్లో. అలంపుర్యాం జోగులాంబా
శ్రీశైలే భ్రమరాంబికా ।
కొల్లాపుర్యాం మహాలక్ష్మీ
మహుర్యాం రేణుకా తథా॥

శ్లో. ఉజ్జయిన్యాం మహాకాళీ
పీఠాయాం పురుహూతికా ।
ఓఢ్యాణే గిరిజాదేవీ
మాణిక్యే చక్ర కోటికా॥

శ్లో. కురుక్షేత్రా కామరూపీ
జ్వాలాయాం వైష్ణవీ తథా ।

ప్రయాగే ప్రమథా దేవీ
గయే మాంగల్య గౌరికా॥

శ్లో. వారాణస్యాం విశాలాక్షీ
కాశ్మీరే చ సరస్వతీ ।
అష్టాదశేషు పీఠేషు
శక్తయో ముని సంస్తుతాః॥

శ్లో. తాసాం స్మరణ మాత్రేణ
మృత్యు దారిద్ర్య నాశనమ్ ।
శత్రోః పలాయనం చైవ
సర్వలోక వశంకరమ్॥

యస్మయా పఠతే స్తోత్రం
జపసిద్ధి మవాప్నుయాత్॥

వ. అని యిట్లు పూర్వాచార్య వచనంబులు గలవు గావున—

1. లంకాపట్టణంబున శాంకరీదేవి యనియు
2. కాంచీ పట్టణంబునఁ గామాక్షి యనియు
3. ప్రద్యుమ్న మందు సింహళాదేవి యనియు
4. క్రౌంచ పట్టణంబునఁ జాముండిక యనియు
5. అలంపురంబున జోగులాంబ యనియు
6. శ్రీశైలంబున భ్రమరాంబిక యనియు
7. కొల్లాపురంబున మహాలక్ష్మి యనియు
8. మాహురి యందు రేణుక యనియు
9. ఉజ్జయినీ నగరంబున మహాకాళి యనియు
10. పిఠాపురంబునఁ బురుహూతిక యనియు
11. ఓఢ్యానంబున గిరిజాదేవి యనియు
12. మాణిక్య నగరంబునఁ జక్రకోటిక యనియు
13. కురుక్షేత్రంబునఁ గామరూపి యనియు

14. జ్వాలా పట్టణంబున వైష్ణవి యనియు
15. ప్రయాగయందుఁ బ్రమథాదేవి యనియు
16. గయ యందు మాంగల్య గౌరిక యనియు
17. వారణాశి యనంబరగుఁ గాశీపట్టణంబున విశాలాక్షి యనియు
18. కాశ్మీరంబున సరస్వతి యనియు

నిట్లష్టాదశ పీఠంబులం దష్టాదశ రూప నామంబులు వహించి. లోకంబున జను లర్పణంబు సేయు బలుల నంగీకరించి యిష్టార్థంబు లొసంగుచుండు గావున నీ యలంపురంబున జోగులాంబ యనం బ్రసిద్ధి వహించె; నిట్ల జ్జగదీశ్వరుండగు బాలబ్రహ్మేశ్వరుండు సకల పరివార యుక్తుండై లోక పాలనంబు సేయుచుఁ గ్రమంబునఁ గృత త్రేత ద్వాపర యుగంబులందుఁ బుణ్యాత్ములగు జను లొనర్చు నమస్కార పూజనంబులుఁ బ్రత్యక్షంబున నంగీకరింపుచు నిష్టార్థంబు లిచ్చుచుండు. కలియుగంబున మనుష్య లల్ప బుద్ధులుఁ గావున గూఢ భావంబు నొందిఁ బరివారం బంతయుఁ బాషాణ ప్రతిమంబులై యుండఁ దాను లింగ స్వరూపంబు నొంది నమస్కారాభి షేక పూజనంబులఁ గైకొనుచు జనంబుల కిష్టార్థంబు లొసంగుచుండు; నమ్మహానుభావుండు సర్వ స్వతంత్రుండుఁ గావున యోగమాయా సహి తుండై స్వేచ్ఛా ప్రవర్తనంబున నుండు నని సతీ బాలబ్రహ్మేశ్వరుల వివాహ క్రమంబంతయు సవిస్తరంబుగాఁ బరమహర్ష సమేతుండగు నా సూతుండుఁ జెప్పిన విని శౌనకాది మహామును లత్యానంద మగ్నులై యా సూతుని మనీషా విశేషంబు లనేక విధంబులం గొనియాడిరి. 165

కృతినాయకుండగు శ్రీకృష్ణుని గ్రంథకర్త ప్రార్థించుట

వ. ఈ వృత్తాంతం బఖిలలోకస్తుత్యుండును, బ్రహ్మవిద్యా విశారదుండును, విద్వజ్జన పయః పారావార రాకాసుధాకరుండును నగుఁ బోతన కవీం ద్రుండు శ్రీమద్భాగవతంబను మహా పురాణంబునఁ జతుర్థ స్కంధంబు నందు దక్షుండుఁ దన కూతురగు సతియను కన్యకను జన్మమరణాది నివర్తకుండగు నభవునకుం బెండ్లి సేసెనని సంక్షేప రూపంబున నుదాహ రింపటం జేసి యా వృత్తాంతంబుఁ బ్రపంచ క్రమంబునం జరిగియుండు

నని నా మనంబున నూహించి యయ్యభవుని బాలబ్రహ్మేశ్వరునిగా భావించి లోకంబునం దార్యజనంబులు సంతసింప నీ క్రమంబున బహుళంబుగ నీ ప్రబంధంబు భవత్కటాక్షంబున మదీయ స్వాంతంబునం దోచినంత రచయించితిం గావున 166

సీ. నిరతంబు సుజ్ఞాన నిష్ఠద్రైఁ బొగడొందు
విదురుం దొనర్చిన విందు నందుఁ
గొమరొందు భక్తిచేఁ గుబ్జ యొసంగిన
లలితమౌ గంధమాల్యములయందు
గోర్కె నారాధించి గోపిక లర్పించు
ఘనమైన వెన్న మీగడల యందు
మోదమ్ముతోడ యశోదమ్మ యిచ్చిన
భాసురంబగుఁ జనుబాలయందు

నటుఁ గుచేలుఁ డొసంగిన యటుకులందు
నెంతఁ బ్రియ ముంచితివొ యిప్పుడే నొసంగు
సరసమగు నీ ప్రబంధ భూషణమునందు
నంతఁ బ్రియముంచి ధరియింపుమయ్యఁ గృష్ణ! 167

వ. మఱియును. 168

సీ. విద్యార్థులకు సర్వవిద్యలు బ్రోషించు
నర్థార్థులకుఁ జాల నర్థమొదవుఁ
బరిణయార్థులకు సత్పరిణయంబు ఘటిల్లు
భోగార్థులకు మహా భోగమమరుఁ
బుత్రార్థులకు మంచిపుత్ర సంతతిఁ గల్గు
విజయార్థులకు భూరివిజయ మలరు
మోక్షార్థులకు నిత్యమోక్షంబుఁ జేకూరు
జ్ఞానార్థులకును సుజ్ఞానమబ్బు

నీ ప్రబంధంబు నర్థితో నెపుడు వినినఁ
జదివినను వ్రాసినను నర్థసమితిఁ దెలియఁ
జెప్పినను నట్టి జనులకుఁ జెన్నమీఱ
ననుచు వరమివ్వు మీ గ్రంథమునకుఁ గృష్ణ! 169

మత్తకోకిల :

సారసాక్ష సురేంద్ర మిత్ర! విశాలపక్ష జనార్దనా!!
నారదాది మునీంద్ర సన్నుత! నవ్యమౌక్తిక భూషణా!!
ధీరతోషణ వారణార్చిత! దీర్ఘపాప విశోషణా!!
భూరి సద్గుణ రాజితాఘన! పుణ్యమానుష ముక్తిదా!! 170

తరళ :

కువలయప్రియ సన్నిభానన కోటి మన్మథ సుందరా!
నవసుధారస మంజుభాషణ నవ్య కౌస్తుభ కంధరా!
భువన మోహన నిన్ను నెప్పుడుఁ బూని నే భజియించెదన్
భవ వినాశన నా కొసంగుము భవ్యమోక్ష సుఖోన్నతుల్. 171

భుజంగ ప్రయాతము :

పరాకేల శ్రీకృష్ణ పంకేజనాభా!
పరోక్షత్వ మింకేల భవ్య ప్రచారా!
సురానీక రక్షిసుశోభా కటాక్షా!
ధరాభార శోషా! సదాపీత దోషా!! 172

మాలిని :

నిరుపమగుణజాలా! నిర్మలానంద లీలా!!
కరతల ధృతశైలా! కామినీ కేళిలోలా!!
పరహిత నవహేలా! పద్మసద్మానుకూలా!!
గురు బుధ జనతోషా! గోకులాహ్లాద వేషా!! 173

## గద్య

ఇది శ్రీపరమేశ్వర గురుకటాక్షలబ్ధ కవితా చమత్కార నందవర వంశోద్భవ కుత్స సగోత్ర పవిత్ర బొడ్డిచర్ల జ్వాలయామాత్య పుత్ర రంగయామాత్య పాలక కుమారార్య సేవాధురంధర సరస పాండిత్య సుకవిజనవిధేయ చెన్నకృష్ణనామ ధేయ ప్రణీతంబైన సతీపరిణయంబను మహాప్రబంధంబునందు సూతుండు భగవ త్ప్రార్థనంబు సేసి కథా వృత్తాంతంబుఁ జెప్ప నారంభించుటయుఁ, బ్రావృట్కాల వర్ణనంబును, దక్షుండుఁ దన కూతురగు సతీదేవి రావించి వాత్సల్యంబునం గార వించి శాస్త్రోక్తంబులగు వధూవర లక్షణంబులుఁ దెలిపి, "తల్లీ! నీకుఁ దగిన వరు నెవ్వటఁ దెత్తునో" యని పలుకుటయు, తత్కాలంబున సమీపమునందున్నఁ గీరవాణిఁ దానంతకుమున్ను సదాశివు పాలికింబోయి వచ్చిన వృత్తాంతంబు దక్షునకు విన్న వించి యీ సతీదేవి చిత్తంబు బాలబ్రహ్మేశ్వరునందు జెందియుండునని విన్నవించు టయు, దక్షుండు సంతసించి యాశ్రమవాసులగు మహర్షుల రావించి వివాహాలోచ నంబు సేసి ముహూర్త నిశ్చయంబు సేయించి, యలంపురంబునకు శుభలేఖా యుక్తంబుగా బ్రాహ్మణులం బనిచి దిక్పాలకాది దేవతలకు శుభపత్రికలుఁ బంపు టయు, పట్టణాలంకారంబును, దక్షుండు భగవంతుండగు నారాయణు నారాధించి యనేక విధంబుల నుతించిఁ బుత్రికా వివాహ నిశ్చయంబు దెల్పి, యీ కార్యంబు నెరవేర్ప నీవస్వతంత్రుండవనిఁ బ్రార్థించుటయు, నారాయణుండు సంతసించి దక్షునకుఁ గామధేనువు నొసంగి యంతర్ధానంబు నొందుటయు, బ్రహ్మాదిదేవతలు నారాయణు సన్నిధికిం జని యోచించుటయు, బ్రహ్మాది దేవతా సహితుండై నారాయణుండు భూలోకంబునకుం జనుదెంచి యందఱ నలంపురంబున కనిచిఁ దాను నిజ పరివారంబుతోడ దక్ష నగరంబునకు వచ్చుటయు, సకల దేశాధీశులగు రాజోత్తము లలంపురంబునకు పరివార యుక్తులై యేతెంచుటయు, మహాముని సముదయా గమనంబును, బాలబ్రహ్మేశ్వరుండు స్నాతక కృత్యంబుఁ దీర్చి తీర్థయాత్రకుం జను సమయంబున విష్ణుండు వటురూపంబునం బొడసూపి మత్సో దరి యగు సతీదేవిని వివాహంబై లోకంబుఁ బాలింపు చుండుమని మరల్చిఁ దాను బూజితుండై దక్ష నగరంబున కేతెంచుటయుఁ బాలబ్రహ్మేశ్వరుండు సకల పరివార యుక్తుండై దక్ష నగరంబునకుఁ బెండ్లికిం దరలి వచ్చుటయు, దక్షుండు సకలజన పరివృతుండై యా సదాశివుం బూజించి పరివారయుక్తంబుగాఁ గల్యాణ మంట పంబునకుం దోడి తెచ్చుటయు, సతీ బాలబ్రహ్మేశ్వరుల వివాహంబును, దక్షుం

దందఱ భోజనాది కృత్యంబులఁ దృప్తులంజేసి దివ్యాంబరాభరణాదు లొసంగు టయు, బాలబ్రహ్మేశ్వరుండు వధూయుక్తుండై యందఱతోడ నలంపురంబునకు వచ్చి గృహప్రవేశంబగుటయు, మరునాడయ్యీశ్వరుండు కొల్వుకూటంబున నందఱ బహూకరించి దివ్యాంబరాభరణాదు లొసంగి వీడ్కొలుపుటయు, గేశవాబ్జభవ పురందరాదులు సపరివారులై స్వస్థానంబుల కేగుటయు, బ్రహ్మేశ్వరుండు సతీ యుక్తుండై సకల పరివారంబుఁ గొలువ లోకపాలనంబు సేయుచుండుటయు, జోగులాంబా వృత్తాంతంబును, యుగ చతుష్టయంబునందుఁ గ్రమంబున నబ్బాల బ్రహ్మేశ్వరుండుఁ బుణ్యాత్ములకు సాక్షాత్కరించు విధంబు జెప్పుటయు నను కథలుం గల సర్వంబును తృతీయాశ్వాసము.

శ్రీకృష్ణ పరబ్రహ్మార్పణ మస్తు

సంపూర్ణము